సెబాష్ రామూ మేచ్ ని గెలిపించావు—చొక్కా మురికైతే ఏంపోయిందని!



"నా చొక్కాదే గెలుపు
—మళ్ళీ ఎంత తెల్లబడిందో!"

# హై పవర్ సర్ఫ్
# అమిత తెల్లగా ఉతుకుతుంది...అమిత తెల్లగా, కనువిందుగా!

సెబాష్ సర్ఫ్! అమ్మకి యిందులో పాలుంది— నిజానికి మురికిని తీసిపారేసే ఛాంపియన్ హై పవర్ సర్ఫ్ అమ్మకి తోడు. సర్ఫ్‌లో, మరింత చురుకుగా పనిచేసే పదార్థాలుండటం వల్ల, అది మురికినంతటినీ తీసేసి అమిత తెల్లగా ఉతుకుతుంది. ఇంత చేసినా మరి సర్ఫ్ మీ బట్టల్ని శ్రద్ధగా చూసుకుంటుంది, మీ చేతుల్ని సున్నితంగా చూసుకుంటుంది.

ఏ గృహిణినైనా అడగండి— ఉండటానికైతే వందలకొద్దీ పౌడర్లున్నాయిగాని తను నమ్మేది ఒక్క సర్ఫ్ మాత్రమేనని.




**తెల్ల బట్టలకి సెబాష్ తెలుపు, రంగు బట్టలకి సెబాష్ గెలుపు**

LINTAS-SU.253.2316 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ వరశివాభ్యాంనమః

# ఆంధ్రపత్రిక





## రుధిరోద్గారినామసంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,
'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణించబడినది

## పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో

## త్వరలో వెలువడనున్నది.

## విడి ప్రతి వెల రూ. 4-00

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధినగరం, విజయవాడ — 3




## ముఖచిత్రం

సినీనటి సుహాసిని ముఖచిత్రం (31.12.82) తెలుగువారి ఆడపడుచుని గుర్తుకు తెస్తుంది. ధర్మపథంలోని నిర్వ్యాపారత, శీర్షికలన్నీ ఆకర్షణీయంగా, కథల్లోని సన్నివేశాల రూపకల్పనా చిత్రాలు బావున్నాయి.

అచ్చయ్య కర్నాటి (సంస్థాన్ నారాయణపూర్)

*　　*　　*

7—1—83 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ముఖచిత్రం "పట్టానికి వేయి కళ్ళు"లో కృష్ణ ముచ్చటగా ఉండి మమ్మల్ని మురిపింపజేసినది. కథలు అన్నీ చాలా బాగుగా వున్నాయి.

డి. యస్. రావు, పీర్ అహమ్మద్ (అలహాబాదు)

*　　*　　*

7—1—'83 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటి, స్వప్న రమణీయంగా ఉంది. మధ్యపేజీలో 'శ్రీదేవి' ఈ వారం పత్రికకు జీవము పోసినట్లుగా ఉంది.

కె. కుమార్ చౌదరి (కాశీబుగ్గ)

*　　*　　*

7—1—83 ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా అభిమాన నటుడు 'జేమ్స్‌బాండ్ హీరో కృష్ణ' ముఖచిత్రంతో వెలువడి మమ్మెంతగానో ఆకట్టుకొంది. అలాంటివి మరెన్నో వేయాలని ఆశిస్తున్నాము.

ఎ. రామచంద్రరావు (నిజామాబాదు)

## సజాతిధృవాలు

"రాజలక్ష్మి కొలాస్కర్" గారి కథ— "సజాతి ధృవాలు" ప్రతివారిని ఆలోచింప జేసేదిగా వుంది. శేషమ్మ లాంటి చీడపురుగులున్నంత కాలం ఈ సమాజ పరిస్థితి ఇంతే. ఈ కథ చదివి ఏ కొందరైనా మారితే, ఈ రచనను రూపొందించిన రచయిత్రి కృతకృత్యులైనట్లే.

కడియాల సురేష్‌బాబు (మంగళగిరి)

*　　*　　*

31.12.82వ సంచికలో ప్రచురించిన కథ సజాతి ధృవాలు సూపర్బ్. పెద్దల మూర్ఖత్వానికి పిల్లలు ఎలా బలి అవుతారో రచయిత్రి వ్రాసిన తీరు అద్భుతం. శ్రీ రాజ్యలక్ష్మి కొలాస్కర్ గారికి అభినందనలు.

కె. శ్యాంసుందర్, కె.ఎస్. మణి (గుంటూరు)

*　　*　　*

రాజ్యలక్ష్మి కొలాస్కర్ గారు వ్రాసినటువంటి సజాతి ధృవాలు కథ చాలా బాగుంది. అది నా మనసును కదిలించి వేసింది. అంత మంచి కథ రాసిన కొలాస్కర్‌గారికి నా యొక్క కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

బి. వి. ఎస్. మూర్తి (కొత్తగూడెం)

31—12—82 తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన 'సజాతధృవాలు' కథలో సుధాకర్— ఆర్.హెచ్. నెగటివ్, శ్రీనిజ—ఆర్. హెచ్. పాజిటివ్ అని ఇచ్చి—అబార్షన్ జరుగుతుంది . . . స్టిల్ బర్త్ జరుగుతుంది. . . . లేక బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ ఇవ్వాల్సొస్తుంది అని వ్రాసినారు.

నిజానికి భర్త ఆర్. హెచ్. నెగటివ్ అయి, భార్య ఆర్. హెచ్. పాజిటివ్ అయితే పై కాంప్లికేషన్స్ రానేరావు.

కాని భార్య ఆర్. హెచ్. నెగటివ్, భర్త ఆర్. హెచ్. పాజిటివ్ అయిన పక్షంలోనే పై కాంప్లికేషన్స్ వస్తాయి.

ఈదులపల్లి శాంత (నెల్లూరు)

## కథలు

'సుహాసిని' ముఖచిత్రంతో వెలువడిన 31—12—82 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రికలో కొలను వేంకట దుర్గాప్రసాద్ గారి 'ఇల్లు' కథానిక చాలా ఆసక్తిగా వుంది. నందం రామారావు గారి ఇది 'సంధ్యా సమయం' పెద్దకథ చాల ఇంటరెస్టింగ్‌గావుంది. 7.1.83నాటి ఆంధ్రసచిత్రవార పత్రిక నటశేఖర కృష్ణ ముఖచిత్రం చూడ ముచ్చటగా వుంది. ఇదే సంచికలో గుండు సుబ్రహ్మణ్య దీక్షితులు గారి 'ఏకదంతం' కథానిక వాస్తవంగా వుంది. ప్రమోషన్‌కోసం అడ్డమైన కేసుల్ని హెడ్ క్వార్టర్స్‌కి తెచ్చి యస్పైతో నానాతిట్లు తినే ఏకదంతాలు మనకి అక్కడక్కడ దర్శనమిస్తూనే వుంటారు. మంచి కథని రాసిన రచయితకి నా ధన్యవాదాలు.

జి. సాంబశివరావు (నేలకొండపల్లి)

## న్యూఢిల్లీ లేఖ

తే. 14.1.83 సంచికలోని డాక్టర్ జయ దుబాషిగారి న్యూఢిల్లీ లేఖ చాలా వాస్తవంగా ఉంది. గాంధి చిత్ర నిర్మాణం వెనుక దాగివున్న ఎన్నో నగ్న సత్యాలను బహిర్గతం చేశారు. హిందూతత్వం అనేది తీసేస్తె మిగతా వందలాది దేశాలలో ఒకదేశం అన్న మాటలు ఆణిముత్యాల్లా ఉన్నాయి. కాని దురదృష్టవశాత్తు మన సంస్కృతి తరచూ విదేశీయుల ప్రత్యక్ష పరోక్ష దాడులకు గురియగుచున్నది. చివరకు రాజ్యాంగంలోని సెక్యులరిజం అనే అంశానికి వక్ర భాష్యాలు చెబుతూ దేశ నాయకులు కూడా హిందూ సంస్కృతికి సమాధులు కట్టాలని ప్రయత్నిస్తున్నారు.

సురభి విష్ణువర్ధన్ (వనపర్తి)

*　　*　　*

డాక్టర్ జయాదుబాషిగారి న్యూఢిల్లీ లేఖ ప్రతి వారం మమ్మల్ని వికసింపజేస్తుంది. డాక్టర్ దుబాషి ఎంతో చక్కగా, చదువరులలో ఆలోచన రూపొందించేలా ప్రభుత్వంలోని లోపాలు చూపిస్తున్నారు. వారికి మా అభినందనలు.

శ్రీకాకుళపు రామకృష్ణ (గుణదల)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 4–2–'83

దుందుభినామ సం. పుష్య-మాఘ. బ. సప్తమి

సంపుటము 75 : సంచిక 23

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1–50 |
| ఆరుమాసాల చందా | రు. 42–90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 85–80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక





## లోకం పోకడ * ఊమెన్

కాంగ్రెసు (ఇ)

"తగినంత మోతాదులలో ఈ మందు మీరు ఇచ్చి ఉండరు"

జనతా పార్టీలో చేరండి మీ సమస్యలన్నీ మేము పరిష్కరిస్తాము

చంద్రశేఖర్ భారత పాదయాత్రకి బయలుదేరారు..

పాత సిండికేట్ వాడినైన నేను కర్నాటకలో కాంగ్రెసు పరాజయం చూడటానికి ఇంతవరకూ బతికి ఉంటానని ఎవరనుకున్నారు!!

నిజలింగప్ప

ఎన్నికలలో విజయం

చిన్న బరువు ఎత్తారు. అంతకన్నా ఎంతో పెద్దబరువు యింకా ఎత్తాల్సిఉంది..

ఎన్.టి.ఆర్

రాష్ట్ర పరిపాలన

OOMMEN

# అబద్ధపు వాగ్దానాల ఫలితం!

శ్రీమతి గాంధీ ఆమెకి తగిలిన దెబ్బకు దిగ్భ్రాంతి చెందారు ఆవిడ వినేట్లయితే కారణం నేను చెప్పగలను. ఆమె అబద్ధపు వాగ్దానాలే దానికి కారణం.

సాధారణ ప్రజలు ఎప్పుడు 'కాక్‌టైల్ పార్టీ'లకు హాజరయి ఉండరు, ధీరేంద్ర బ్రహ్మచారిలాగ వారెప్పుడు రాష్ట్రపతి యిచ్చే పార్టీలకు ఆహ్వానింపబడి ఉండరు. వారికి పత్రికలంటె ఎలా ఉంటాయో అస్సలు తెలీదు, కురకారు వ్రాసిన రాజకీయ వ్యాఖ్యలు చదివి ఉండరు కానీ, వాస్తవమేదో, కానిదేదో తెలుసుకోగల విచక్షణా జ్ఞానం వారికి ఉంది. వాళ్ళకి స్వంత రేడియోలు ఉండవు. టి వి. అంటె ఎలా ఉంటుందో చూసి కూడా ఉండరు. అంతర్జాతీయ ద్రవ్యనిధి అనేమాట అస్సలు వినే ఉండరు. కానీ, వారు మంచి యిది, చెడు యిది అని ధైర్యంగా చెప్పగల శక్తి కలిగి ఉంటారు ఒకవేళ మంచి ముసుగులో చెడు ఉన్నా వారు గుర్తించ గలరు. ఆ విధమైన ప్రజలు వోటు వేయ డానికి వెళ్ళినప్పుడు ఎంతటి శక్తి కలవారైనా నిజం బయటపడే సమయంలో ఒక్క క్షణం కంపించక మానరు.

అటువంటి ప్రజలు గుండూరావు, ఇబ్రహీం వంటి గూండాలకు ఓట్లు వేస్తారా? కొందరు పాత్రికేయుల, జేబులు నింపుకునే రాజకీయ వాదుల ఊహల్లో మాత్రమే ఉన్న శ్రీమతి ఇందిరాగాంధీ కాంగ్రెసుకు ప్రజలు ఎందుకు ఓట్లు వేస్తారు?

శ్రీమతి ఇందిరాగాంధీ కాంగ్రెసు పార్టీ అంతా మాయ! దాని నిర్మాణం, (కాగితం పైనే) దానిలోని సభ్యులు, (వారూ కాగితం పైనే), మంత్రివర్గం, గూండాలు అందరూ




అందరే. ఒక మనిషి, ఒకే ఒక్క మనిషి ఈ కుళ్ళు అంతా లేకుండ బురద నీటిలో కమలం పుట్టినట్లు ఈ కట్టుబాటు, కుతంత్రపు దేశంలో ఆవిర్భవిస్తే దేశం సర్వతోముఖాభివృద్ధి చెందుతుంది. మొన్న మొన్నటి వరకు చాలమంది ప్రజానీకం శ్రీమతి ఇందిరాగాంధీ అలాంటి ఆకర్షణ గలిగిన వ్యక్తి అనే నమ్మకంతో ఉన్నారు. కానీ వారి ఊహలన్నీ తారుమారు అయినాయి. నూతన సంవత్సర ఉత్సవాలకు నేను బొంబాయి వెళ్ళినప్పుడు ఉన్నట్లు ఉండి కుసో అని పేరు గల ఆయన, బహుశ; ఆర్థిక శాస్త్రవేత్త అనుకుంటా వేదిక మీదకు వచ్చి ఎడతెరిపి లేకుండా అబద్ధాలు మాట్లాడాడు. అసందర్భపు కబుర్లు చెప్పి మన దేశ ఆర్థిక పరిస్థితి చాలా మెరుగ్గా ఉందని వ్యాఖ్యానించాడు. నిజంగా దేశ పరిస్థితి దానికి వ్యతిరేకంగా ఉంది. పారిశ్రామిక ఉత్పత్తి సగానికి కుదించుకు పోయి విదేశీ మారక ద్రవ్యం గాలిలో కలిసి పోయింది. మన ఆర్థికవేత్తలు, సాంఘిక శాస్త్రజ్ఞులు, వాళ్ళు చెప్పేవన్నీ అబద్ధాలు అని తెలిసి కూడ ఎందుకు ఆ విధంగా మాట్లాడుతారో? ప్రధానమంత్రే అబద్ధాలు చెప్తున్నప్పుడు మేమెందుకు మాట్లాడ కూడదు? అనుకుంటారేమో వారు!

అంతర్జాతీయ ద్రవ్యనిధి అప్పు గురించే తీసుకోండి అది ఒక జటిలమైన ప్రశ్న! ఇప్పటివరకు ఆ సమస్య సమస్యగానే ఉంది. మన ఆర్థిక పరిస్థితి గట్టిగా ఉంటే అప్పు తీసికోవలసిన అవసరం ఏమిటి? కరెన్సీ. విలు దిగుమతి చేసికోవడానికి తప్పు? దీనికి ఎవ్వరు జవాబు చెబుతారు?

బొంబేలోని జవుళి కార్మికుల సమ్మె విషయానికి వస్తే, కార్మికులంతా తిరిగి పనిలో ప్రవేశించారని వార్తలందాయి. ఇదీ ఒక అబద్ధమే! నేను బొంబాయి వెళ్ళి చాల మిల్లులు పరీక్షించాను ఏ మిల్లు పొగగొట్టం నుండి పొగ వస్తున్న సూచనలు కనపడలేదు. శ్రీమతి ఇందిరాగాంధీకి ఎందరో సినిమా తారలను, తదితరలను కలుసుకోను తీరిక ఉంది కానీ ఒక్క నూలు మిల్లును సందర్శించ డానికి తీరికలేదు. రేపు మహారాష్ట్రలో ఎన్నికలంటూ జరిగితే శ్రీమతి ఇందిరాగాంధీ పార్టీ అక్కడ కూడ తుడిచిపెట్టుకుపోవడం ఖాయం! గుజరాత్ పరిస్థితి కూడా అంతే!

గుండూరావు, అబ్దుల్ రెహమాన్ అంతూలే వంటి వారిచే పరిపాలింపబడడం అన్నది చాల ప్రమాదకరమైన విషయం. ఏ నాగరిక దేశంలో అయినా ఇలాంటి వారిని జైళ్ళలో తప్ప బయట మననీయరు. ఇదే విధంగా పెద్ద పెద్ద రాజకీయ వాదులు ప్రవర్తిస్తే "ఆంధ్రప్రదేశ్‌లో లాగ" ప్రజలే తీర్పు చెపుతారు. ఓటు అనేది గుండూరావు ఆయన అనుచరులకు వ్యతిరేకంగా కాదు, అది శ్రీమతి ఇందిరాగాంధీకే! ఆమెకి అనుకూలంగా జరిగిఉంటే అందరూ ఆమెను అందలం ఎక్కించేవారు. ఇప్పుడు నష్టపోయింది శ్రీమతి ఇందిరాగాంధీ. ప్రపంచంలో భారతదేశం పట్టి ప్రజాస్వామ్య రాజ్యమే కాదు తెలివిగల, సూక్ష్మబుద్ధిగల ప్రజలు ఉన్న పెద్ద దేశం. దానికి నిదర్శనం దక్షిణ భారతదేశంలోని ఎన్నికల ఫలితాలే!★

చదివేకనికే ఇస్తారాలేవయ్యా! కాస్త అవతలకి జరుగు!





పాదిరికుప్పంలో కాలిపోయిన ఇళ్లు

# పాదిరికుప్పంలో భీభత్సం!

చిత్తూరు జిల్లాలోని నగరి నియోజక వర్గంలో ఉన్న పాదిరికుప్పం గ్రామంపై ఇటీవల పార్టీ కక్షలతో కొందరు దుండగులు దాడి జరిపి బీభత్సాన్ని సృష్టించారు. ఈ గ్రామంలో అందరూ హరిజనులు, వారిలో కొందరు చిన్న, సన్నకారు రైతులు కూడా ఉన్నారు.

జనవరి 5 వ తేదీ సాయంత్రం 5 30 కి తమ పార్టీ అభ్యర్థికి మద్దతు యివ్వలేదన్న కారణంగా కొందరు తెలుగు దేశం పార్టీ వారు పాదిరికుప్పం గ్రామంపై పడి విలయతాండవం చేశారని ఆ గ్రామస్తులంతా ఆరోపించారు.

దుండగులు 7 లారీలలో వచ్చి ఇళ్లపై పెట్రోలు పోసి నిప్పంటించి, లోపలివారు బయటకి రాకుండా తలుపులకి గొళ్లాలు పెట్టారని ఆ గ్రామాన్ని సందర్శించిన విలేఖరుల బృందానికి అక్కడి వారంతా గోడుగోడున విలపిస్తూ వివరించారు. హస్తంగుర్తుకి వోటు వేస్తారా? అంటూ అనేకమంది గ్రామస్తులని చేతులమీద పలుగులతో, కత్తులతో పొడిచారని, తమని చేతులపైనా, రొమ్ముల మీదా కొట్టి వివస్త్రలని చేశారని, 15 ఏళ్ల బాలికని మానభంగంచేశారని, ఆమె యిప్పుడు పుత్తూరు ఆస్పత్రిలో చికిత్సపొందుతున్నదనీ అత్యాచారానికి గురైన అబలలందరూ ముక్తకంఠంతో తమకు జరిగిన అన్యాయాల్ని వివరించారు.

మొత్తం 86 ఇళ్లు భస్మీపటలం అయిపోయాయి. ముగ్గురు స్త్రీలు అగ్నికి ఆహుతి అయిపోయారు. దుండగులు పారిపోతూ ఉండగా తొక్కిసలాటలో రెండేళ్ల పసివాడు దుర్మరణంపాలైనాడు.

పాదిరికుప్పంలో యిప్పుడు అస్పృశ్యతని పాటిస్తున్నారని, హోటళ్లు, దుకాణాలలోకి హరిజనులని రానీయడంలేదని నగరి, కార్వేటి నగరం పంచాయతీ సమితుల అధ్యక్షులు శ్రీ దొరస్వామి, శ్రీ నారాయణస్వామి విలేఖరులతో చెప్పారు. అమ్మ రాజ్యం పోయింది, ఇక మీ ఆటలు సాగవు అంటూ అగ్రవర్ణాల వారు తమని బెదిరిస్తున్నారని శ్రీ దొరస్వామి అన్నారు.

నగరి సమితిలోని పరమేశ్వర మంగళం లోని హరిజనులు తాము యిప్పుడు ప్రాణ భయంతో వేగంపేట రైల్వేస్టేషన్ వద్ద తల దాచుకుంటున్నామని విలేఖరులకి చెప్పారు.

పోలింగ్ జరిగిన మర్నాడు నారాయణ వనం అనే హరిజన వాడపై కూడా కొందరు పెత్తందార్లు తుపాకులతో దాడి చేశారు. నలుగురికి తుపాకిగుళ్లు తగిలి గాయాలతో ఆస్పత్రిపాలైనారు. అందులో ఒకనికి ఒక కాలు తీసివేయవలసివచ్చింది. నగరి నియోజక వర్గం అంతటా పరిస్థితి ఇలాగే ఉందని ఆ ఇద్దరు సమితి అధ్యక్షులు విలేఖరులకి చెప్పారు.

ఈ సంఘటనపై న్యాయవిచారణ జరిపిస్తామని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ప్రకటించారు. — ఒ. వి ●

సర్వస్వం కోల్పోయి విలపిస్తున్న వృద్ధురాలు



# వృద్ధాప్యంలో ఓ బామ్మ

రచన ధరణి




చిందర వందరగా ఉన్న బట్టలన్నీ మడతలు పెట్టుకుని సూట్‌కేస్‌లో కుక్కుతుంటే రవీంద్ర హడావుడిగా వచ్చాడు.

'తిరిగి నాలుగు రోజుల్లో వచ్చేదానికివన్నీ సర్దుతావెందుకోయ్!' అంటూ పెట్టినవన్నీ జబర్దస్తీగా లాగిపడేస్తుంటే — మిత్రుడు వేపు గుర్రుగా చూసి, అతడు పెట్టిన పోజుకి ఫక్కున నవ్వేస్తూ, 'నాకు టైమవుతుందిక!' అంటూ మిగిలిన రెండు జతల్నీ వదిలంగా సర్ది పైకి లేచాడు ప్రసాద్.

ఇంతలోకి భానుమూర్తి, కవి కూడా లోనికొచ్చారు. వస్తూనే "ఊటీ ప్రయాణానికి డేట్ ఫిక్స్ చేసామనే విషయం మర్చిపోకురోయ్! నువ్వు రాకపోతే మొత్తం అభాసవుతుంది. ప్రయాణంలో థ్రిల్ ఉండదు! ఏం?' అంటూ కంగారుగా చెప్పారు.

"అదేమిట్రా, ఎలా మర్చిపోతాను — ఇంటికి వెళ్ళి తొమ్మిది నెలలు కావస్తోంది. ఈసారైనా వెళ్ళకపోతే మా బామ్మకు కోపం వస్తుంది — నాకూ అందర్నీ చూసి రావాలనీ ఉంది. అదీగాక నాన్నగారు కూడా రాశారు కదా! సెలవులకి రావడం ఎగ్గొట్టి ఎటూ పోవద్దని! అందుగురించయినా ఓ సారి వెళ్ళి చూసొస్తే పెద్దవాళ్ళ గొడవుండదు!" అంటూ సూట్‌కేస్ చేతబుచ్చుకున్నాడు.

ఖాళీగా వెళ్తున్న ఆటోని ఆపాడు రవీంద్ర. మిత్రులందరికీ చెప్పి ఆటోలో కూలబడ్డాడు ప్రసాద్. బస్టాండ్ చేరేసరికి మచిలీపట్నం వెళ్ళే బస్ బయల్దేరడానికి సిద్ధంగా ఉండడంతో టికెట్ తీసుకుని ఎక్కేసాడు.

సాయంత్రం నాలుగయ్యేటప్పటికి బందరులో దిగాడు. రిక్షా ఎక్కుతుంటే నానిగాడికేం తీసుకోలేదన్న సంగతి గుర్తొచ్చి వెనుదిరిగాడు. వాడు ఒట్టి చేతుల్తో వెళ్తే ఊరుకోడు. ఓ చాక్లెట్ల ప్యాకెట్టు, బామ్మకి ద్రాక్షపళ్ళూ తీసుకుని రిక్షా ఎక్కాడు.

పావుగంటలో ఇంటిముందు దిగి — రిక్షా అబ్బికి బాడుగ చెల్లించి, లోనికి నడుస్తుంటే — నానిగాడు ఏగురుకుంటూ ఎదురు వచ్చాడు.

తనని చూడడంతోనే ఇంత మొహమైంది వాడికి. అమాంతం కాళ్ళకు చుట్టేసాడు.

"ముందు బాబాయిని లోనికి రానియ్యరా!'' అంటూ అమ్మా, ఒదిన బైటకొచ్చారు. సూట్‌కేస్ అమ్మకందించి, వాడ్ని భుజాన వేసుకుని లోనికి నడిచాడు.

ఒదిన స్ట్రాంగ్‌గా టీ చేసివ్వడంతో కాస్త దిమ్మ వదిలింది. టవల్ తీసుకుని పైప్ దగ్గరకెళ్ళబోతే "ఆగరా పసాదూ— వేడినీళ్ళున్నాయి! తోడుకొస్తున్నా'' అంటూ అమ్మ బకెట్ నిండా గోరువెచ్చని నీళ్ల తెచ్చి బాత్‌రూమ్‌లో పెట్టింది.

తనని చూసిన ఆనందం అమ్మ కళ్ల నిండా కనబడుతోంది. ఆ సంతోషంతో కాలు ఒక్కచోటా నిలబడటంలేదు. "ఈ సెలవులకైనా వస్తావో రావోనని ఊరికే ఇదవుతున్నారా ప్రసాదూ! ఊటీ వెళదామనుకుంటున్నాము, ఈసారి కాస్త అదనంగా డబ్బు కావాలంటూ ఉత్తరం వేసావు కదా! అప్పట్నించీ నా దిగులింకా ఎక్కువైంది. మీ నాన్నగార్ని ఊదరగొట్టి గట్టిగా ఉత్తరం రాయించాను. మరోసారి వెళ్లొచ్చులే — ఈసారి కొచ్చేయ్యమని!''

అమ్మ ఇంకా ఏదేదో చెప్తుంటే ఊకొడుతూనే ప్రక్కనున్న ఈజీ ఛైర్‌లో కూర్చున్నాను.

"మీ బామ్మతో ఒక యాతన అయిపోయింది, కాల్చుకు తినేస్తోంది...''

ఆ మాటతో హఠాత్తుగా బామ్మ జ్ఞప్తికి వచ్చి, ఛైర్‌లో వాలినవాడు నిటారుగా అయాడు.

"ఔనూ, ఇంతకూ బామ్మ కనపడదేం!'' చుట్టూ చూస్తూ అడిగాడు.

"ఏమి బామ్మోలేరా! అటు చావకుండానూ, ఇటు తిన్నగా బ్రతక్కుండానూ మమ్మల్ని చంపుతోంది'' అమ్మ అలా అంటుంటే నా మనసు చివుక్కుమంది.

"అలా అంటావేమిటమ్మా, అసలావిడకేమైందిట ...''

నానిగాడు ఏడుస్తూ రావడంతో వారి సంభాషణ కంతరాయం కలిగింది "ఎందుకురా నానీ ఏడుస్తావ్!'' దగ్గరికి తీసుకుని, బుజ్జగింపుగా అడిగాడు.

"బాబాయ్ మరేం, నా గోళీలన్నీ తాతమ్మ తీసేసుకుంది! ఇవ్వమని అడుగుతుంటే—నేను గెల్చాను, ఇంక ఇవ్వనంటుంది'' అంటూ తిరిగి రాగం అందుకున్నాడు.

"ఛట్. ఏమిట్రా నీ గోల! గోళీలేమిటి —తాతమ్మ తీసుకోవడమేమిటి! అసలింతకూ తాతమ్మేదీ? నేను చెప్పేది సరిగా విన్పించుకోవుగదరా — ఈవిడ మునుపటి బామ్మ కాదురా బాబూ! ఎంతో తెలివిగా మాట్లాడుతున్నట్లే ఉంటుందా, ఆ వెంటనే చిన్న పిల్ల మాదిరిగా అయిపోయి, చంటిపిల్లల్లే మాట్లాడుతుంది. మాకీ ఇంట్లో ఆవిడో చంటిపిల్లయిపోయింది.''

లలితమ్మగారు చెప్పేది పూర్తవకుండానే లేచి— నానిగాడితో కలిసి బామ్మ పడుకునే గదిలోకెళ్ళాడు.

ప్రసాద్‌ని చూడడంతోనే చింకి చాటంత ముఖమయింది. "ఇన్నాళ్ళూ ఎక్కడికెళ్ళావురా ప్రసాదూ!'' ఆవిడ ఆదుర్దాతో అడుగుతుంటే తెల్లబోవటం తనవంతయింది.

"అదేమిటి బామ్మా! అలా అడుగుతావ్, చదువుకోడానికి వెళ్ళాను కదా! పోయిన సెలవులకి వీలవలేదు, ఇపుడు మిమ్మల్నందర్నీ చూసెడదామని వచ్చాను.''

"ఔను గదూ, మర్చిపోయానురా బాబూ ఏం చదువుతున్నావూ—'' ఆ మాటతో దిమ్మెరపోయాడు. నానిగాడు ఆవిడకు దగ్గరగావచ్చి "తాతమ్మా! ఇంకొక్క సంవత్సరం చదివితే బాబాయి ఇంజనీరవుతాడట నీకు తెలీదూ! నాకు అమ్మ చెప్పింది—కదు బాబాయ్!

"ఇంజనీర్ కాదురా బడుదాయ్, కాబోయే డాక్టర్ని! ఇంజనీర్ చదివేది మీ మామయ్య''

"డాక్టర్ డాక్టర్ మాబాబు యాక్టర్'' అంటూ ఆవిడ చంటి పిల్లల్లే చప్పట్లు కొడుతుంటే అయోమయంగా ఆవిడ పక్కనే చతికిలబడ్డాడు ప్రసాద్.

"బామ్మకేమైంది! మతిగాని చలించలేదుగదా?'' ఆదుర్దాగా తనలో తనే మదన పడ్డాడు. తను క్రిందటి సారొచ్చినపుడు కూడా వైద్య విషయాలు ఎంత బాగా అడిగి తెలుసుకుందని? అంతలోనే ఇంత మార్పా! తను తెచ్చిన ద్రాక్ష పళ్ళు తింటూ తనకేసి చూడకుండా— తన సంగతులైనా అడగక పోయేటప్పటికి దిగులుగా లేచి బయటకొచ్చేశాడు.

"క్రిందఉక్కగావుంది డాబామీకి వెళదాం రా బాబాయ్!'' అని నానిగాడు చెయ్యి పట్టి లాగుతున్నా వినక సరాసరి వంటగదిలో ఉన్న తల్లి దగ్గరకెళ్ళాడు.

ఆవిడ కొడుకుకోసం ప్రత్యేకంగా ఏవో పిండివంటలు చేయటంలో నిమగ్నమై పోయింది.

"అమ్మా బామ్మ ఏమిటిలా మారిపోయింది? ఏమైందసలు!'' ఆత్రతగా అడిగాడు.

"పెద్ద వయసుకదూ! ఇక అంతే! ఆవిడ జీవితం చివరి ఘట్టంలో ఉంది— ఎన్నాళ్ళంటే అన్నాళ్ళు ఇక అలా గడిచి పోవల్సిందే!'' తాపీగా వచ్చింది ఆవిడనుండి సమాధానం

"అదేమిటమ్మా అలా అంటావ్! పిడిరాయిలాఉండే బామ్మ బక్కలాతయారయింది. నేనంటే ఎంత అపేక్షని! సెలవులయి వెళ్ళిపోయే రోజు ఎంత బాధపడిపోయేదో మీ కందరికీ తెలీదూ! ఆ అపేక్షంతా ఏమైందసలు? సరిగా మాట్లాడనైనా మాట్లాడదు'' ఆవిడ మీదనున్న అభిమానంతో అశాంతి నిండిన స్వరంతో ఆవేదనగా అన్నాడు.

లలితమ్మగారేదో చెప్పబోయే లోపల ప్రసాద్ తండ్రి రామనాథంగారూ, అన్న రాఘవ లోనికొచ్చారు. వస్తూనే కుశలప్రశ్నలు మొదలెట్టారు. అన్య మనస్కంగానే వారికి సమాధానాలిచ్చాడు.

'అత్తగారు తనతో మునుపట్లా ఉండటం లేదని వాడు చాలా దిగులు పడుతున్నాడండీ!' అంటూ భర్తతో అంది లలితమ్మ.

'ఓ అదా!' అన్నట్లుగా కొడుకు వేపు చూసి జాలిగా నిట్టూర్చాడు. 'మనిషికి నాలుగు దశలుంటాయని తెలుసుని వాడవు ఇదుగదా! బామ్మకూడా ఇపుడు ఆఖరి దశ కోరల్లో ఘోరంగా ఇరుక్కుంది. "వార్ధక్యం'' అది అందరికీ వస్తుంది గాని— ఈవిడకది దారుణంగా పరిణమించింది. ఎంత హుందాగా బతికేదనీ! ఇపుడిక చిన్న పిల్లచేష్టలతో తెలిసీ తెలియని పనులతోనూ ఆవిడ జీవితం అలా ముగిసి పోవలసిందే!'' ఆవేదనగా అన్నారాయన.

తమ్ముడి ముఖం చిన్నబోవడం చూసి నవ్వుకున్నాడు రాఘవ- 'పాపం వాడికి బామ్మ అంటే చాలా ఇష్టం! అందుకే ఆవిడ్నలా చూసి తట్టుకోలేకపోతున్నాడు'' అనుకున్నాడు.

భోజనాల దగ్గర తండ్రి, అన్నగారూ ఏవేవో మాట్లాడుతున్నా ధ్యాసంతా బామ్మ పైనే పడిపోయింది. అమ్మ కొసరి కొసరి వడ్డిస్తూన్నా ఏదో వెలితిగానే ఉంది. "తనకి ఊహ తెలిసి నప్పట్నుంచీ కూడా తన అవస

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్యాలయానికి స్వయంగా వచ్చి వారి రచన లందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.



# వృద్ధాప్యంలో ఓ బామ్మ

రాలన్నీ బామ్మే గమనిస్తుండేది. తనకి తాతయ్య పేరే పెట్టినందుకు ఆవిడకంత అభిమానం అని ఇంట్లో అందరూ అనుకునే వారు. ఏదేమైనా బామ్మ అంటే చాలా ఇష్టం. ఇంట్లో అందరి మీద అజమాయిషీ చేస్తూ అందరి అవసరాలూ కనిపెడుతూ తిరిగే బామ్మ ఈ రోజు తన స్థితి తెలుసుకునే పరిస్థితిలో లేదంటే నమ్మశక్యం కావటంలేదు. వృద్ధాప్యం! ఇది అందరికీ వచ్చేదే గాని ఇంత చెడ్డగానా! ప్చ్! అసలు బామ్మ కోసమేగదా తనొచ్చాడు. అబ్బ! బామ్మ మునుపట్లా తన మీద వాత్సల్యం చూపక పోవడం ఎంత బాధకలిగిస్తోంది. ఇంక ఒక్క క్షణం కూడా ఉండకూడదు. ఎదురుగా ఉండి బామ్మనలా చూడలేడు రేపే ప్రయాణమవాలి.'' అశాంతిగా నిద్రకుపక్రమించాడు.

ఉదయం ఏడు గంటలు కొట్టిన తరువాత మెలకువ వచ్చింది. బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ మరో ప్రక్కకి తిరగపోయి ప్రయాణం సంగతి జ్ఞాపకం వచ్చి దిగ్గునలేచాడు.

స్నానసంధ్యలు పూర్తిచేసి వచ్చేటప్పటికె బామ్మ గదిలో నానిగాడేదో గలాటా చేస్తున్నట్లు వినరావడంతో అటు వెళ్లాడు.

వెళ్లినవాడు వెంటనే ముక్కు మూసుకుంటూ బైట కొచ్చేశాడు.

''అమ్మా! బామ్మని లెట్రిన్‌కి పంపించకూడదూ!'' గట్టిగా అరుస్తూ వంటింట్లో కెళ్లాడు.

''ఏమిట్రా, పాడుచేసిందా! నేను 'మడి' లో ఉన్నాను — రత్తిని రానీ, శుభ్రం చేస్తుంది. అయినా ఆవిడకో టైమంటూ ఏడ్చిందేవిటి — లెట్రిన్‌కి పంపించడానికి! పంపుదామనుకున్నా నా మాటసలు వినదు. కాసేపు నువ్వేటైనా వెళ్ళిరా — రత్తి వచ్చిం తర్వాత క్లీన్ చేయిస్తా!'' లలితమ్మగారు కొడుక్కి చెప్పేసి, మరల తన పనిలో నిమగ్నమైపోయింది.

బాధగా తల పట్టుకున్నాడు ప్రసాద్ — బామ్మకి నిజంగానే ఏం తెలీటంలేదన్నమాట! ఏదో పుస్తకంలో ఒక పద్యం చదివాడు. దాని సారాంశమేమిటంటే — ''పసి వయసులో మనల్ని పెద్దలు పెంచుతారు — మనల్నెన్ని విధాలుగా వాళ్లు పోషణ చేస్తారో అన్నివిధాలా వాళ్ళి వృద్ధాప్యంలో మనం ఆదుకోవాలి'' అని.

''ఆఁ ఏంచేయాలి? పెద్దవారయాక కడుపునిండా భోజన ఫలహారాదులు, కట్టుకోవడానికి బట్ట ఇవ్వడమే గదా, ఆ మాత్రం ఎవరు చేయరు!''అని తేలిగ్గా నవ్వేశాడపుడు.

''భగవంతుడా! అంత వయసు వచ్చే వరకు నన్ను బ్రతికించకు! బ్రతికించినా ఈ స్థితి మాత్రం రానీయకు!'' దేవుడికి అడ్వాన్స్ నమస్కార మొకటి పడేస్తూ — దిక్కుతోచక, కూరల తరుగుతున్న ఒదినగారి దగ్గరికి హడావుడిగా వెళ్ళాడు.

''ఒదినా, బామ్మగది శుభ్రం చేయాలి — ఒక్కసారి రండి!'' బ్రతిమాలుతున్న ధోరణిలో అడుగుతుంటే అర్థంగాక ఆమె మొదట తెల్లబోయింది.

ఆవిడకు విషయం తెలిసాక ఛీత్కారం చేస్తూ ''ఇంకానయం, అదా మీరు నాకు చెప్పేది?'' అంటూ నిర్లక్ష్యంగా తన పనిలో లీనమైపోయింది.

విడ్డూరంగా ఆమెనే చూస్తూ ''ఒదినా అదే మీ బామ్మ అయితే చెయ్యనక్కర్లేదూ!' అంటూ అడిగాడు.

''మా బామ్మా! మా బామ్మ ఈవిడిలా తయారవలేదు. శుభ్రంగా తొంభై ఏళ్లు బ్రతికినా, హాయిగా 'కృష్ణా రామా' అంటూ చనిపోయింది, ఎవరికీ చీమంత ఇబ్బంది కూడా కలిగించలేదు పూర్వజన్మలో ఘోరమైన పాపాలు చేస్తేనే ఇలా అవుతారట! నేసింది గాబట్టి ఆవిడా, ఆవిడతోపాటు మీరూ అనుభవించండి!'' ఆవిడ ఈసడింపుగా అంటుంటే - నొచ్చుకుంటూ బామ్మ గదిలో కెళ్ళాడు. ఆవిడ్ని లాలించి బాత్‌రూమ్‌కి పంపేటప్పటికి పావుగంట పట్టింది. అంతలోకి రత్తి రావడంతో పక్కలు శుభ్రం చేయించి, గది కడిగించి అగరొత్తులు వెలిగించాడు.

ఇదంతా చూసి లలితమ్మగారు తృప్తిగా నిట్టూర్చితే — ఆవిడ కోడలు రాధ మాత్రం మరిదిని విడ్డూరంగా చూస్తూండిపోయింది.

''ఒరే అన్నయ్యా!''

ఈ సంబోధన ఎవరిదా అని ఆశ్చర్యంగా వెనక్కితిరిగేసరికి, బామ్మ! ఆపుకోలేని నవ్వొచ్చింది. తెల్లని పంచ కట్టుకుని, తను విడిచేసిన షర్టు తిరగేసి తొడుక్కుని గుండీలు పెట్టడానికి సతమతమవుతోంది.

(60 వ పేజీ చూడండి)

లక్షలాది ప్రజలకు సూపర్ భావం కలిగించే టీ!





**Brooke Bond**
**Super Dust Tea**

"సూపర్ రుచి"



"సూపర్ డికాక్షన్"







**Brooke Bond**
**Super Dust Tea**

"సూపర్ పొదుపు"





**Brooke Bond**
**Super Dust Tea**

బ్రూక్ బాండ్
సూపర్ డస్ట్

భారత దేశంలో
అత్యధికంగా అమ్ముడు
ప్యాకెట్ టీ

లక్ష్మికి దేహ పరిస్థితి బాగోలేదు. బ్లడ్ ప్లెషర్ ఎక్కువగావుంది. ఫైగా ఫిట్స్ వచ్చాయి. ఆర్టిఫిషియల్‌గా నొప్పులు వచ్చేలాగ చేసి, ఎనిమిదో నెలలోనే కాన్పుచేశారు. ప్రిమెచ్యూర్ బేబిని గుడ్డల్లో చుట్టి తల్లిని పాపాయిని తెచ్చి నర్స్ రవిచంద్ర చేతిలో వుంచింది.

పొత్తిళ్లలోని పాపాయిని అతి జాగ్రత్తగా గుండెలకు ఆనిచ్చుకుని చూస్తున్నాడు.

కూతురు కావాలని కలలు కన్నాడు. బంగారు తల్లి — కన్నతల్లిని చూసుకుంటున్నాడు. 'ఎవ్వరి పోలికా !' అన్నట్లు.

పాపాయిని తను చూసినట్లుగా తనను ఎవ్వరో అంత దీర్ఘంగా చూస్తున్నారనిపించింది — తలెత్తి చూశాడు.

ద్వారం దగ్గర సాహిత్య కనిపించింది.

పాపాయిని చూస్తున్నప్పుడు — అతని ముఖంలో కనిపించిన ఆనందం, కళ్లల్లో వెలుగు — పాపాయిని పట్టుకున్న తీరు — చూస్తుంటే ఇంకా కళ్లుకూడ తెరవని ఆ పాపాయి అంటే — అతనికెంత ప్రాణమో! ఒక్క చూపులోనే తెలుస్తోంది. అక్కడ సాహిత్యను చూసి ఆనందంగా —

''సత్యా !'' అన్నాడు తన ఆనందాన్ని పంచుకోటానికి వచ్చిందని సంబరపడుతూ.

తండ్రి చేతుల్లో పాప — అతని కళ్లలో వెలుగు — ముఖంలో గర్వం, కిటికీ దగ్గిర నిల్చున్న అతని తలపై వెలుగుపడి వింతగా వున్నాడు. రవిచంద్రను ప్రేమికుడిగానే చూచింది. ఇప్పుడు తండ్రిగా ఆ మూర్తి సాహిత్య హృదయంపై ముద్రపడింది. సాహిత్య, అమ్మానాన్నలు — అక్కాబావలు కొన్ని ముఖ్య దేశాలు తిరిగి రావాటానికి ఎప్పటినుంచో వేసుకున్న ప్రయాణం ఇప్పుడు వచ్చింది.

సాహిత్యకు పెళ్లి కాకముందు అనుకున్న విదేశీ యాత్ర ఇది. వెళ్లుతూ రవిచంద్రను చెప్పటానికి వచ్చింది. మౌనంగా ఒకరినొకరు చూచుకుంటూ వుండిపోయారు.

అంతలో గోపాల్‌రావుగారు దంపతులు లేబర్ రూంలో వున్న లక్ష్మిని చూచివచ్చారు. పాపాయిని చూసి—ముద్దుగా వుంది. అంతా తండ్రి పోలికే. అమ్మాయిలకు తండ్రిపోలిక అదృష్టమట అని అన్నారు.

నర్స్ వచ్చి పాపాయిని తీసుకుపోయింది. వారి వెంట నడిచాడు రవిచంద్ర.




*(గత సంచిక తరువాయి)*

రవిచంద్ర భుజంపై చెయ్యివేసి— ''టూర్‌కి వెళ్తున్నాం— సాహిత్యకూడ వస్తుంది. నీకేం అభ్యంతరం లేదుకదా! రెండు సంవత్సరాల నుంచి వేసుకున్న ప్రోగ్రామిది— ఇప్పటికి అందరికీ వీలైంది......''

సాహిత్య యిష్టాన్ని అతనెప్పుడు కాదనలేదు కాని— దూరంగ వెళ్తుంది అంటే ఎలాగో వుంది.

గోపాల్‌రావ్ దంపతులు కారులో కూర్చున్నారు. సాహిత్య కూడా వెళ్లి కూర్చున్నాక— తలుపు వేస్తున్నట్లు వేసి, సాహిత్య చెయ్యిపై చెయ్యివేసి—

''హేపీ టైం— లెటర్స్ వ్రాస్తావు కదా'' అన్నాడు. సాహిత్యకు కోపంగా వుందని, తనమీద అలిగి వెళ్లిపోతోందని గ్రహించాడు.

భార్యా భర్తలమధ్య కోపాలు, తాపాలు పగలు వున్నంతసేపే. రాత్రిలో అవి కోరికలుగా— రాగాలుగా మారిపోయి వారిద్దరిని ఏకం చేస్తాయి. సాహిత్య చిన్నపిల్ల— వున్నదంతా తనకే కావాలనుకుంటుంది. కలల్లో తేలిపోతుంది— ఇది జీవితం— తన జీవితం మరో స్త్రీతో ముడిపడిందని, ఆమెతో పంచుకోవాలని— సర్దుకోవాలని అర్థం చేసుకోవాలి.

స్త్రీ గొప్పదైనా, మేధావి అయినా ఎక్కడికి వెళ్లినా చివరికి భర్త దగ్గరికి రాక తప్పదు. అదే ఆమె గమ్యస్థానం.

ఈ సమయంలో సాహిత్య వెళ్లటం మంచిదే అనుకున్నాడు.

* * *

పాపాయికి రెండోనెల వచ్చింది. బర్త్‌డే పార్టీ చేస్తేగాని వూరుకోలేదు ధీరజ్.

**జరిగిన కథ—14 :** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు. అతనికి పి.ఎ. గా చేరిన సాహిత్య తన అభిమాన రచయిత రవిచంద్రను ఎంతగానో ప్రేమిస్తుంటుంది. ఆమెకు ఎంత దూరంగా వుండాలనుకుంటున్నాడో అంతగా దగ్గరవుతుంటాడు రవిచంద్ర. ఎలాగైనా అతన్ని తనవాడిగా చేసుకోవాలని నిర్ణయించుకొంటుంది. జూలాజికల్ పార్క్‌లో రవిచంద్ర లీలలు చూసిన గిరిజ ఆ విషయం ఫోన్ ద్వారా లక్ష్మికి తెలియజేస్తుంది. ఇక ఇలా ఎంతోకాలం సాగదని, దాగదని తెలుసుకొన్న రవిచంద్ర, సాహిత్యలు కలకత్తా పోయి పెళ్లి చేసుకోవడాన్కి నిర్ణయించుకొంటారు. కాని ఇంట్లో పరిస్థితి అర్థం చేసుకొన్న రవిచంద్ర ఆ పని చేయలేకపోతాడు. ఫలితంగా సాహిత్య అతనిని ఛీదరించుకొంటుంది. చచ్చిపోవడాన్కి స్లీపింగ్ టాబ్లెట్స్ మింగిన సాహిత్యను పెళ్లి చేసుకొని బ్రతికిస్తాడు రవిచంద్ర. రవిచంద్ర, సాహిత్యలు హనీమూన్ ట్రిప్ క్రింద అమరావతి వెళ్తారు. వాళ్లిద్దరూ అలా ఎంజాయ్ చేస్తున్నారని తెలుసుకొన్న లక్ష్మికి 'ట్స్ వచ్చి హాస్పటల్‌లో చేరుతుంది. ఈ వార్త విన్న రవిచంద్ర తమ ప్రోగ్రామ్ కాన్సిల్ చేసుకొని లక్ష్మిని చేరుకొంటాడు.

నెల నెల చేయరు— సంవత్సరాల్లో వయస్సు లెక్కవేస్తారు— అని చెప్పినా వినలేదు. ఆ రోజు స్పెషల్స్ చేయాల్సిందే అన్నాడు. చెల్లాయికి కొత్త గౌను వేసి, బెస్ట్ విషస్ చెప్పి— చాక్‌లెట్ డబ్బా బాగ్‌లో పెట్టుకున్నాడు క్లాసుమేట్స్‌కి పంచాలని.

పాపాయికి ఇంకా పేరు పెట్టలేదు. పాప తండ్రి, అన్నయ్య పేర్లకోసం గాలిస్తున్నారు— ఎవ్వరికిలేని కొత్త పేరు పెట్టాలట.

పాపాయికి సాంబ్రాణి ధూపంవేసి— ఆ ప్రక్కనే వ్రాసుకుంటున్న రవిచంద్ర జుట్టుకు సాంబ్రాణి వేస్తుంటే—''నా దగ్గర చంటిపాప వాసన వస్తుందని ఆఫీసు వాళ్లకి అనుమానంగ వుంది'' అంటూ నవ్వాడు రవిచంద్ర.

ఆఫీసుకు తయారవుతూ ''రాజా! వస్తావా! నిన్ను స్కూల్లో డ్రాప్‌చేస్తాను'' అన్నాడు.

ధీరజ్ బాగ్‌పట్టుకుని అమ్మకి, చెల్లాయికిముద్దు పెట్టాడు. రవిచంద్ర పాపాయికి ముద్దు పెట్టినట్లే పెట్టి — లక్ష్మి బుగ్గలను తాకబోయాడు. ధీరజ్ చూసి చూడనట్లే వున్నాడు— అని రవిచంద్ర గుర్తించి—

''చూడు— పాప నా చొక్కా పట్టుకుంది'' అన్నాడు. ధీరజ్ పరుగున వచ్చి— ముడుచుకున్న పాప చేతిలో వేలు పెట్టి—

''చూడు— నా చెయ్యి పట్టేసుకుంది'' ధీరజ్ చెల్లాయికి ముద్దు పెట్టే సమయంలో రవిచంద్ర లక్ష్మి పెదాలపై చప్పున ముద్దు పెట్టుకున్నాడు. ధీరజ్ చెంపలకి పాప కాటుక అంటుకుంటే — రవిచంద్ర నుదుట కుంకుమ అయింది. నవ్వుతూ — భర్త నుదురు, కొడుకు బుగ్గ తుడిచి — ధీరజ్‌ని ముద్దు పెట్టుకుంది.

''డాడీని కూడ ముద్దు పెట్టుకో. నేనేమీ అనను'' అన్నాడు పెద్ద మగాడిలా.

రవిచంద్ర, లక్ష్మి నోరంతా విప్పి హాయిగా నవ్వుకున్నారు. నవ్వుతూ పాపాయి నెత్తుకుని— వరండా వరకు వచ్చి వారికి టాటా చెప్పింది.

ఇప్పుడు ఆ తండ్రి కొడుకులు దేనికి పోటీ పడరు. స్నేహితుల్లా సర్దుకుపోతారు. లక్ష్మికి జబ్బు చేసినప్పుడు — డాడీ దగ్గిరవుండి సేవచేయటం చూచిన ధీరజ్ — తండ్రి ప్రేమను గుర్తించాడు. ఇప్పుడు లక్ష్మి మనస్సు మానస సరోవరంలా ప్రశాంతంగా వుంది. ఆ సరోవరంలో పూచిన బంగారు పువ్వులు — తన బిడ్డలు. నేరేడు రంగు కళ్లు, నల్లని — పట్టులాంటి జుట్టు, మొనదేలిన పువ్వులాంటి ముక్కు, ఎర్రని నోరు గులాబిరంగులో అందంగా, ముద్దుగా, ఆకర్షణీయంగా వున్న పాపాయిని చూస్తుంటే లక్ష్మికి సాహిత్య గుర్తుకు వస్తుంది.

సాహిత్య విషయం తనెప్పుడు ఎత్తలేదు. రవిచంద్ర చెప్పలేదు కాని—గిరిజ వచ్చినప్పుడు తను సేకరించిన విషయాలు — లక్ష్మి వినకపోయినా చెప్పతుంది.

''దేశ పర్యటనకి విదేశాలకు వెళ్లిన సత్యభామ— ఇండియాకు ఇంకా రాలేదు. అక్కడే వుండిపోతుందా? ఏమిటి !'' అని అడిగింది.

సాహిత్య ఎక్కడవుంది. ఇంకా ఇక్కడికి ఎందుకు



రాలేదు. తెలిసో— తెలియకో— రవిచంద్రను పెళ్ళి చేసుకుంది. ఏనాటి ఋణానుబంధమో !

రవిచంద్ర తన భర్త ఎప్పుడు విడిచిపెట్టడు అని నమ్మకం. తనకు భర్త ప్రేమ కొదువకాదు— అతను పంచిన ప్రేమే తన పిల్లలు— వారికి అన్యాయం జరగదు. సాహిత్యకు తనలాగా కోరికలు వుంటాయి. తల్లి కావాలని ప్రతి ఆడది కోరుకుంటుంది. రవిచంద్ర తన ధర్మాన్ని నెరవేర్చాలి... లక్ష్మి అలా సాహిత్య గురించి ఆలోచిస్తున్న సమయంలో — లక్ష్మి అన్న — వదినగార్లు వచ్చారు. వాళ్ళు లక్ష్మిని పుట్టింటికి రమ్మని పిలవగానే లక్ష్మి వెళ్ళటానికి ఒప్పుకుంది.

"ఏమిటోయ్! మధ్యంతర ఎన్నికలు వచ్చినట్లు ముందు నోటీసు ఇవ్వకుండ ప్రయాణం పెట్టావ్— నీవు లీవ్ పెట్టాలి— నేను సాంక్షన్ చెయ్యాలి— రూల్సు మర్చిపోయినట్లున్నావ్" అన్నాడు.

పెళ్ళి అయిన కొత్తలో— అమ్మ రమ్మని వ్రాస్తే లక్ష్మిని వెళ్ళనిచ్చేవారు కాదు. "ముందు లీవ్ పెట్టుకో చూద్దాం—" అని ఏడిపించేవాడు. పాపకు పాలిస్తోంది లక్ష్మి. ఆ గదిలో వాళ్ళిద్దరే వున్నారు— చనుబాలు తాగుతున్న పాప మూతిని ముద్దుపెట్టుకున్నాడు రవిచంద్ర.

ముద్దు పెట్టుకుంటున్న రవిచంద్రతో అంది "పాపను చూస్తుంటే—సాహిత్య గుర్తుకువస్తుంది." మోకాళ్ళపై కూర్చున్న రవిచంద్ర— చకితుడైనట్లు లక్ష్మిని చూశాడు—

"మీ... సత్యభామను మరిచిపోయినట్లున్నారు..." ఓ చిరునవ్వు తెరతో విచ్చుకుంది.

లక్ష్మి వొడిలో తల దాచుకన్నాడు.

పాప పాదాలు రవిచంద్ర ముఖానికి తగులుతున్నాయి.

ధీరజ్ కూడ ఇలాగే ముఖం దాచుకుంటాడు. భర్త తలలోకి వెయిపోనిచ్చి— జుట్టు నిమురుతూండిపోయింది.

* * *

ఋషులకు మునులకు నివాస స్థలమైన రిషికేష్ హిమాలయాల మధ్యన పవిత్రమైన గంగానది ఒడ్డున వున్నది. అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని చూస్తుంటే స్వర్గం మరెంతో దూరం లేదనిపిస్తుంది. ఋషికేష్ అనే పేరుతో దేవుడు యిక్కడ ప్రత్యక్షమైనాడు. అందుకే ఆ పేరు వచ్చింది.

ఆ పుణ్యక్షేత్రాన్ని దర్శించటానికి వందల కొలది యాత్రికులు ఎప్పుడూ వస్తుంటారు.

ప్రాపంచిక కష్టాలు, బాధల నుంచి విముక్తి పొందాలని, మనశ్శాంతి కోసం వస్తారు, తపనగా నిజమైన ఆనందం కోసం దేవుడ్ని వెతుకుతూ వస్తారు. వారికోసం ఆశ్రమాలు, ధర్మశాలలు వున్నాయి.

దేవుడ్ని వెతుక్కుంటూ వస్తారు కొందరు, ఆయన రమ్మని పిలిస్తే వస్తారు మరి కొందరు. ఈ జీవితం ఏమిటో అంతుచిక్కదు కొందరికి, నేనెందుకు పుట్టినట్లు ? పుట్టక ముందు నేనెవర్ని ? ఎక్కడ ఏ రూపంలో వున్నాను ? చచ్చిపోయాక శరీరం మట్టిలో కలిసిపోతుంది. ఆత్మ అనేది వుందా ! చచ్చాక ఎక్కడికి పోతాం ! చావు అంటే భయం కొందరికి—

నీటిబుడగ వంటి జీవితాలకు ఎన్ని బంధాలు— అనుబంధాలు. ఒకరిపై ఒకరికి మమకారాలు పెంచుకుని చచ్చిపోతే ఆ ప్రేమంతా ఎక్కడికి పోతుంది ?

పుట్టినప్పుడు ఏమి తీసుకురాలేదు. వెళ్ళేటప్పుడు ఏది వెంటరాదు. అయినా ఈ తాపత్రయం, వ్యామోహం,కాంక్ష !

అవేమిటో అర్థంకాక తెలుసుకుందామని వస్తారు. ఆత్మజ్ఞానం సంపాదించుకున్న స్వాములను అడిగి తెలుసుకుందామని వస్తారు.

వృద్ధాప్యంలో అన్నీముగిసిపోయాక పరమాత్ముని ధ్యానంలో గడుపుదామని వస్తే, మరికొందరు యాత్రికుల దగ్గర అడుక్కుతింటానికి వస్తారు. వీళ్ళందర్ని చూచి ఆనందించటానికి వస్తారు టూరిస్టులు.

గోపాల్ రావుగారు వేలుఖర్చుపెట్టి కుటుంబంతో విదేశాలు చూచి తిరిగివచ్చారు.

ఆయా దేశాలవాళ్ళు హిందూదేశం గురించి అడిగితే ఏమి చెప్పలేకపోయారు.

ఎంతసేపు ఢిల్లీ, బాంబే, మద్రాసు వంటి







పట్టణాలకు వెళ్ళి షాపింగ్ చేశారు. కాని ఇతర దేశాలలోలేని అందమైన ప్రదేశాలు, హిమాలయాలు, అడవులు, లోయలు, నిజమైన ప్రకృతి సౌందర్యం— ఇండియాలో వుంటే అవి చూడలేకపోయారు.

'ముందు మనం, మనదేశం ఏమిటో చూశాక ఇతర దేశాలు చూడాలి — పొరపాటు చేశాం' అని అనుకున్నారు.

తిరిగి ఉత్తర హిందూదేశాన్ని చూస్తూ వస్తున్నారు.

ఆ ప్రయాణంలో రిషికేష్‌కి వచ్చారు. స్వర్గం నుండి భగీరథుడు దింపిన గంగలో స్నానం చేస్తే పాపాలు పోతాయో లేదోకాని పరిశుభ్రంగ తేటగా వున్న నీటిలో స్నానంచేస్తే ఆనందంగా వుంది. బరువు తీరినట్లు అనిపించింది. గంగానదికి మహత్యం వుదో లేదోగాని గంగనుంచి తెచ్చిననీరు చెడిపోదు, పాచిపోదు. ఎన్ని రోజులైన శుద్ధంగ వుంటాయి. ఇదే ప్రపంచ నదులలో లేని గంగ ప్రత్యేకత.

గంగలో స్నానం చేసిన సాహిత్య స్వర్గాశ్రమం నుండి అడవిలో కొంతదూరం వెళ్ళి ఓ చెట్టుకింద కూర్చుంది.

హిమాలయాల నుంచి ప్రవహిస్తున్న స్వచ్ఛమైన గంగాజలాలు— చుట్టూ హిమాలయాలు- పొడుగాటి అందమైన వృక్షాలు— ప్రకృతి సౌందర్యంలో అక్కడ కనిపిస్తున్న నింగి, నేల కొత్త ప్రపంచంలా వుంది. మైమరచి పోయింది. ఆకాశం నుంచి పావురం రూపంలో శాంతిదూత దిగి తన వైపు వస్తున్న భ్రాంతి?!లో— తలక్రింద చేతులు పెట్టుకుని పడుకుంది. అక్కడి చల్లని గాలి ఎందరో దేవతలు, ఋషులు, మునులు పీల్చిన పవిత్రమైన గాలి జోకొట్టుతుంటే కమ్మగా నిద్ర ముంచుకు వచ్చింది. మనస్సు — శరీరం రెక్కలు వచ్చినట్లు ఎగిరిపోతోంది.

ఆ నిద్రలో మనస్సు — శరీరం సేద తీరాయి. సాహిత్య కళ్లు విప్పింది. తనలో ఏదో మార్పు వచ్చినట్లు తెలుస్తోంది.

ఇన్నాళ్లు రవిచంద్ర పైవున్న ప్రేమలో కాలిపోతున్న శరీరం శ్రీ గంధపు పూత పూసినట్లు శరీరం చల్లగా సువాసనగా హాయిగొలుపుతుంది.

## రాగాగ్ని

తనలో రగిలిన ప్రేమ సెక్స్‌తో తృప్తిపడుతుందను కొన్నది. భార్యాభర్తల్లో కలిగే కామేచ్ఛ ముఖ్యమే కాని అది తాత్కాలికమైంది. వాంఛ తీరుతుందేమో కాని, నిజమైన ఆనందం, తృప్తి వారిద్దరి మధ్య వుండే ప్రేమలో వుంటుంది. ఆత్మని సంతృప్తి పరచి మనస్సు నిండిపోయే ప్రేమ శాశ్వతమైనది. ఆ ప్రేమ తనకి కావాలి. తనుకోరుకున్నంత ప్రేమ తిరిగి అతని దగ్గిర పొందలేదు. అందులో తెలిసి కనిపిస్తూనేవుంది. పరిపూర్ణంగా తనలో ఐక్యం చేసుకోలేకపోయింది. రవిచంద్రకు మరో జీవితం వుంది. అతని భార్య, పిల్లలు వారిలో భాగం పంచుకోవాలి. అందులో ఆనందంలేదు, తృప్తిలేదు.

పునస్సంయోగ వాంఛతో ఒంటరిగా నిరీక్షించాలి. తనకేమి తక్కువైనదో, జీవితంలో ఏమి పోగొట్టుకుందో తెలిసివచ్చింది.

పాపాయిని ఎత్తుకుని తన్మయుడై ఆనందంతో చిరునవ్వుతో చెక్కిళ్లు విరిసిన రవిచంద్రను చూచి నప్పుడే అతని ఎవరివాడో— అతని స్థానం ఎక్కడో గుర్తించింది.

అందుకే అతని ప్రేమలో— తృప్తిలేదు. తనవి తీరలేదు. తనకు కావలసింది నిజమైన ప్రేమ, శాశ్వతమైన ప్రేమ. ఆత్మశాంతి, ఎక్కడ దొరుకుతాయి! ఎవ్వర దగ్గర దొరుకుతుంది.

ఆత్మ అల్లాడిపోయింది— తీరని దాహంతో— పిడిచకట్టుకుపోయింది.

నీటి బుడగవంటి జీవితంలో కలిగే కోరికలు ఆశలకు అతీతమైననాడు నిజమైన ఆనందం, ఆత్మానందం దొరుకుతుంది.

అశాశ్వతమైన కోరికలకు బానిస కానినాడు దైవత్వాన్ని పొందుతావు.

శాంతి, సమాధానాలు నిన్ను అంటిపెట్టుకుంటాయి! అని ఎవ్వరో చెప్పినట్లైంది.

ప్రేమ— కోరికలు వదలుకోవాలి. కాల్చివేయాలి ఎలా! దానికి సాధన కావాలి. భక్తితో దేనినైనా సాధించవచ్చు.

పాపాలను కడిగివేసుకుని దేవుణ్ని ప్రార్థించి నప్పుడే నిజమైన ఆనందం స్వర్గానందం కలుగుతుంది. ఆ ప్రేమ— దైవప్రేమ సంపాదించాలంటే సరైన బాటలో దేవుణ్ని చేరుకోవాలి.

ఎలా ?

దేవుణ్ని ప్రార్థించాలి, ధ్యానించాలి, తపస్సు చెయ్యాలి.

సాహిత్య ఆరోజు నుంచే ధ్యానం ప్రారంభించింది. ఆశ్రమములో తన గదిలో ఈశాన్యమూల పరిశుభ్రపరచింది. దర్భలతో అల్లిన చాపవేసి దానిపై జింక చర్మాన్ని పరచింది. తెల్లని వస్త్రం కప్పి శాస్త్రోక్తంగ ధ్యాన పీఠంపై పద్మాసనం వేసుకుని ధ్యానం ప్రారంభించింది. మెడ— భుజాలు— చేతులు— చేతి వేళ్లు— పొట్ట— వీపు— తొడలు— మోకాళ్లు— పిక్కలు — పాదాలు అన్నీ రిలాక్స్ చేసి సులువుగా ఏకాగ్రతలో ఓం అంటూ దేవుని పేర్లతో ధ్యానించసాగింది.

గత విషయాలు పూర్తిగా విస్మరించాలి. కోపాలు— తాపాలు— దుఃఖం దరిచేరనీయకూడదు. ఒకవేళ మనస్సున చొరబడితే ... వాటిని పారద్రోయాలి. పట్టుదలగ ఇష్టదైవాన్ని స్మరించాలి.

మొదట ధ్యాన విధానం కష్టమనిపించినా రాను రాను అలవాటై అందులో ఆనందం దొరికింది. మనశ్శాంతి చోటు చేసుకుంది. ఆ ఆనందం వర్ణించలేంది. ఆ హాయి చెప్పలేంది. ధ్యానంలో కన్నులు అరమోడ్పులైనవి.

మొదటిరోజు గంట,రెండోరోజు రెండుగంటలు. అలా గంటల తరబడి ధ్యానలో వుండిపోసాగింది. తల్లి — తండ్రి చూస్తూండిపోయారు. సాహిత్య ఇష్టాన్ని అప్పుడు ఇప్పుడు ఎప్పుడూ కాదనలేదు.

తల్లి కంటి తడిని తుడుచుకుంటూనేవుంది.

సాహిత్య పరదేశ పర్యటనలో పోస్టుకార్డులు పంపిస్తూ ఇండియాకి వచ్చాక ఏ కబురు వ్రాయలేదు. సాహిత్య అక్క బావల దగ్గరకు వాళ్లు ఎక్కడ వున్నారో తెలుసుకుని సాహిత్యను వెతుక్కుంటూ వచ్చాడు. రవిచంద్రను చూడగానే తల్లి పెద్దగా ఏడ్చింది. ఎప్పటినుంచో గూడు కట్టుకుంటున్న దుఃఖం వెలుటికి వచ్చింది.

గోపాల్‌రావుగారు నిశ్శబ్దంగా కన్నీరు కార్చారు.

సాహిత్య లేదేమి! ఎక్కడ వుంది? క్షేమమేనా? శంకిస్తున్న మనస్సుతో గోపాల్‌రావ్ వెంట వెళ్లాడు.

అడవిలో నుంచి పోతుంటే అడుగులు తడ

బడ్డాయి. హృదయం చిక్క పట్టుకుని, తల వంచుకుని, భారంగ అడుగులు వేస్తున్న గోపాల్‌రావ్‌గారి వెంట నడిచాడు. కొండ ఎక్కారు. చుట్టూ నీళ్ల మధ్య దీవి వున్నట్లు ఆకాశాన్ని అంటే వృక్షాలు, మధ్యన శుభ్రంచేసి తివాచి పరిచినట్లున్న పచ్చిక బయలు —

దేవదారు మానుకు ఆనుకుని పద్మాసనంలో కూర్చున్న సాహిత్యను చూచి వూపిరి తీసుకోవటం మరచిపోయాడు రవిచంద్ర.

కాషాయి రంగు అంగీ—చేతిలో జపమాల—సూర్యుడు వెలుగు కుమ్మరిస్తున్నట్లు దారగా క్రిందికి జారుతున్న సూర్యరశ్మి, ఆ వెలుగులో సాహిత్య వింతగ, దేదీప్యమానంగ వెలిగిపోతూంది.

కాశాయి వస్త్రాలు— రుద్రాక్షమాల—తపస్సు చేస్తున్నట్లున్న సాహిత్యను కళ్లప్పగించి చూశాడు. తను కల కంటున్నాడు, చూస్తున్నది వాస్తవంకాదు అనుకుంటున్నాడు రవిచంద్ర.

''నీవు చూస్తున్నది నిజం! స్వామి సుఖదేవానందజీ మహరాజ్ దగ్గర మంత్రోపదేశం పొంది సన్యసించింది సాహిత్య.''

రవిచంద్ర భుజంపై చేయివేసి వెనక్కితీసుకుపోతూ చెప్పాడు గోపాల్‌రావుగారు.

* * *

మోకాళ్లమధ్య ముఖం దాచుకుని దుఃఖిస్తున్న రవిచంద్రతో గోపాల్‌రావ్‌గారు అన్నారు... ''రవిచంద్రా! నీ తప్పేమిలేదు. సాహిత్య ఇలా సన్యాసం స్వీకరించటానికి నీవేమాత్రం బాధ్యుడవు కాదు. ఆ సంగతి మాకు తెలుసు.

సాహిత్య మనస్సు అతి సున్నితమైంది. జీవితంలో ఎదురయ్యే ఒడుదుకులను ఎదుర్కోలేదు. జీవితమంతా వూలబాటపై నడిచిపోవాలంటే సాధ్యమవుతుందా ?

తనకి ఏది కావాలనుకుంటుందో అది పొందాల్సిందే. ఇవ్వాల్సిందే. దొరికేదాక పట్టినపట్టు వదలదు. అంతు చూస్తుంది.

నీకు పెళ్లి అయినదని తెలిసి, నిన్ను ప్రేమించినందుకు పెళ్లి చేసుకునేదాక వూరుకోలేదు.

జీవితంలో మొదటనే తప్పటడుగు వేసింది ప్రాయశ్చిత్తంచేసుకుంటానన్నది. అసలు కారణం నాకు తెలుసు. ఈ వైరాగ్యం అనేది మా వంశంలో వుంది. మా పెద్దనాన్న దేవుడ్ని చూడాలనుకున్నాడు. ఒకరోజు గంగలో మునిగిపోయాడు.

మా తాతగారు సన్యాసుల్లో కలిసి హిమాలయాల్లోకి వెళ్లిపోయాడు.

తీర్థయాత్రలకు వెళ్లిన మా అక్కగారు బృందావనంలో నిలిచిపోయింది.

సాహిత్య ఈ జీవితాన్ని ఎంచుకున్నందుకు మాకు చింతలేదు. పైగా ఆనందంగా వుంది.

స్లీపింగ్ పిల్స్ మింగిన దగ్గరనుంచి మెంటల్‌గా ఆరోగ్యంగా లేదని మా అభిప్రాయం.

సాహిత్యకు ఏది తక్కువైనా తట్టుకునే శక్తి లేదు. ప్రశాంతమైన జీవితం—పవిత్రమైన జీవితం భగవంతుని ధ్యాసలో సుఖంగ వుంది. అంతకంటే మాకు కావలసినదేమిటి!

సంసారికన్న సన్యాసి జీవితం శుభప్రదమైనది. మరో జన్మలేదు. ఆత్మ దేవునిలో లీనమైపోటానికి చివరి మజిలీ. దానికి మనందరి సహకారం, తోడ్పాటు ఇవ్వటం మన ధర్మం...''

సాహిత్య చిన్నది. తనపై కోపానికి ఇలా చేసింది. లాలించి అలక తీర్చి సందించి కౌగిలించితే—పారవశ్యముతో తనను పెనవేసుకు పోతుంది— అన్న ఆశతో సాహిత్య దగ్గరకు వెళ్లాడు. మనస్పూరా— ప్రేమగా— కోరిక నింపుకున్న స్వరంతో ''సత్యా!'' అని పిలిచాడు.

కళ్లెత్తి చూచింది. ఆమె కళ్లల్లో కనుపించిన కాంతి రవిచంద్రను విభ్రాంతునిగా చేసింది.

దేవుని సాక్షాత్కరించుకున్నట్లు నిర్మలంగా, దివ్యంగా వుంది ఆ చూపు.

సాహిత్య తనను గుర్తించి పలకరింపుగా నవ్విన నవ్వు వర్ణనాతీతం. భావానికందినా భాషకందనిది.

చెంత చేరి సాహిత్యను చేతుల్లోకి తీసుకొనే శక్తి, తాకే అర్హత కోల్పోయినట్లు నిలిచిన చోటే వుండిపోయాడు.

భక్తులతో కలసి గీతా మందిరానికి వెళ్తున్న సాహిత్యను వెంబడించలేక, 'ఆనాడు కృష్ణుడు చనిపోయాడని విన్న సత్యభామ తపస్సు చేసుకోటానికి అడవులకు వెళ్లింది. నేను బ్రతికి వుండగానే — నా సత్య తపస్సుకు పోతోంది !' అని తలచి,

మౌనంగా వృద్ధ దంపతుల దగ్గిర సెలవు తీసుకుని గంగ ఒడ్డుకు చేరుకున్నాడు.

సూర్యుడు అస్తమించినా మిగిలి వున్న వెలుగులో పడవ ఎక్కి అవతల ఒడ్డుకు చేరుకున్నాడు రవిచంద్ర.

*[అయిపోయింది]*

# వ్యక్తిగతం



మదర్ తెరెసా బంగళాదేశ్ వెళ్లారు. అక్కడ ఆమె సేవకి బంగళాదేశ్ సైనిక పాలకుడు ఎర్షాద్ ప్రోత్సాహం లభించేట్లుందిట ...



కర్ణాటకకి కొత్త ముఖ్యమంత్రి శ్రీ హెగ్డే. ఒకనాడు కాంగ్రెసు. నేడు జనతా. శ్రీ హెగ్డేది "ఉత్తర కన్నడ" ప్రాంతం.



బెంగుళూరులో కృశ్చేవా ? కాదు, శ్రీ నిజలింగప్ప జనతా ముఖ్యమంత్రి ప్రమాణస్వీకారం చేశారన్న సంతోషంతో ...



ఆగాఖాన్ ఒక తెగ మహమ్మదీయుల నాయకుడు. ప్రపంచంలోకెల్లా సంపన్నులలో ఒకరు. ప్రవక్త మహమ్మద్ కుటుంబంలో నుంచి ఉద్భవించినవారుగా పరిగణింపబడుతారు. భారతదేశంలో పర్యటిస్తున్నారు ...

# వారఫలం

4-2-1983 శుక్రవారం మొదలు
10-2-1983 గురువారం వరకు

**♈ మేషం:** ప్రతి వ్యవహారంలో మీకు అనుకూలమే. చాలమందికి ప్రయాణం చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది. సాహితీ రంగంలో ప్రతిభ గలవారికీ, పత్రికా ప్రకటనం చేసే వారికీ అనుకూల వారం. స్త్రీలకు: ప్రయాణావకాశాలు, కుటుంబానందం గలవారం.

**♉ వృషభం:** ఎలాంటి పరిస్థితులందు కూడా మీకు అపకారం జరుగదు. చాల మంది మీ మూలంగా లాభం గడింపనున్నారు. స్థిరాస్తి వృద్ధి నందగల సమయం. వస్తు సేకరణకు అవకాశమున్నది. స్త్రీలకు: వృత్తి ఉద్యోగాలందు అనుకూలత. అప్రయత్న ధనలబ్ధికి అవకాశం గలవారం.

**♊ మిథునం:** 'ప్రతివారం యింతేనా' అనుకోకుండా ధనసంబంధమైన చిక్కులు నివృత్తి కాగలవు. అధికారుల ఆదరణ, అమూల్య వస్తు సేకరణకు అవకాశమున్నది. పురావస్తు ప్రదర్శనశాలలంద దేవాదాయ ధర్మాదాయము లందు పరిచయమున్న వారికి మేలున్నది. స్త్రీలకు: వృత్తిలో పెంపు, ఉద్యోగమందు అనుకూలత.

**♋ కర్కాటకం:** మీకు గల సాహితీ జ్ఞానం మూలంగా, సదవకాశాలు ఆర్జించుకో గలరు. మిత్రుల సహాయం వలన ఒకానొక వ్యవహార సంబంధమైన చిక్కు నివృత్తి కాగలదు. సగము జరిగి నిలచిన వ్యవహారం ఈవారం సానుకూలం కాగలదు. స్త్రీలకు: దైవ కార్యాలు నెరవేరుతాయి. భూమి గాని, గృహము గాని కొనే ప్రయత్నముంటుంది.

**♌ సింహం:** చాలా దూర ప్రాంతాలకు మీరు ప్రయాణించనున్నారు. చాల మంది మిత్రుల సహాయం అందుకోనున్నారు. సుఖ సంతోషాలతో విందు వినోదాలతో వారం గడిచి పోనున్నది. స్త్రీలకు: వృత్తి ఉద్యోగము లందు, శుభ కార్యానుకూలత యందు మీకు మేలే జరుగుతుంది. గమనించి శ్రమించండి.

**♍ కన్య:** అధికార వర్గం వలన మేలు సమకూడనున్నది. వస్తు సేకరణయందు అనుకూల మున్నది. అయినవార సబంధం కొరకు తాపత్రయ పడటం కూడ చెప్ప దగిన అంశం. స్త్రీలకు: నగలు కొనటం, విలువగల వస్తువులు సేకరించుకోవటం, చిన్నదో పెద్దదో ప్రయాణం చెప్పదగిన అంశాలు.

**♎ తుల:** ఎదుట వారి మనసు నెరిగి ప్రవర్తించటం, మీకు ఈవారం ఎంతైనా న్యాయం. ప్రయాణాల్లో వస్తువులు పోగొట్టుకొంటాం మా జాగ్రత్త! ఉపాని తగాలకు కూడా ఈవారం దారి తీయవచ్చు. స్త్రీలకు: ఆనందంగా, వస్తు సేకరణతో కాలం గడుస్తుంది.

**♏ వృశ్చికం:** వ్యాపారంలో ఒడిదుడుకులు తప్పించుకొంటారు. మీకై మీరే గ్రహిస్తారు అన్ని వ్యవహారాలు సక్రమంగా జరిగి పోతున్నాయని. సరాయి వారి వలన గాక బంధువుల మూలంగా గాని మీకు రావలసిన పైకం చేతి కందుతుంది. స్త్రీలకు: అప్రయత్న ధనలబ్ధి, విలాస వస్తు సేకరణకు అవకాశమున్నది.

**♐ ధనుస్సు:** ప్రతిభ గణించుటకు అవకాశమున్నది. హటాత్తుగా బంధువులు యింటికి రానున్నారు. ఉద్యోగంలో ఏవో నూతనావకాశాలు లభించక పోవు కొందరకు రాజకీయంగా సర్వానుకూల దాయకం. గృహ నిర్మాణానికి యత్నాలు చేయటం కూడా కొందర విషయంలో చెప్పదగిన అంశం. స్త్రీలకు: నూతన విధాన ధనాదాయ మున్నది

**♑ మకరం:** అప్రయత్నంగా ధనాదాయమున్నది. అవకాశ వాదులను మీ పని చెడగొట్టే వారిని దగ్గర చేర్చకండి. మీతో సంబంబంధం చేయాలని కొందరు శుభ కార్య ప్రస్తావనలు జరుపుట కూడా గమనించగలరు. స్త్రీలకు: నగలు సంపాదించటం, నూతనాంశాలు తెలిసి కోవటంనికి కూడా అవకాశం గలవారమే.

**♒ కుంభం:** భూమి కొనుగోలు చేయుటకు క్రయ విక్రయాలలో ప్రగతి నందుటకు చేసే ప్రయత్నాలు ఫలవంతం కానున్నవి. పోగొట్టు కొన్న వస్తువుల భోగట్టా తెలిసికో గలుగుతారు. స్త్రీలకు: ధనలబ్ధి కుటుంబానందం, ఆరోగ్య భాగ్యం చేకూర గల వారమని గ్రహించాలి.

**♓ మీనం:** బంధువుల ఆదరణ లభిస్తుంది. ఆరోగ్యం ప్రకాశంగా ప్రసన్నంగా ఉంటుంది. స్థిరాస్తి వృద్ధి పొందు కొనే ప్రయత్నాలు చేపడుతారు. గనుల నుండి లోహముల మూలంగా ఆదాయం కూడా సంపాదించు కొనుటకు ప్రయత్నాలుంటాయి. స్త్రీలకు: అధికార వృద్ధి, కుటుంబానందం యిత్యాదులకు లోటులేని వారంగా గ్రహించండి.

-- విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★




సుబ్రావ్ కలలో, ఊహలో అనుకోలేదు అతనిని ఇంత అదృష్టం వరిస్తుంది అని.

అవును మరి మాటలా? చిన్నప్పుడే తల్లి దండ్రులను పోగొట్టుకున్న సుబ్రావ్‌ని బామ్మ వాళ్ళింటిలో వీళ్ళ ఇంటిలో కొంచెం పనులు చేసినట్లు, వడియాలు, అప్పడాలు చేసి, ఉన్న ఎకరం పొలం అమ్మి... మొత్తంమీద ఎమ్. కామ్ వరకు పెట్టుబడిపెట్టి సుబ్రావ్‌ని చదివించింది.

బామ్మ పెట్టుబడి వృధా చేయకుండా ఎమ్. కామ్. వరకు గోల్డ్‌మెడల్ తెచ్చుకొని మరీ ప్యాసయ్యాడు సుబ్రావ్.

సుబ్రావ్‌కి ప్రతీ పైసా విలువ ఎంతో తెలుసు. టెన్త్ క్లాసు ఫస్టులో ప్యాసయినప్పుడు స్నేహితులు బీరు సీసాలు తెచ్చి మాకు పార్టీ ఇవ్వరా అన్నప్పుడు ముక్కుమీద వేలేసుకున్నాడు.

డిగ్రీ పూర్తిచేసి గోల్డ్‌మెడల్ వచ్చినప్పుడు బార్‌కి తీసుకువెళ్ళి రమ్ జిన్‌తో పార్టీ ఇవ్వరా అన్నప్పుడు గుండెలు బాదుకున్నాడు.

వీడు వట్టి పిసినారి... వీడిని అంతంత పెద్ద పెద్ద కోరికలు కోరడం ఎందుకుగానీ... సినిమాకి తీసుకువెళ్ళి ఒక పెద్ద హోటల్‌లో టీపార్టీ ఇవ్వరా అన్నప్పుడు ఇప్పుడే వస్తానుండండి అని డొక్కు సైకిలు కిర్రుకిర్రు అంటుంటే స్పీడుగా ఇంటికి వెళుతున్న సుబ్రావ్‌ని చూసి 'మనవాడు మారడోచ్' అని, ''ఇంటికి వెళ్ళి వాళ్ళ బామ్మను డబ్బులు అడిగి తెస్తాడు, ఈలోగా మనం ఏ సినిమాకి వెళదామో ఆలోచించుకుందాం' అని స్నేహితులు తెగ సంతోషపడి ఆలోచించసాగారు.

ఒరేయ్ ''పట్నంలో పడుచుపిల్ల''కి వెళదాం అని స్నేహితులు అనుకుంటుండగానే...

''చేతులు పట్టండిరా'' అన్నాడు సుబ్రావ్!

ఏంటో మనవాడికి హుషారొచ్చింది అనుకొని అందరు చేతులు చాచేటప్పటికి అందరి చేతుల్లో తలోక నిమ్మతొనబిళ్ల పెట్టి ఇంటికి పరుగుపెట్టాడు సుబ్రావ్!

''వీడి పిసనారితనం మండిపోను'' అని స్నేహితులు తెగ తిట్టుకున్నారు.

స్నేహితులు చుట్టుపక్కలవాళ్ళు సుబ్రావ్‌ని పిసినారి అనుకొన్నా బామ్మ మాత్రం సుబ్రావ్‌ని చూసి తెగ పొంగిపోయేది.

కారణం!

బామ్మ గీసిన గీటు దాటక పోవడమే కాకుండా, గడ్డాలు, మీసాలు వచ్చినా గట్టిగా పదిపైసలయిన దుబరా ఖర్చు చేయడని.

అన్నింటిలో గోల్డ్ మెడల్ రావడంతో వెళ్ళిన మెదటి ఉద్యోగానికే ధన్‌మని ఆఫీసరయ్యి కూర్చున్నాడు సుబ్రావ్.

''మా నాయనే! మా తండ్రే, అన్నీ చూసానురా బాబు నా కళ్ళతో, ఇక నీ పెళ్ళి తప్పించి. అది కూడ నా కళ్ళతో చూస్తే ఇక నేను వైకుంఠానికి వెళ్ళిపోతానురా'' అంది.

చిన్నప్పటినుంచి తన దగ్గరే ఉన్న బామ్మ ఒక్కసారి పెళ్ళిచేసి వైకుంటానికి వెళ్ళిపోతానురా అనేటప్పటికి సుబ్రావ్‌కి దుఃఖం ఆగింది కాదు.

''అదేంటే బామ్మ ... నన్ను విడిచి వెళ్ళిపోతావా? నువ్వొక్క దానివి అక్కడ ఎలాగుంటావే, నేను వస్తానే'' అన్నాడు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

''నోరు ముయ్యరా! పిచ్చిసన్నాసి ... తెలివి తెల్లారి నట్టే ఉంది...నీకింకా బోలెడు కాలం ఉంది... నిండా నూరేళ్ళు బతకాలి. నేనంటవా కాటికి కాళ్ళు జాపుకున్నదానిని ఎలాగు చచ్చేదానిని అని...... అలా అన్నాను. అది సరేగాని... గరకపాలెం... గురున్నాధం పంతులుగారి గాయిత్రిని చేసుకుంటావా నాయనా... ఎంచక్కా మంచం, కంచం, ఫ్యాను అన్నీ ఇచ్చి పదిహేనువేలు ఇస్తామని కబురు పంపారు... ఏమంటావు నాయనా'' అంది బామ్మ.

''అమ్మో! పదిహేనువేలే! అయితే చేసుకుంటానే బామ్మ... మరి ఆ గాయిత్రికి భోజనం... సినిమాలు అన్నీ చూపెట్టాలంటే తక్కువ ఖర్చు అవుతుందేమిటి? మరో పదిహేనువేలు అడగవే బామ్మ'' అన్నాడు సుబ్రావ్.

''నోరుముయ్యరా పిచ్చిసన్నాసి! వెధవ మాటలు నువ్వును. ఇచ్చింది సంతోషంగా తీసుకోవాలి,అంతేకాని బేరాలాడకూడదు, అది సరేగాని కట్టుకున్న పెళ్ళానికి భోజనంకి సినిమాలకి ఖర్చు చేయకపోతే పరాయి వాళ్ళకి ఖర్చు చేస్తావేమిటిరా సన్నాసి'' అని మందలించింది బామ్మ.

''నీకేం! నువ్వెన్ని అయిన చెబుతావ్ కబుర్లు, కష్టపడి సంపాదించేవాడిని నాకు బాధగాని'' అన్నాడు.

ఎలాగైతేనేం సుబ్రావ్‌కి గాయిత్రితో వివాహం జరిగి, ఉన్న ఊరు నుండి విజయవాడకు ఉద్యోగంలో జాయిన్ కావడానికి గాయిత్రితో వచ్చి చిన్న ఇల్లు అద్దెకు తీసుకొని కాపురం పెట్టాడు.

* * *

సుబ్రావ్, గాయిత్రి సినిమాకి బయలుదేరారు. రిక్షావాళ్ళతో దారిపొడుగున బేరాలాడుతూ నడుస్తున్న భర్తను చూస్తుంటే చిరాకనిపించింది గాయిత్రికి. అయినా ఏమనలేక, ఎవరైన తమని చూస్తున్నారు ఏమో అని చుట్టూ చూసింది. ఎవరు గమనించకపోవడం చూసి హమ్మయ్య అనుకొంది.

''ఏయ్! రిక్షా శైలజ హాలుకి వస్తావా?'' అన్నాడు.

''రూపాయిన్నర ఇప్పించండయ్య'' అన్నాడు రిక్షావాడు.

గాయిత్రి గతుక్కుమంది.

'స్టేషను దగ్గర అడిగితే రూపాయిపావలా అన్నాడు ముందు రిక్షావాడు... ఇంత దూరం నడిచి లాకుల దగ్గర అడిగితే రూపాయిన్నర అంటున్నాడు వెధవ' అని మనసులో సుబ్రావ్ అనుకొని,

''మతేమయిన పోతుందేమిటయ్యా, ఎంత దూరం ఉందని ఇక్కడనుంచి ఇక్కడకు'' అన్నాడు.

''ఎందుకయ్యా అలా గసురుకుంటారు, మనుషులను ఎక్కించుకొని లాగద్దూ, రూపాయిపావలా ఇప్పించండి'' అన్నాడు.

''చాల్లే! కబుర్లుకేంకాని అరవై పైసలు ఇస్తాను వస్తావా'' అన్నాడు.

''సెమించండయ్యా! పొరపాటున ఎక్కువ అడిగేసాను, ఇరవై పైసాలు ఇప్పించండి'' అని వేళాకోళంగా నవ్వసాగాడు.

సుబ్రావ్‌కి ఎక్కడలేని కోపం వచ్చింది. ''వెధవ ఎంత పొగరు'' అనుకొని ''రా గాయిత్రి సరదగా షికారులా నడిచి వెళదాం'' అన్నాడు.

గాయిత్రికి వళ్ళు మండిపోయింది సుబ్రావ్ పిసనారితనంకి. అయినా క్రొత్తవలన ఏమీ అనలేక నోరు మూసుకుంది.

సినీమాహాలు దగ్గర సన్నజాజిపూలు చూసేటప్పటికి ఎక్కలేని కోరిక కలిగింది. సన్నజాజులంటే చాలా ఇష్టం గాయిత్రికి.

''ఏమండీ! సన్నజాజులు నాలుగు మూరలు కొని తీసుకురారు'' అంది.

''పువ్వులా! ఇప్పుడెందుకు'' అన్నాడు పూలకి డబ్బు ఖర్చుచేయడం ఇష్టంలేక.

''ఎందుకేమిటండి? నాకెంత ఇష్టం అనుకున్నారు. మా నాన్నగారు పది మూరలు కొని ఇచ్చేవారు. నిండుగా పెట్టుకునే దానిని...'' అంది.

''మీ నాన్న కెంలే? పొలం పుట్టా ఉంది. మనలాగ రెక్కాడితేగాని డొక్క ఆడని వాడు కాదు'' అని క్రొత్తగా పెళ్ళి అయిన భార్యని బాధపెట్టడం ఇష్టంలేక పూలదగ్గరకు వెళ్ళాడు...

మూర 40 పైసలు అని అక్కడొక్కపువ్వు అక్కడొకపువ్వు ఉన్న మాల చూపెట్టేటప్పటికి సుబ్రావ్ ప్రాణం చివుక్కుమంది. నాలుగు మూరలంటే రూపాయి అరవైపైసలు. అమ్మో అంత ఖరీదే! అని ఆలోచనలో ఉండగానే, ''చామంతులు తీసుకోండయ్య మూర ఇరవై పైసలు'' అన్నాడు ప్రక్క పూలవాడు.

''ఒక్క మూర కొన్నా తలనిండా ఉంటాయి. అవీగాక రేపు కూడా పెట్టుకోవచ్చు'' అనుకొని ఒక మూర చామంతులు కొని గాయిత్రి దగ్గరకు వచ్చి ఇచ్చాడు.

భర్త పిసనారితనం చూసి నోటమాట రాలేదు గాయిత్రికి.

స్టైయిల్‌గా బాల్కనీ వైపు అడుగులు వేస్తున్న గాయిత్రి చేయి పట్టుకున్నాడు సుబ్రావ్.

ఎక్కడలేని సిగ్గుతో తలఎత్తి సుబ్రావ్ వైపు చూడలేక పోయింది. ఎంత కొత్తగా పెళ్ళయితే మాత్రం అందరిలో చేయి పట్టుకుంటారు ఏమిటి? ముసిముసిగా నవ్వుకుంది.

''అటుకాదు ఇటు'' అని కుర్చీ టిక్కట్టు రెండున్నర వైపు నడుస్తుంటే ఒక్క నిముషం కొయ్యబారి పోయింది గాయిత్రి.

తన భర్త గోల్డ్ మెడలిస్టు... పెద్ద ఆఫీసరు... చీకుచింతాలేని కాపురం అని వేలకువేలు కుమ్మరించి సారె చీరతో ఘనంగా పెళ్ళి జరిపించారు తనవాళ్ళు.

# సుబ్రావ్‌కి కోపం వచ్చింది

కాని తన భర్త పిసనారితనం తెలిస్తే వాళ్ళు ఎంత బాధపడతారో!

అందరిలో ఘర్షణ పడడం ఎందుకని సిగ్గుతో వళ్ళు చచ్చిపోతుంటే తలదించుకొని హాల్లోకి నడిచింది గాయిత్రి.

''ఏమండీ! మీకసలు బుద్ధి ఉందా? మీ ఉద్యోగం మరచిపోయారా, మనలాంటివాళ్ళు అసలు ఈ టిక్కట్టుకి వస్తారా? మీకు లేకపోతే పోయింది సిగ్గు, నాకు వళ్ళు చచ్చిపోతోంది. పిసనారితనం ఉంటే ఉండచ్చు, మరీ ఇంత పనికి రాదండీ'' అంది.

''ఆ... ఇంకా ఉందా ఉపన్యాసం... ఇందులో సిగ్గుతో బాధపడిపోవలసినంత ఏం ఉంది? అందరు చూసేది సినిమాయే!'' అన్నాడు.

''అయితే నేల టిక్కట్టు తీయలేకపోయారా? మళ్ళా రూపాయి దండగ చేసారు'' అంది ఉక్రోషంగా!

## పాదరక్షల వ్యతిరేకోద్యమం!

జపానులో పాదరక్షల వ్యతిరేకోద్యమం ప్రారంభమైంది. ఇది కిండర్ గార్డెన్ స్కూళ్ళనుండి క్రమేణా అన్ని రంగాలకు పాకుతున్నది. చెప్పులు లేకుండా నడవటమే ఆరోగ్యకరం అని కొంతమంది భావించటం మొదలుపెట్టారు. అయితే దీనికి తగిన నిరూపణ లభించలేదు. జపాను ఆరోగ్య సంక్షేమ శాఖవారు దీనిని పరిశీలించటానికి ఒక సంఘాన్ని నియమించారు. ఏది ఏమైనా, బూట్లు లేకుండా స్కూళ్ళకువెళ్ళటం చిన్న పిల్లలకు చాలా సంతోషంగా వుంది. అయితే చిన్న పిల్లలు పాదరక్షలు లేకుండా ఎక్కువ కాలం నిలబడటం, నడవటం చేయలేరని కొంతమంది భావిస్తున్నారు. పాదరక్షల వ్యతిరేకోద్యమం, ప్రాచీనకాలపు స్వచ్ఛత లోనికి వేస్తున్న ఒక అడుగువలె కన్పిస్తున్నది.

''తీద్దును... కాని... కళ్ళు దెబ్బతింటాయి. అసలు గాంధీగారు గావంచి కట్టుకొని పార్లమెంటు మీటింగ్‌కి వెళ్ళారు. ఆయన్ని ఎవరూ తీసిపారేయలేదు. ఆయన నిరాడంబరతకు గౌరవించారు... అసలు మన దేశం గాంధీగారిలా నిరాడంబరత అవలంబించినప్పుడు...''

''చాల్లెండి... ఇంకేం మాట్లాడకండి, మీరు కూడ రేపటినుంచి గావించి కట్టుకొని ఆఫీసుకి వెళ్ళండి'' కోపంగా అని మొఖం అటు తిప్పుకొని కూర్చుంది.

* * *

ఆఫీసులో సుబ్రావ్ అంటే మొత్తం ఆఫీసులో అందరికి మంచి అభిమానం ఏర్పడింది. కారణం లేకపోలేదు. ఆఫీసరు అన్న గర్వం పిసమెత్తు లేకుండా అందరితో సరదగా, మంచిగా ఉండడమే. అందులో చిన్నవయసే సుబ్రావ్‌ది కాబట్టి అంతకు ముందు ఏ ఆఫీసర్‌ముందు నిలబడడానికి భయపడే వాళ్ళందరు కాళీ దొరికినప్పుడల్లా హస్కుకొట్టడం మొదలుపెట్టారు.

ఆఫీసు ఫైల్స్ చూస్తున్న సుబ్రావ్ దగ్గరకు ఆఫీసు స్టాఫ్ కొంతమంది చేత్తో లిస్టు పట్టుకొని రావడం చూసి ''ఏమిటోయ్ విశేషం'' అన్నాడు.

''సార్! ప్రతీ ఏడాది దసరాకి దుర్గాదేవిని పెడతాం. అందరం చందాలు వేసుకొని చాలా బ్రహ్మాండంగా దేవిని పెడతాం సార్. క్రిందటేడాది ఆఫీసరుగారు నూటయాభై ఇచ్చారు సార్'' అన్నారు.

''ఈ ఏడాది మీ పేరున రెండు వందలు వేసాం సార్'' అన్నారు అందరు ఏకకంఠంతో.

మాడిపోయిన పెసరట్టులా సుబ్రావ్ మొఖం మాడిపోవడం చూసి ఆఫీసు స్టాఫ్ అంతా ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు.

ఫోను గణగణ మ్రోగుతుండడంతో ''మీరు వెళ్ళండి బయటకు'' అని అధికారంగా అంటున్న సుబ్రావ్ మాటకు బయటకు నడిచారు.

ఆఫీసరుగారికి అంత సడన్‌గా ఎందుకు కోపం వచ్చిందో? ఎప్పుడులేనిది అంత అధికారంగా ఎందుకు మాట్లాడారో అర్థంగాక ఆఫీసు స్టాఫ్ ఆశ్చర్య పోయారు.

ఇంటికి వచ్చాడన్నమాటేగాని సుబ్రావ్‌కి భోజనం మీద, నిద్రమీద దృష్టిలేదు.

అన్నం తింటుంటే రెండువందలు ... రెండు వందలు అని ఆఫీసు స్టాఫ్ అంతా ఏక కంఠంతో అంటున్నట్లు అనిపించింది.

మధ్యలోనే కంచంలో చేయికడుక్కొని లేచిన భర్తను చూసి, ''ఏమయిందండి? వంట్లోగాని బాగుండలేదా'' అని కంగారుగా అడుగుతున్న గాయిత్రిని చూసి 'ఏం లేదు, నా మనసేం బాగుండలేదు. నా గదిలోకి ఎవరు రావద్దు' అని మంచంమీద బోర్లా పడుకున్నాడు.

మంచం మీద పడుకున్నాడే కాని అటు ఇటు దొర్లుతున్న సుబ్రావ్‌ని చూసి అసలు కారణం ఏమిటా అని ఆలోచించసాగింది గాయిత్రి.

కళ్ళు మూసినా, తెరిచినా రెండు వందలు కనబడసాగింది సుబ్రావ్‌కి.

ఉహూ...లాభంలేదు. ఇంకా వారం రోజులుంది దసరావాళ్ళు నా వెంట పడకమానరు. దీనికి ఒక ఉపాయం ఆలోచించాలి అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

'హాయే! తట్టింది ఐడియా! వెధవలు ఆఫీసరంటే నా ముందు నిలబడడానికి గజగజ వణికి చావలసింది. రెండు నెలల క్రితం ఆఫీసరుగా ఆఫీసుకి వచ్చినప్పుడు ఒక్కడి నోటి వెంట మాట రాలేదు... ఫ్రీగా... సరదగా వాళ్ళతో ఉండబట్టే వాళ్ళకు భయం లేకుండాపోయి చందా రెండు వందలు ఇవ్వమని దర్జాగా అడిగారు. అమ్మో! రూపాయి కాదు ... అర్థరూపాయి కాదు... వెధవలు ఒక్కొక్కడిని ట్రాన్స్‌ఫర్ చేయించి పారేస్తాను ... పిచ్చిపిచ్చిగా ఆఫీసులో వాగితే డిస్‌ప్లెయిన్ లేకుండా ప్రవర్తించినా రేపటి రోజు నుంచి లేని కోపం తెచ్చుకుని హడావిడి చేయాలి.

అందరి నోరులు మూత పడడమే కాకుండా చందామాట ఎత్తరు.

## ఒలింపిక్ కోచ్ జిమ్ ఐ డోహార్టీ అంటారుగదా:

# "బలం, చేవా సమకూర్చడానికి కాంప్లాన్® లాంటిది మరొకటి లేదు మరి."

ఒలింపియన్ జిమ్ ఓ' డోహార్టీ, జటిలమైన పోటీ పందేలకోసం, భారతదేశంలోనే గాక ప్రపంచమంతటా, ఉత్సాహంగల యువతరం వారికి తరిఫీదు యిచ్చారు. ఛాంపియను పుట్టుకతో అవరు, తరిఫీదు యిచ్చి తయారుచేయాలి వారిని అని ఆయన నమ్మకం. మరి విజేత అవడానికి కావలసినది మనో శక్తి—దాంతోటే శరీర శక్తీను.

"ఈతగాళ్ళకీ, ఎథెలెట్స్‌కీ, ముఖ్యంగా, పెరిగే వయస్సులో పిల్లలకీ కాంప్లాన్ తీసుకోమని సిఫార్సు చేస్తాను," అంటారు. జిమ్ ఓ' డోహార్టీ. "కాంప్లాన్, ఆ చేవను సమకూర్చడంకోసం ఆరోగ్యవంతమైన పెరుగుదలనిచ్చే, తేలికగా అరగగల, 23 కీలక పదార్థాలున్న సంపూర్ణ ఆహారం."

ఈ కిటుకును జిమ్ ఓ' డోహార్టీ నుంచి తెలుసుకోండి. మీ పిల్లలకు, పూర్తిగా ఆరోగ్యవంతమైన పెరుగుదలకోసం, ప్రతి రోజూ యివ్వండి కాంప్లాన్. కాంప్లాన్ రుచికరమైన సువాసల్లో వస్తుంది—పిల్లలకిది ఎంతో యిష్టం!




## కాంప్లాన్® -సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

GLC.9-2116 TL







## సుబ్రావ్‌కి కోపం వచ్చింది

అనుకున్న ప్రకారం ఆఫీసుకి మరునాడు వెళ్ళి అందరి మీద పెద్ద పెద్ద కేకలు వేసి హడావిడిచేసి పారేశాడు సుబ్రావ్.

అందరికి సుబ్రావ్‌కి అంత సడన్‌గా ఎందుకు కోపం వచ్చిందో అర్థంగాక తల గోక్కోసాగారు.

దసరా దగ్గర పడుతోంది. చందా డబ్బులు అడిగితే బాగుండును అని ఎవరికివారే అనుకున్నారు కాని, సుబ్రావ్ దగ్గరకు వెళ్ళే ధైర్యంలేక వెళ్ళలేక పోయారు.

ఆఫీసర్‌గారికి కోపం తగ్గినాక వెళ్ళి చందా డబ్బు అడగవచ్చు అనుకున్నారు.

కాని సుబ్రావ్ మాత్రం ఇంటికి వచ్చి తెగపొంగిపోసాగాడు.

తను వేసిన ప్లాన్ బాగ సక్సస్ అయిందని, లేకపోతే రెండు వందలు ఇవ్వవలసివచ్చేదని. ఒక్కరికి నన్ను అడిగే ధైర్యం లేకపోవడం అటుంచి, ఎవరికి వారె వాళ్ళని ఎక్కడ ట్రాన్స్‌ఫర్ చేసిపారేస్తాను ఏమో అని గాభరపడి చస్తున్నారు. బాగా కుదిరింది రోగం... రేపు చక్కా ప్రొద్దున్న ట్రైన్‌కే అత్తారింటికి వెళ్ళిపోవచ్చు... ఈ రోజు ఎక్కడ చందా అడుగుతారో అని మరీ అందరిమీద ఎగిరి పోయానని ఒక్కడుకూడ నోరెత్తలేకపోయాడని, హ...హ...హ అని పగలబడి నవ్వుకోసాగాడు సుబ్రావ్...

"ఏమండీ ? ఏమయిందండి ? మీలోమీరు ఆ నవ్వేమిటి" అంది గాయిత్రి.

నాలిక చివరిదాక వచ్చింది సుబ్రావ్‌కి... తను వేసిన ప్లేన్... జరిగిన కథ చెప్పాలని... కాని ఇప్పటికీ పిసినారీ అంటున్న గాయిత్రి ఇంకా ఎగతాళి చేస్తుంది అని "ఏంలేదు" అని..."అన్నట్లు మనం రేపు ఊరెళ్ళిపోతున్నాం... రెడీగా ఉండు... నేనలా బజారులోకి వెళ్ళివస్తాను" అన్నాడు.

"ఎంత మంచివారండి మీరు... నా మనసులో కోరిక ఇట్టే గ్రహించారు... తొందరగా వెళ్ళిరండి" అంది.

* * *

కాలింగ్ బెల్ గణగణ మ్రోగుతుండడంతో బట్టలు సర్దుతున్న గాయిత్రి వెళ్ళి తలుపు తీసింది.

పాతికమందిదాక మనుష్యులుండడం చూసి "ఎవరు మీరు ? ఎవరు కావాలి" అంది.

"నమస్కారం అమ్మా ! మేము ఆఫీసరుగారి స్టాఫుం. ఇదిగో కాగితం చూడండి" అని ఒక లిస్టు కాగితం గాయిత్రి చేతికి అందించారు.

"ఆఫీసరుగారు లేరు, ఇప్పుడే బజారులోకి వెళ్ళారు" అంది.

"సార్ ఎందుకమ్మ...ప్రతిఏడాది ఆఫీసరుగారు అంటే అయ్యగారి ముందు ఆఫీసరుగారు నూటయాభై ఇచ్చేవారు. క్రొత్తగా వచ్చిన ఆఫీసరు గారు రెండువందలు ఇస్తారు అనుకొని సార్‌గారి

మదరాసులోని ప్రముఖ తెలుగు సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్'వారు నూతన సంవత్సర కానుకగా ఏర్పాటు చేసిన నృత్య కార్యక్రమాలలో పాల్గొన్న ప్రముఖ నర్తకి కుమారి యామినీ కృష్ణమూర్తి.



పేరున వ్రాసేసాం కూడ చూడండి. సార్‌గారు ఇచ్చేవారు... ఎంత సహృదయులు... మంచివారు.. ఎందుకోగాని ఈ మధ్యన సడన్‌గా సార్‌గారికి కోపం రావడమే కాకుండా, మాతో చాలా సీరియస్‌గా ఉంటున్నారు. అది మా దురదృష్టం! అసలు మేము ఇంటికి రాకూడదమ్మా ! కాని ఆఫీసరుగారు ఆఫీసు నుండి బయలుదేరినాక ఆఫీసు టైమ్ అయినాక తెలిసిందీ రేపటి నుంచి శలవు తీసుకున్నారని. ఒకవేళ ఊరెళ్ళిపోతారు ఏమో అని ఇంటికి వచ్చాం" అన్నారు అందరు ఏక కంఠంతో.

ఒక్క నిముషం గాయిత్రి ఏం మాట్లాడలేదు.

"మీరు ఆలోచించకండమ్మా ! సరదగా జరుపుకునే పండగ, అందులోకి దుర్గాదేవిది ..." అన్నారు.

"ఆయన మాత్రం ఏమంటారులే... ఆయనకు చూపెట్టాం అంటున్నారుగా" అని బీరువా తెరిచి రెండువందలు వాళ్ళకిస్తూ 'మేము సరదగా వచ్చి దుర్గదేవిని చూసేవాళ్ళం, కాని ఊరెళ్ళిపోతుండడం వలన రాలేము' అంది.

"మీరు, ఆఫీసరుగారు వస్తే మాకు సంతోషంగా ఉండేదమ్మా" అని వాళ్ళు వెళ్ళిపోయారు.

* * *

బజారు నుంచి సుబ్రావ్ ఈల వేస్తూ వచ్చాడు. మొఖంలో సంతోషం కొట్టవచ్చినట్లు కనబడుతోంది.

గాయిత్రి భర్త మొఖంలోకి చూసి, మీరు ఈ మధ్యన పూర్తిగా మరిపోయారండి. ఎప్పుడు హుషారుగా, సంతోషంగా ఉంటున్నారు. ఏమిటో విశేషం నాకు చెప్పండి సంతోషిస్తాను అని "అన్నట్లు మీ ఆఫీస్ స్టాప్ వచ్చారండి" అంది.

"ఆ... వచ్చారా ? తలుపుకాని తీశావేమిటి" అన్నాడు కంగారుగా.

"అదేంటండి...తలుపు కొడితే తియ్యకుండా ఎట్లా అవుతుంది" అంది.

"చంపేసావే ! తీస్తే తీశావు ... ఎవరు లేరని చెప్పలేక పోయవా" అన్నాడు కంగారుగా.

"ఎదురుగుండా నేను వాళ్ళకు కనబడుతుంటే మనుష్యులు లేరని ఎలా చెప్పడం అండి" అంది నవ్వుతూ గాయిత్రి.

"నవ్వకే... నా గుండె భగ్గున మండిపోతుంటే వెధవనవ్వు. ఆ వెధవలు ఏమైన అడిగారా"అన్నాడు.

"అదేం మాటలండి... వాళ్ళు మాత్రం

# కొత్తగొంతులు

## టి.యల్. కాంతారావు

“రగులుతున్న ప్లవంలో
మనిషి తీరని దాహమై
సజీవమైన అసంఖ్యాక ఆత్మల బలంతో
ఈ మట్టిలోంచి
నీటిలో గాలిలో తిరిగే
నీవు—నేను ముందుకు నడవాలి”—నిఖిలేశ్వర్.

కవిత్వం ప్రజల దగ్గరకు వెళ్లాలని కుందుర్తి ఎప్పుడూ చెప్తూ ఉండేవాడు. కవిత్వంలో భావ శిల్పాలు సమ పాళ్లతో కలియాలని ప్రతివాడి నిర్ణయం. శిల్పం భావాన్ని మింగేసినా, భావం శిల్పాన్ని మింగినా మిగిలేది అకవిత్వమే. ఏ ఆశయంతో దిగంబర కవులు కవితా ఉద్యమాన్ని ప్రారంభించారో ఆ ఆశయ సాధనకై పోరాటానికి నిఖిలేశ్వర్ కవిత్వం కొంత బలాన్నిచ్చింది. దిగంబర కవులుగా మూడు సంకలనాలను ప్రచురించినపుడు ఆత్మీయతా ముద్రలో కొంత భేదం సూక్ష్మ దృష్టికి గోచరమవుతుంది. స్థూలంగా దిగంబర కవులను వేరుచేసి ఆ సంకలనాల మేరకు విలువలు నిర్ణయించటం కష్టం. పారే సెలయేరు జ్వాలాముఖి కాగా సముద్ర మధ్యంలోని ప్రశాంతి వంటివాడు నిఖిలేశ్వర్. తిరుగుబాటుతత్వం దిగంబర కవులందరిదీ ఒకటే. ప్రదర్శనలోనే కించిద్భేధం.

నిఖిలేశ్వర్ కవిత్వంలో సెక్సు సింబల్స్ బాగా కనబడతాయి. అవి సెక్సు సాహిత్యానికి చెందినవి కావు. తను వెక్కిరిస్తున్న వ్యవస్థకు హేళనాత్మక ప్రతీకలుగా కొన్ని చోట్ల దిక్కులేని దీనుల వేదనగా మరికొన్ని చోట్ల అగుపిస్తాయి.

పంథొమ్మిది వందల అరవై అయిదు నాటికి— దేశంలో పాతుకున్న జడత్వం, వెన్నెముక విరిగిన యువతరం, సెక్సు సాహిత్యం, జనంలో పిరికితనం, కుక్క కాపలా మనస్తత్వం, వేయి పడగలుగా విస్తరించిన దోపిడి, మరో రూపంగా మారిన వెట్టిచాకిరి, హీనంగా, హేయంగా, ఛండాలంగా, దిక్కులేక, దారితోచక, నిస్సహాయంగా అమ్ముడు పోతున్న మానం, కుళ్ళిపోయిన సాహిత్యం, అవ్యవస్థితమైన మేధస్సు ఇవన్నీ నిఖిలేశ్వర్ కవిత్వానికి భావవాహికలుగా రూపాన్ని పొందాయి. ఆరంభంలో నిర్వేదాన్ని, నిరాశని కవి వివరించినా దిగంబర కవుల సామూహిక పరిణామంలో అతనూ భాగస్వామి అయ్యాడు. చీకటిని పదేపదేదూషించినందువల్ల అదిపోదు.నిద్రిస్తున్న జనచైతన్య వ్యాఘ్రగర్జగా సౌర్యాకృతినిపొందితేనే కాని ఈ వ్యవస్థ అంతం కాదు. చైతన్యం క్రమబద్ధం కావటానికి సిద్ధాంత భావం ఆలంబనం కావాలి. మార్క్సియ సిద్ధాంతం దీనికి ఏకైక మార్గంగా ఆనాటికీ, ఈనాటికీకూడా ఈకవులకు కనబడింది. అందుకే నిఖిలేశ్వర్ దిగంబర కవిగా మూడవ సంపుటిలో—

“కూలుతున్న విలువల్ని ధ్వంసంచేసి
తొక్కుతున్న సుఖాల పెరుపులపై
శూన్యంలాంటి శవాన్ని కాల్చి
ప్రాణం కోసం
మళ్ళీ పంచిపెట్టు హింసను
హింస లోంచిపుట్టే స్వచ్ఛమైన ప్రేమను”

అంటాడు.

ఒక మార్పుని ఆశించేటప్పుడు ఆ మార్పు మునపటి సంప్రదాయంతో పూర్తిగా ఛేదించేదయినప్పుడు దానిని కోరే వ్యక్తి పురాసంప్రదాయాన్ని



బోటల్ గా తిరస్కరిస్తాడు, ద్వేషిస్తాడు. కనుకనే నన్నయ నుండి, అభ్యుదయ కవిత్వం వరకూ నిఖిలేశ్వర్ ‘ఆత్మయోని’లో తిరస్కరించింది. ధ్వంసం లక్ష్యంగా ఉన్నప్పుడు ఆలోచన స్థానాన్ని ఆవేశం ఆక్రమిస్తుంది. నిర్మాణాన్ని గురించి యోచన చేసేటప్పుడు ఆవేశంపాలు తగ్గి ఆలోచన పెరుగుతుంది.

“ఎవరికివారు పూర్తిగా డబ్బుకి దాస్యం
చేస్తున్నప్పుడు
బిచ్చగాళ్ళు—బీదవాళ్ళు— చిక్కిచచ్చినవాళ్ళు
ఈ అడివి తోడేళ్ళకు మిగిలిపోయినపుడు
చెప్పు సత్యం మరోసారి చెప్పు
దేవుళ్ళ కోసం — రాజుల సమాధుల కోసం
బంగారు ఇటుకలతో గోడలు లేపే ఈ
దేశంలో
మట్టిగోడల గోడు వినేవాడెవ్వడు ?”

ఈ పాదాల్లో కనబడే వేదనను ప్రతి పాఠకుడూ అర్థం చేసుకుంటాడు. ఇది పూర్తిగా మార్గం కనబడని నిర్వేద ప్రవృత్తి. ఈ ప్రవృత్తిలోంచి విధ్వంస వాదం ఆరంభమవుతుంది. నిలకడలేని స్థితి ఏర్పడుతుంది. అట్లాంటి స్థితిలోంచి ఒక దృక్పథంతో నిర్మాణాత్మకమైన, మహత్తరమైన మానవీయ వ్యవస్థ కోసం కవిత్వాన్ని మరో దిశగా పయనింపచేశారు దిగంబర కవులు. నిఖిలేశ్వర్ ‘భయం’ అనే ఖండికలో ఈ కుళ్ళు వ్యవస్థను విచ్ఛేదం చెయ్యటంలో స్థైర్యాన్ని ఆవాహనజేశాడు. జనం సాయుధమైతేనే స్వచ్ఛమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కల వ్యవస్థ పుడుతుందని నమ్మాడు. యాభైలక్షల కట్టు బానిసలున్న దేశాన్ని గురించి చెబుతూ —

“మట్టి బొమ్మలుగా
మన్నులో దుమ్ముగా మారుతున్న
యాభైలక్షల కట్టు బానిసలున్న దేశంలో
వెట్టిచాకిరీ రూపం మారినా
పాలకుల స్వభావం మారని ఈ పవిత్ర
భూమిలో
ఏ మూలనైనా మనలో మనిషి బతికి ఉంటే
విముక్తికోసం కసిగా బిగిస్తాడు పిడికిలి”

అని సాయుధ పోరాటాన్ని సమర్థించిన కవి నిఖిలేశ్వర్. ★

---

ఉద్యోగస్తులు కాదు. చందాలడిగారని అంతలేసి మాట్లంటున్నారు” అంది.

“చాల్లే వెధవ కబుర్లు, ఇంతకీ వాళ్ళు ఏమైన అడిగారా కొంపదీసి” అన్నాడు.

“అడగడమేమిటండి ? మీకు చూపెట్టారట కదా ? రేపు రమ్మందాం అంటే ఎలాగు ఊరికి వెళ్ళిపోతున్నాం అని ఇచ్చేసాను.”

“ఆ... ఇచ్చేసావా ? చంపేసావ్ ! అసలు నిన్ను ఎవరు ఇమ్మన్నారు, నీకా అధికారం ఎక్కడిది ? నేను చచ్చాననుకున్నావా ?” కోపంతో సుబ్బారావ్ ఊగిపోయాడు.

“రామ ! రామా ! శుక్రవారంపూట ఇవేం మాటలండి ! మిమ్మలను పదికాలాలు చల్లగా చూడమనే దుర్గాదేవి పూజ కదా అని... మీరు మాత్రం ఇవ్వరా అని ఇచ్చానండి” అంది. అప్పటికే గాయత్రి కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

“నోరుముయ్ ! అసలు నిన్ను ...ఆ వెధవలకి బుద్ధిఉండాలి! ఇంటికి వచ్చి అడుగుతారా? అడిగితే అడిగారు తగదునమ్మా అని ఇస్తావా? అసలు ఎంతిచ్చావో తొందరగా చెప్పి ఏడవ్వే” అని పిచ్చివాడిలా అరవసాగాడు.

“రెం...రెం...రెం...డు వం...దలండి”అంది.

“అమ్మో ! అమ్మో ! రెండు వందలే... నీకు చేతులు అంత డబ్బు ఇవ్వడానికి ఎలాగొచ్చాయే ! నేను వారం రోజులబట్టి కష్టపడి నటించినదంతా గంగలో కలిపేసావ్. రూపాయి కాదు రెండు రూపాయలు కాదు, రెండు వందలు...నా ఎదురుగుండా లే...” అని పిచ్చివాడిలా పెద్ద పెద్ద అరుపులు అరవసాగాడు.

“ఎదురుగుండా కనబడనులెండి రేపటినుంచి. ఎలాగు వెళుతున్నాం కదా, నేను అక్కడే పుట్టింటిలో ఉండిపోతానులెండి. సంవత్సరానికి ఒకసారి వచ్చే దసరా పండుగకి మామూళ్ళు ఇవ్వడానికి, చందా ఇవ్వడానికి ఇంత ఏడుస్తారు అనుకోలేదు” అంది వెక్కిళ్లమధ్య గాయత్రి.

“నోరుముయ్ ! చేసిన వెధవపని చాలక, ఇంకా ఊరెళ్ళుతుందట... మళ్ళీ రైలు చార్జీలు దండగకి. అసలు నువ్వు నా ముందునుంచి లే ! నిన్ను చూస్తుంటే నాకు రెండు వందలు గుర్తు వస్తున్నాయ్” అని గట్టిగా అరవసాగాడు.

పాపం నిజంగా సుబ్బారావ్ కి కోపం వచ్చింది. ★

పెద్దకథ

# తొణికని స్వప్నం

## కోమలాదేవి

*(గత సంచిక తరువాయి)*

వాళ్ళంతా ఒకటైపోయారు. అమలను అందరికి దూరంగా ఉంచేశారు.

మరి! తనను కూడ దూరంగా ఉంచేస్తారు. అది సహజం — తను ... అమల దూరంగా ఉన్నంతవరకు వారందరు కోరినది పొందుతు సుఖంగ సలక్షణంగా ఉంటారు. అమల తనమధ్య మమతాను రాగాలకు చోటు ఉండనంతా మంచిదే — అనుకుంటారా ... తండ్రి మొన్న ఏమన్నాడూ "డబ్బు తెచ్చినందుకు నీ మీద పెత్తనం చెలాయించకుండా చూస్తాను. డబ్బు మన చేతిలో ఉంటుంది. మన ఇష్టప్రకారం వాడుకుందాం. మన విషయాల్లో ఆమె జోక్యం కల్గించుకోకుండా చేస్తాను. నీకు కూడ ఈ బాధ్యతలెందుకు? హాయిగా ఉండు —" అనలేదూ! దాని అంతరార్థం బోధపడి బాధపడ్డాడు. అప్పుడు ఏం పట్టనట్లు 'సరే' అన్నాడు మాధవ్!

చౌరాస్తా దగ్గిర దింపి వెళ్ళిపోతూ డ్రైవర్ నమస్కరించాడు. అక్కడ నుండి నడుచుకుంటూ ఇల్లు జేరాడు.

తల్లి ఎప్పటి మాదిరిగానే అతడి కోసం కనిపెట్టి ఉంది. ఆమె అనవసరంగా ఏమీ ప్రశ్నించలేదు. ఇద్దరు భోంచెసి ఇవతలికి వచ్చారు. ఆ రాత్రి చాలసేపు ఆలోచిస్తూ పడుకున్నాడు.

అమల అడిగిన ఒక్కొక్క ప్రశ్నకు జవాబు వెతుక్కున్నాడు. ఆ రోజు రాత్రి ప్రప్రథంగా ఈ పెళ్ళిని గూర్చి మరో దృష్టితో ఆలోచించాడు. ఆఖరుగా ఆమె హెచ్చరింపును మననం చేసుకున్నాడు. అందులో ఎంత యదార్థం ఉంది? కనుక్కోవాలి - అని నిశ్చయించుకున్నాడు.

ఉదయాన కాఫీ గ్లాస్ పుచ్చుకుని తండ్రి దగ్గరకు వెళ్ళాడు. "నిన్న డబ్బు తెచ్చుకుందాం అంటే— ఆదివారం వెళ్దాం అన్నాను. ఎంత ఇస్తున్నారేమిటి?"

"ఎంతో లేదు. ప్రస్తుతం ఈ ఇంటి రిపేర్ చేయించమన్నాడు. ఆ తరువాత రెండు గదులు కట్టిస్తారు."

"అదే లెండి. ఎంత ఇస్తారట?"

"అరవైవేలు" అదెంతో చిన్న మొత్తంలా చెప్పేసరికి మాధవ్ నిర్ఘాంతపోయాడు. రిపేర్‌కు అరవై వేలా? రెండు గదులకు ఇంకెంత ఇస్తారు? అసలు తనను ఎంతకు అమ్మేస్తున్నాడు తండ్రి.

"అరవై వేలా?" అన్నాడు గ్లాస్ క్రిందపెట్టి.

"ఊ... మరి ఈ ఇంటికి ఎంతపని ఉందో"

తన హృదయంలోని అలజడిని కప్పివేస్తూ ఫకాల్మనవ్వాడు. "ఈ ఇంటికి అంత రిపేర్ పని ఉందన్న సంగతే నాకు తెలీదు" అనగా — తండ్రి కూడా హాయిగా నవ్వాడు. వాతావరణం సడలినట్లుగా ఉంది. ఇదే తగిన సమయం అని మళ్ళీ గ్లాసు అందుకుని ప్రశ్నించాడు "కుసుమను చేసుకుంటాం అని వాళ్ళు ఉత్తరం రాశారుకదా? మరి వెళ్ళారా?"

"లేదు...ఆలోచిస్తున్నాను" తండ్రి నాన్చుతూ జవాబివ్వటంలో ఏదో ఉందని పసిగట్టాడు. నిన్న సాయంత్రం జరిగిన సంభాషణ గుర్తుకు వచ్చింది. వీళ్ళ ఉద్దేశాన్ని అమల ఊహించిందా?

"నా పెళ్ళికి ముందు కుసుమ పెళ్ళి చెయ్యాలనుకున్నాం. గట్టిగానే అనుకున్నాం. ఇంకా ఆలోచించటం ఏమిటి— ఆ రోజు — ఈ సంబంధమైనా స్థిరపడితే బావుండును అని దేవుళ్ళకు మొక్కుకున్న విషయం మర్చిపోయారా? కుసుమకు ఇరవై ఐదేళ్ళు దాటాయన్న సంగతి మర్చిపోయారా?" కాస్త కటువుగా అన్నాడు.

ఎన్నడు లేనిది ఆ రోజు గోపాలరావు కొడుకు దగ్గర మాట్లాడలేకపోయాడు. మెల్లగా అన్నాడు "కుసుమకు నచ్చలేదట".

"అసలు నచ్చలేదు — నచ్చింది అనటానికి స్తోమత ఉందా కుసుమకు? అట్లా అనగానే మీరు ఎట్లా వూరుకున్నారు నాన్నా... కుసుమా ఇలా రా..." అని కేకేశాడు క్రోధంతో.

కుసుమ ఏమిటో అని గబగబ వచ్చింది.

"ఏం? రవీంద్ర నచ్చలేదన్నావట? అసలు నీ ఇష్టాన్ని ఎవరడిగారు? ఒద్దు అనటానికి కారణాలు ఆ రోజు మన కెవ్వరికి కనబడలేదు. ఈ రోజు ఎలా అనగల్గుతున్నారు?"

"ఏం లేదు. మరికాస్త మంచి సంబంధం తెద్దామని" తండ్రి మెల్లగా అన్నాడు.

కుసుమ తల వంచుకుంది.

"ఐదేళ్ళనుండి మరికాస్త మంచి సంబంధం తేలేకపోయాము. ఇకమీదట తేగలమా? ఇప్పుడే రాసేద్దాం వస్తున్నామని. మనమిద్దరం వెళ్ళి ముహూర్తం పెట్టించుకుని వద్దాం. ఒక్క పెళ్ళితో మన ఖర్చులు పూర్తికావు. ప్రతి పండక్కి, ప్రతి పురిటికి ఉంటాయి ఖర్చులు."

మాధవ్ వెళ్ళి కాగితం కలం తెచ్చి తండ్రి చేతికిచ్చాడు. ఈలోపల ఏం సైగ చేసుకున్నారో గాని — గోపాలరావు ఉత్తరం ప్రారంభించబోతుంటే కుసుమ అంది "నాకు నిజంగానే ఇష్టంలేదు" ఆమె కంఠంలోని నిరసన, మొండితనంకు మాధవ్ నిర్ఘాంతపోయాడు. కుసుమ నోట అటువంటి మాట విన్నాడంటే దానికి మద్దతు ఉండాలి. ఎవరిచ్చారు?

"నాన్నా — ఏమిటిది?" కాస్త తేరుకుని అడిగాను.

కలాన్ని ప్రక్కనబెట్టి కొడుకువేపు వేడికోలుగ చూచాడు "కుసుమకు ఇష్టంలేదు" అన్నాడు మెల్లగా.

మాధవ్‌కు కోపం వచ్చింది. అమల మాటల్లోని నిగూఢార్థం తెలుస్తోంది. ఆతడి హృదయం ఈ నిర్ణయాన్ని సహించలేకపోయింది. నిస్సత్తువతో కూర్చుండిపోయాడు.

"ఈ ఇంట్లో ఇష్టాయిష్టాలకు ప్రాధాన్యత ఇవ్వలేదు. నాకు జ్ఞానం వచ్చినప్పటినుండి ఇచ్చింది పుచ్చుకున్నాం — ఒద్దన్నదాన్ని విడిచిపెట్టాం. కావాలనుకున్నదాన్ని పొందలేకపోయాం. ఇప్పుడు మీరు కుసుమకు నచ్చచెప్పకుండా ఆమె అసమ్మతిని తెలియజేస్తుంటే సరే — అంటున్నారు. ఎవరు మాత్రం ఇష్టమైన పెళ్ళి చేసుకుంటున్నారు?... మీ ఇష్టం... కాని తొందరపడి వాళ్ళకు రాసెయ్యకండి. నేను అమ్ముడుపోతున్నది ఎందుకో నువ్వు అర్థం చేసుకునివుంటే ఈ తెగింపు నీలో వచ్చేది కాదు" మాధవ్ అక్కడి నుండి తల్లి దగ్గరకు వెళ్ళాడు ఆమెకు చెప్పి తండ్రిని, కుసుమని ఒప్పించేలా చేయటానికి. కాని ఆమె కూడా ప్రబతిమాలుతున్నదాన్లా అంది "మరీ — టెలిఫోన్ ఆపరేటరా? అని బాధ పడ్తోంది మాధవ్...?"

ఆ సంభాషణ ఇక వినలేక పోయాడు. చివ్వున లేచి వచ్చేశాడు. క్రితం సాయంత్రపు సంభాషణలో వ్యంగ్యం— ఎకసెక్కెం— చులకనా భావం— అగౌరవం— అమలను— చక్కనమ్మ అనటం—డబ్బు తమ స్వంతం అన్నట్లు కోరికలు కోరటం— వీళ్ళు సరే అనటం... అదంతా ఇప్పుడు విముఖత కల్గిస్తోంది. ఆ సంభాషణను ఆలకించి సంతృప్తి జెంది తన త్యాగం సరియైనదే అనుకున్నాడు. స్నానం చేసి వచ్చాడు. మనసు కాస్త ప్రశాంతమైంది. తను అంత త్వరగా వీళ్ళను అంచనా వేయకూడదు. కాస్త మంచి ఉద్యోగస్తుణ్ణి భర్తగా పొందాలని ఎవరికుండదు! ప్రశాంతచిత్తుడై తల్లి దగ్గరకు వచ్చాడు.

"అమ్మా ఎనిమిదిగంటలకంతా వెళ్ళిపోవాలి ఈ రోజు. ఏది తయారుగా ఉంటే అదే పెట్టు— అరగంటకంతా వస్తాను" లాల్చి పైజామా వేసుకుని బైటకెళ్ళిపోయాడు.

"హమ్మయ్య" అనుకున్నారు ముగ్గురు. ఏదో అట్లా అన్నాడేగాని తరువాత అన్నిటికి బుర్ర ఊపుతాడు— అనుకుని సంతోషించారు.

మాధవ్ తిన్నగా ప్రక్కవీధిలో ఉండే హోటల్ కెళ్ళాడు. అక్కడ పబ్లిక్ ఫోన్ బూత్ ఉంది. అమల ఇంటికి ఫోన్ చేశాడు.

నౌకర్ అందుకున్నాడు. మాధవ్ పేరు వినగానే "అయ్యగార్కి చెబుతాను. ఆగండయ్యా" అన్నాడు.

ఐదు నిమిషాలకంతా అమల తండ్రి రాజేంద్ర

ప్రసాద్ ఫోన్ అందుకున్నారు "రాజేంద్రప్రసాద్‌ను మాట్లాడుతున్నాను."

"నేనండి— మాధవ్‌ను."

"ఓ... మాధవ్... కులాసానా ?"

"కులాసాగానే ఉన్నానండి. ఈ వారంలో కొంత డబ్బు ఇస్తామన్నారుట...దాని విషయం..."

"ఔనౌను... ఎప్పుడన్నా రావచ్చు... సిద్ధంగా ఉంచాను."

"ఎంత ఇవ్వాలనుకున్నారు ? ఇట్లా అడుగుతున్నందుకు అన్యధా..."

"నో... నో... నేను ఎంత ఇవ్వాలనుకున్నానో గాని— మీ నాన్నగారు డెబ్భై ఐదువేలు అడిగారు... ప్రస్తుతం..." మాధవ్ అవాక్కయిపోయాడు.

"మాధవ్... ఉన్నావా ?" ఆయన ఆత్రంగా అడిగాడు.

"ఉన్నానండీ"

"ఏం... ఇంకొంచెం ఎక్కువ కావాలా ? ఒకటి చెయ్యనా"

"థాంక్స్... ఒద్దండీ... సరే... వినండి... మీరు పెద్దలు. అయినా నాకు ఒక వాగ్దానం చెయ్యాలి."

"అది ఏమిటో — అంత ఇదిగా మాట ఇవ్వలేను."

"చాల చిన్న విషయం. ఈ వాగ్దానం చెయ్యటం ద్వారా మీరు ఏ నియమాలను తప్పరు. మీరు ఇచ్చే డబ్బు... ఒక్క రూపాయి కూడ ఎవ్వరికి ఇవ్వకూడదు. ఏది ఇచ్చినా నాకే ఇవ్వాలి. ఒప్పుకుంటారా ?" మాధవ్ ఆవేశంగా మాట్లాడుతున్నాడు.

"ఎందుకు ? ఏమైంది?" ఆత్రంగా అడిగాడు

"ఏమీ కాలేదు. మా ఇల్లు రిపేర్ చేయించాలి కదా ? రిపేర్ అవుతున్నకొద్ది డబ్బు తీసుకుంటాను."

రాజేంద్రప్రసాద్ పెదిమల్లో సన్నటి వక్రమైన నవ్వు చోటు చేసుకుంది... "కుర్రాడు తెలివిగలవాడే... రిపేర్ అయ్యేకొలది డబ్బు తీసుకుంటాడట! తండ్రికి మించినవాడుగా ఉన్నాడు... చూద్దాం... అదెంత అవుతుందో"

"అలాగే. మాట ఇస్తున్నాను... కాని ఆ రిపేర్‌కు ఎంత డబ్బు తయారుగా ఉంచమంటావ్ ? ఇంట్లో అంత డబ్బు ఉంచను. బేంక్‌లోంచి తియ్యాలి" అన్నాడు — ఈ దెబ్బతో మాధవ్ వ్యక్తిత్వాన్ని అంచనా వేయవచ్చు.

"మేస్త్రీని పిలిపించి అడగాలి. ఎంత లేదన్నా



పది పదిహేను వేలు కావచ్చు. రెండు మూడు వేలు అటూ ఇటూ ఉంచండి.''

తను సరిగానే విన్నాడా ? ''ఎంత ?'' వినబడనట్లు అడిగాడు ప్రసాద్.

''ఇరవై ఉంచండి. కాని ప్రస్తుతం పదిహేను తీసుకుంటాను.''

రాజేంద్రప్రసాద్ ముఖం గంభీరమైంది. ఇంతవరకు ఏ విషయంలో జోక్యం కల్పించుకోని మాధవ్ — డబ్బు విషయం వచ్చేసరికి అంతా నాన్న చూసుకుంటారు — అనే మాధవ్ ఇట్లా మాట్లాడుతున్నాడంటే అది ఎంతో ప్రోత్సాహకరంగా ఉంది.

''మాధవ్ అంత చాలా ?'' మెల్లగా అడిగాడు.

''చాలునండి. రేపు సాయంత్రం వచ్చినప్పుడు తీసుకుంటాను'' అని నాలుక కరచుకున్నాడు.

ఆయన అలాగే అన్నాడు.

నమస్కారం అని ఫోన్ పెట్టేశాడు. అప్రయత్నంగా ఆతడి పెదిమల్లోంచి సన్నటి ఈల వినబడింది. కాని ఒక్కసారి ఏదో భయంకరమైన సందేహం ఆతడి గుండెల్లో బరువుగా దిగబడిపోయింది.

తను తన తండ్రిని మలకన చేశాడా ?

తన త్యాగాన్ని వాళ్ళు దుర్వినియోగం చేస్తారేమో అన్న అనుమానంతో తను ఇట్లా ప్రవర్తిస్తున్నాడా ? లేక ఎక్కడో తన స్వార్థం ఉన్నదా ?

లేదు — అమల అడిగినప్పుడు తెల్లమొహం వేశాడు. ఎంత డబ్బు తన తండ్రి తీసుకుంటున్నది తనకు తెలియదా ! ఎంత సిగ్గుచేటు !

ఇంటికెళ్ళి గబగబ భోంచేసి ఆఫీస్‌కు వెళ్ళిపోయాడు. ఎవరితోనైన మాట్లాడాలనిపించింది. రాజు మరోచోట ఉంటాడు. సాయంత్రం ఐదు గంటలవరకు ఎలాగో గడిపి సాయంత్రం ఇల్లు చేరాడు. తను మామూలుగా ఉన్నట్లు పండ్లు కొనుక్కొని వెళ్ళాడు. కొడుకు సరదాగా ఉండటం గమనించి ఆ తలిదండ్రులు మనసులో పొంగిపోయారు.

కాని ఆ రాత్రి తండ్రిని మళ్ళీ హెచ్చరించాడు. ''రవీంద్ర సంబంధం ఒదులుకోవద్దండి'' అని. రాజును కలుసుకుని చాలసేపు చర్చించాడు. మరుసటి రోజు సాయంత్రం ఆలస్యంగా వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు.

రోజ్‌విల్లా చేరేసరికి ఆరుంబావు అయింది. ఈసారి ఆమెవచ్చి ఆతణ్ణి లోపలికి తీసుకుని వెళ్ళలేదు. మరో గదిలోంచి గులాబి తోటలోకి తీసుకుని వెళ్ళింది లక్ష్మి.

''అయ్యా ఇక్కడ కూర్చోమన్నారు'' అని గార్డెన్ చెయిర్స్ చూపించింది. నక్షత్రాకారంలో ఉన్న చిన్న లాన్ అది. చుట్టూ గులాబి మొక్కలు. కాలం కానందువల్ల కొన్ని పూవులు మాత్రమే ఉన్నాయి. ప్రక్కగా చిన్న ఎర్రటి మండపం దాన్ని అల్లుకుపోయిన లతలు స్వాప్నిక జగత్తులోనికి లాక్కుపోతున్నాయి. తనను లక్ష్మి గ్లాసునిండా బాదం ఖీర్ తెచ్చిపెట్టింది ''అయ్యా తీసుకోండి. అమ్మగారు వస్తారు'' లక్ష్మి వెళ్ళిపోయింది. ఒక సిప్ తీసుకుని ఆ సుందర మండపాన్ని చూస్తున్నాడు. ఎక్కడనుంచో మంద్ర స్వరంలో శ్రావ్యమైన రాగా

## తొణకని స్వప్నం

లాపన వినబడింది. ఎక్కడో ... దూరాన ... అతి దూరాన వినబడినట్లుగా ఉంది. కాస్త దగ్గరగా వినవస్తే బావుండుననుకున్నాడు. సితారు వాయిద్యం శబ్ద తరంగాలతో మేళవించి చక్కగా పాడుతున్నారు. అతి సమీపంగా వచ్చినట్లు ధ్వనించింది పాట ... అదొక చక్కటి భావగీతం ...

కలహంశీ స్వరధునిలో
మలయా నిల మధురిమలో ...

ఆ మలయ మారుతంలో— ఆ మధురమైన ఎనసీమలో — ఆ కోయిల పాటలో... జలజల పారే సెలయేటి నీటి సవ్వడిలో ఆతడి హృదయం రంజిల్లింది. పాట పూర్తయి పోయింది.

అప్పటికిగాని అతడికి స్ఫురించలేదు. లోపల గదుల్లో ఎవరో టేప్‌రికార్డర్ పెట్టుకున్నారు.

### వృద్ధులకు పత్రికలు !

జపానులో ప్రజలకు పత్రికల పట్ల ఆసక్తి ఎక్కువ. ఒక రకంగా చెప్పాలంటే, పత్రికా పఠనం జపాను ప్రజల హాబీ అని చెప్పవచ్చు. అందులో వృద్ధులకు విశ్రాంతి సమయం ఎక్కువగా లభిస్తుంది కనుక, వారికి ఆసక్తి కూడా ఎక్కువగా ఉంటుంది. పైగా జపాన్ దేశంలో వృద్ధుల సంఖ్య నానాటికి పెరిగిపోతోంది. అందువలన జపాను దేశంలో వృద్ధులకోసం ప్రత్యేక పత్రికలను ప్రచురించటం ప్రారంభించారు. వీటిని జుకునెన్ మాగజైన్స్ అని అంటారు. సాధారణంగా 45 సంవత్సరాల వయస్సు వచ్చిన వారిలో విజ్ఞాన తృష్ణ ఎక్కువగా ఉంటుందని ఒక పత్రికా సంపాదకుడు తెలియచేస్తూ, ''వీరిలో ఆధ్యాత్మికదాహం ఎక్కువ.'' అని అన్నారు. వీరు జీవితం పట్ల కొత్త దృక్పథంతో ప్రశ్నించుకుంటారు. ఆ ప్రశ్నలకు సమాధానాలను లేక క్లూలను ఈ పత్రికలు అందచేయగలవని ఆయన అన్నారు.

కొంతసేపటికి అమల వచ్చింది. పళ్ళెంలో గారెలు తెచ్చి బల్లమీద పెట్టింది.

''మీకు పాట వినబడిందా ? సారి ... పనిమీద ఉన్నాను. వెంటనే రాలేకపోయాను.''

''ఫరవాలేదు. ఇది త్రాగుతూ పాట వింటూ ఉంటే మనసు హాయిగా అలా అలా తేలిపోయింది — ఒక మధురమైన స్వాప్నిక జగత్తులోనికి తీసుకుని వెళ్ళింది. ఎప్పుడైన పూర్తి టేప్ వినాలి — వినిపిస్తారా ?''

''అలాగే... కాని టేప్ కాదు. నేను పాడాను.''

''అది మీ పాటనా ?'' ఆశ్చర్యంతో అడిగాడు.

''ఔను. వాయిద్య సంగీతం మాత్రం టేప్ చేసి ఉంచాను. నిన్న పాడమని అడిగారుగా'' అంది.

ఆతడు కళ్ళు మూసుకుని ఆ గానమాధుర్యాన్ని అనుభవిస్తున్నట్లు తల మెల్లగా ఆడించాడు.

''థాంక్స్... చాల బాగా పాడారు... ఎక్కడైన ప్రోగ్రాం ఇచ్చారా ?''

''రేడియోలో అప్పుడప్పుడు. అంతేగాని ప్రోగ్రాం అంటూ ఏమీ ఇవ్వలేదు. ఇంట్లో ఏదైన ఫంక్షన్ జరిగితే పాడుతుంటాను. నాన్నగారు వాయిద్య బృందాన్ని పిలిపిస్తారు'' అంది. ''తీసుకోండి'' అని పళ్ళెంముందరికి త్రోసింది.

మాధవ్ గారె తీసుకుని ''మీరు కూడ తీసుకోండి''

''ఇందాకనే తీసుకున్నాను...మీరు నేను కోరినట్లు ఆలోచించారా ?'' ఆమె సీరియస్‌గా ప్రశ్నించింది.

మాధవ్ నవ్వాడు ''ఇన్ని రోజులు ఆలోచించటం మానేశాను. తటస్తంగా ఉండిపోయాను. చివరికి ఆలోచించటం ప్రారంభించిన తరువాత ఆ ఆలోచనల్ని అరికట్టలేకపోతున్నాను. ఒక్క అంశం మీద ఆలోచించి తగిన చర్య తీసుకోటానికి ఈ రెండు రోజులు పట్టాయి.''

''చాల థాంక్స్ మీకు ... ఇంతకు ఇంటి విషయం ఏం చేశారు ?''

మాధవ్ మాట్లాడలేదు. ఆ విషయం దాకా తను రాలేదు. ఆ మాట చెప్పాలనుకున్నాడు — కాని ఆమె అంది... ''చూచారా ? ఒక చిన్న ఈక్వేషన్ ఇచ్చాను. దానిని మీరు విడమర్చి చెప్పాలి'' అందామె,

''మిమ్మల్ని సున్నాగా ఉంచటం నాకూడా ఇష్టంలేదు మీరు ఒక్కటి గ్రహించాలి. ఉన్నట్లుండి నేను ఇంత శ్రద్ధ తీసుకుంటే మావాళ్ళు అపార్థం చేసుకుంటారు ? అందుకే టైం కావాలి''

ఆమె నవ్వింది. మూతికి కొంగు అడ్డం పెట్టుకుంది. తన కోరపన్ను నవ్వినప్పుడు బైటికొచ్చి అసహ్యంగా ఉంటుందని అట్లా అడ్డం పెట్టుకుంది.

''మామూలు భాషలో చెప్పాలంటే 'ఆ మాన్యుగారు ఆ పిల్ల మందు పెట్టి మా అబ్బాయిని వాళ్ళవైపుకు త్రిప్పేసుకున్నారు —' అని.

''ఔను. చాల జాగ్రత్తగా మసలాలి. ఎవరికెంత స్వార్థం ఉందో మెల్లగా తెలుసుకుంటాను.''

''స్వార్థం అందరికి ఉంటుంది. మీ ఒక్కరిలో ఇంతవరకు లేదు... కాని స్వార్థం హద్దుమీర కూడదు'' అంది అమల.

''మీ నాన్నగార్కి చెప్పాను — డబ్బు నా చేతికే ఇవ్వాలని.''

''ఐతే — మొట్టమొదటి అడుగు తెగించి వేశారన్న మాట. ఆ తరువాత అడుగులు సునాయాసంగ పడిపోతాయి. మిమ్మల్ని అభినందిస్తున్నాను.''

''థాంక్స్... నిన్న అన్నారు ముఖ్యమైన విషయం మాట్లాడాలని !''

''నాన్నగారితో మీ నాన్నగారు అన్నారట డబ్బు తనదగ్గరే ఉంచుకుంటారట. మీకే డబ్బు గొడవలు తెలీవట. డబ్బును జాగ్రత్తగా ఎలా వాడుకోవాలో కూడ తెలీదట. నిజంగా మీ నాన్నగారి ఆర్థిక ఇబ్బందులు మీకు తెలియవా ?''

''తెలుసును. మేము ఉంటున్న ఇల్లు తాకట్టులో ఉంది. మా పెద్ద చెల్లి కుసుమ పెళ్ళి చేయాలి. సాధారణ కుటుంబాలలో ఉండే ఆర్థిక సమస్యలు మీకు తెలియకపోవచ్చును. ఎన్నో చిల్లర







అప్పలుంటాయి. అంతేకాదు ఈ ఉద్యోగం కోసం నేను దాదాపు పదివేలు అప్పు జేశాను. నా ఫ్రెండ్ రాజు ఇచ్చాడు. ప్రతి నెల రెండొందల చొప్పున తీర్చాలి.''

''అదేలెండి ఈ పెళ్ళి మీ ఇష్టప్రకారం జరగటంలేదు. కాబట్టి— కోపంతో లేక నిస్పృహతో అని ఉంటారు. నాకీ డబ్బు విషయాలేం చెప్పకండి. ఏమన్నా చేసుకోండి – మీ ఇష్టం – అని'' అంది మెల్లగా.

''ఔను. ఆ రోజుల్లో అట్లాగే అన్నాను. కాని మనసు మార్చుకున్నాను. కనీసం నేను ఎంతకు అమ్ముడుపోతున్నానోకూడ నాకు...''

''ప్లీజ్— అట్లా మాట్లాడకండి'' అంది బాధగా.

''అంతేకదా—'' అన్నాడు విసురుగ.

ఆమె మాట్లాడలేదు.

''సారి... అట్లా అనను... సరే...చెప్పండి... ఆ డబ్బు నేను తీసుకుని అవసరమనుకున్నదానికి వాడి మిగిలింది మనకోసం ఉంచుకోవాలి. అంతేకదూ?''

''ఔను. ఈ పెళ్ళి ఎంత ఇష్టంలేకపోయినా మీరు ముఖ్యపాత్ర వహిస్తే మంచిది. వాళ్ళంతా ఎంత సొంతమైనా మూడో పార్టీయేకదా ?''

''ఔను... ఒకనాడు మిగిలినది కూర్చుకుందాం అంటే ఏమీ మిగలకపోవచ్చును... ఇంకా ఏమైనా చెప్పాలా ?''

''మిమ్మల్ని చూస్తే నాకు చాలా జాలిగా వుంది. ప్రతి ఒక్కరు మిమ్మల్ని తోలుబొమ్మలా ఆడించటం చూస్తుంటే— ఈ పరిస్థితి నుండి మిమ్మల్ని తప్పించటానికి రెండు మార్గాలున్నాయి... చెప్పమంటారా ?''

''చెప్పండి'' అంత ఉత్సాహం కనబర్చలేదు.

''ఒకటి... చాల రోజులుగా ఆలోచించాను. నాకు మరొకరి సహాయం కావలసి వచ్చింది. అన్నయ్యకు రాశాను. అర్థం చేసుకున్నాడు చదవండి. ఇది ఆమె ఒక తెరిచిన కవర్ అందించింది.

మాధవ్ దాన్ని అందుకుని అడ్రస్ చూచాడు. అమల పేరు ఉంది. తాపీగా అందులోని కాగితాన్ని తీసి చదవటం ప్రారంభించాడు. ఆతడి ముఖంలో మారే రంగుల్ని అతి జాగ్రత్తతో గమనిస్తోంది అమల.

మాధవ్‌ది ఎంత సుందరమైన రూపం...! ఆతడి పెదిమలు అదురుతున్నాయి! ముఖంలో క్రోధం తాలూకు ఎర్రదనం పరచుకుంటోంది. ఎద త్వరితగతిని లేచి పడుతోంది. అతడు చదవటం పూర్తయింది. ఆ ఉత్తరాన్ని కసిదీరా నలిపి అమల వైపు విసిరికొడ్తూ— కోపంతో అన్నాడు.

''అమలా— ఏమిటిది! నీ లెక్కలబుర్ర అఖండమైనదనుకున్నాను. ఇలాంటి సలహా ఇవ్వటానికి నీకెంత ధైర్యం ? ఆజన్మాంతరం నీ అప్పు తీరుస్తూ కూర్చోమంటావా ? అమ్మా నాన్నలకు తెలియకుండా మీ అన్న నాకు డబ్బు ఇస్తాడా ? ఆ డబ్బుతో నేను అప్పులు సప్పులు తీర్చి ఎవరినైన పెళ్ళాడి చచ్చేదాక కొద్దికొద్దిగా డబ్బు మీ అన్నయ్యకు పంపుతుండాలా ! ఆహా... ఆమోఘమయిన మార్గం... కంగ్రాట్స్...నీ అతితెలివికి...'' వేళాకోళంగా అన్నాడు.

అమల ప్రప్రథమంలో విస్తుపోయింది. ఆ తరువాత అతని ఏకవచన ప్రయోగం మొదటిసారిగా ఆమెలో అణగారి వున్న ప్రేమ జ్యోతిని దేదీప్యమానంగా వెలిగించింది. ఆమె హృదయం ఆనంద తరంగాలపై ఓ ల లా డిం ది. ఆమె బాగా తల వంచుకున్నది. తన హృదయంలోంచి పొంగి పొరుతున్న ప్రేమను అతడు గ్రహిస్తాడేమోనన్న భయంతో తల బాగా వాల్చుకున్నది. తన జీవితంలో రాదు – అనుకున్న వసంతం విచ్చుకుంది. తన తెలివిని ఖండిస్తూ—వ్యంగ్యంగా అభినందించటం ప్రోత్సాహంగా ఉంది – ప్రోత్సాహకరంగాను ఉంది.

అతడు సిగ్గుపడ్డాడు ... ''సారి ... కోపంవచ్చి రెచ్చిపోయి మాట్లాడాను ... '' అన్నాడు మెల్లగా.

అమల మాట్లాడలేదు.



''రెండోది చెప్పండి'' సవాలు చేసినట్లు అడిగాడు.

''మీకు కోపం వస్తుంది'' అంది.

''ఫరవాలేదులెండి. అది ఇంకెంత బ్రిలియంట్ ఐడియానో చూస్తాను ... ''

అమల ప్రారంభించింది. మనసు ఎంతో ఉల్లాసంగా ఉంది.

''మీరు ముచ్చటైన ఇల్లు కొనుక్కోండి. దాన్ని అనుకూలంగా ఉండే చక్కటి ఫర్నిచర్‌తో నింపండి. మీ చెల్లికి పెళ్ళి చేయండి. మీ ఇల్లు తాకట్టునుండి విడిపించండి. రిపేర్ చేయించండి. తమ్ముడిని ఏదైన ఉద్యోగంలో ప్రవేశపెట్టండి. తలిదండ్రులకు నెలనెల కొంత పంపుతూ ఉండండి. డబ్బుంటే జీవితంలో ఎన్నో సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కోవచ్చు'' ఆమె ఇంకా ఏమైన చెబుతుందేమోనని ఆత్రంగా చూశాడు. కాని అమల వంచిన తల ఎత్తలేదు.

బహుశా చిన్నప్పటినుండి అది ఆమె బలహీనత కాబోలు – తన ముఖం పూర్తిగా కనబడకూడదని అలా వంచుకుంటుందేమో. ధైర్యంగా తలెత్తి కళ్ళలోకి సూటిగ చూచి మాట్లాడదేం ?

''మరి అన్నీ చెప్పావు ... మరి నీ మాట ... నీవు ఎక్కడుంటావు. ఈ ప్లాన్‌లో నీ పాత్ర !''

''నేను ఇక్కడే ఉంటాను. మీరు ఇలాగే అప్పుడప్పుడు వచ్చి వెళ్తూ వుండండి. మీకు కష్టం కలక్కుండా నా మూడు ప్రక్రియల నడుమకాలం వెళ్ళబుచ్చుతాను. ఈ విధంగా మీ వాళ్ళ సమస్యలు తీరతాయి – మా వాళ్ళ బాధ్యత ఒదిలిపోతుంది...''

''మరి నేను ... చెప్ప ... అమలా ... నేను'' అన్నాడు రౌద్రంతో.

''ఇంతకన్నా మీకు నేను ఏ విధంగాను సహాయం చేయలేను. మిమ్మల్ని బంధించి ఉంచటం నాకిష్టం లేదు.''

మాధవ్ కుర్చీలో వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు. ఆలోచించాడు.

ఈ మార్గం కాస్త బాగున్నట్లు తోచింది.

ఆతడి హృదయం ప్రశాంతమైంది. పావుగంట ఎవ్వరు మాట్లాడలేదు.

(ఇంకా వుంది)

# జెనెటిక్ ఇంజనీరింగ్ వివాదస్పదమైనదా?

డాక్టర్ సమ్మనూరు రమేష్‌బాబు

"జీన్" లేదా జన్యువుకు సంబంధించిన సాంకేతిక విజ్ఞాన శాస్త్ర విభాగాన్ని "జెనెటిక్ ఇంజనీరింగ్"గా గుర్తిస్తారు. కేవలం ఏడు సంవత్సరాలుగా ప్రాణం పోసుకుంటున్న ఈ విజ్ఞానం, అప్పుడే పదిమంది విమర్శలకు మూలంగా నిలబడడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. దీనికి కారణాలనేవి లేకపోలేదు. ఈ "జెనెటిక్ మ్యానిపులేషన్" ద్వారా "లేసర్", "గామా" యిత్యాది కిరణాయుధాలు సృష్టించలేనంత భీభత్సాన్ని సృష్టించ వచ్చు. మానవ క్షేమాన్ని పది కాలాలపాటు సుస్థిరంగా పదిలపరచేందుకు దోహదం చేసే సస్యవిప్లవాన్ని కూడ సృష్టించ వచ్చు. దేన్ని సృష్టించాలన్నా మానవుని అభిమతం కావలె. శాస్త్రమనేది ముతక పదార్థం వంటిది. దాన్ని విశ్లేషించే మనిషి తీరు తెన్నులపైనే మంచి కానీ; చెడు కాని ఆధారపడి ఉంటుంది. అటువంటి పరిస్థితుల్లో "జెనెటిక్ ఇంజనీరింగ్" వివాదాస్పదమైందని చెప్పడం అర్థ రహితం. ఈ మాటకొస్తే వీర్యనిధులు, నాళికా శిశువులు, మేధావుల ("నోబెల్" బహుమతి గ్రహీతలన్నమాట. "నోబెల్" బహుమతి వచ్చినవాడే మేధావని భావించే శాస్త్రజ్ఞానం వాస్తవదృక్పథంలో ఏ పాటిదో అందరికీ తెలిసినదే!) దానం బిడ్డలు — ఇలాంటివన్నీ వివాదాలతో ప్రారంభమయ్యాయి. అయితే వీటి వల్ల ఏ విధమైన పరిణామం రాబోతుదన్నది వేచి చూడాల్సిన విషయం. సంస్కారానికి, తెలివికి యిదీ కారణమని యింతవరకూ యిది మిత్థంగా చెప్ప లేకున్నారు. జన్య ప్రభావం వీటిపై ఉంటుందని భావించడంలో సందేహం లేదు. ఎందుకంటే జన్య పదార్థమైన డి. యన్. ఏ. అనువంశిక లక్షణాన్ని తరతరాలకూ అందజేస్తూ ఉంటుంది. ఈ పదార్థాన్ని తగిన విధంగా మార్పిడి చేస్తే (ప్రయోగాత్మకంగా) ఆ మార్పిడీ ప్రభావం తరువాత తరాలకు అందజేయబడుతుంది. ఈ మార్పు మానవ క్షేమప్రదమైనదే అయి ఉండాలి. లేదా యిలాంటి ప్రక్రియవల్లే రాక్షస ప్రవృత్తిని కూడ ప్రవేశపెట్టవచ్చు. అటువంటప్పుడు అది మానవ వినాశకారిగా జాతి భవిష్యత్తును మంటగలుపుతుంది. అందువల్లే "జెనెటిక్ ఇంజనీరింగ్" అంటే చాలమంది భయాందోళనలను వెలిబుచ్చినారు. మానవుని మనోప్రవృత్తి అతి సులభంగా చెడువైపుకు తిరుగుతుందని, పైగా నేటి పరిస్థితులన్నీ అలాంటి ప్రవృత్తినే ప్రేరేపించే విధంగా ఉన్నాయని మానసిక శాస్త్రవేత్తలు అభిప్రాయ పడుతున్నారు. అయితే ఈ అభిప్రాయం అన్ని వేళలా సరికాదు. "జెనెటిక్ ఇంజనీరింగ్" వల్ల అద్భుతమైన మానవాభ్యుదయాన్ని సాధించ వచ్చు. ఇది తిరుగులేని మాట!

మానవ ప్రగతి ముఖ్యంగా నాలుగు రంగాలపై ఆధారపడి ఉంటుంది. అవి వ్యవసాయ రంగం, వైద్య రంగం, పరిసర పారిశుధ్య రంగం, శక్తి వనరుల రంగం. ఈ నాలుగు రంగాలకూ నిధులను అందజేయ వలసిన అవసరం ఏ ప్రభుత్వానికైనా ఉన్నది. ఆహారపరంగా, ఇంధనపరంగా 1996 క్రీ. శ. నాటికి పదిరెట్లు తిరుగురాబడిని "జెనెటిక్ ఇంజనీరింగ్" సాధించగలుగుతుందని అంచనా. వైద్యపరంగా "జెనెటిక్ ఇంజనీరింగ్" ఆశించిన మేరకు నిలువలేకపోతున్నది. దీనికి "జెనెటిక్ ఇంజనీరింగ్" అంటే రూపొందిన వివాదాస్పదమైన భావన ఒక కారణం కావచ్చును. వ్యావసాయికంగా "జెనెటిక్ ఇంజనీరింగ్" పరంగా అభివృద్ధిని సాధించడానికై జపాన్‌లో సాలుకి మూటాయాభై "మిలియన్"ల "డాలర్"లను వినియోగిస్తున్నారు. (జపాన్ అతి తక్కువ కాలంలో, సాంకేతికంగా గణనీయమైన స్థాయికి చేరుకొన్న దేశం!) యునైటెడ్ స్టేట్స్, జపాన్ ఖర్చులో మూడవ వంతు మాత్రమే వ్యావసాయిక జన్య సాంకేతిక శాస్త్ర పరిశోధనలకు అందజేస్తున్నది.

ఇటీవల యునైటెడ్ స్టేట్స్‌లో "జెనెటిక్ ఇంజనీరింగ్— వ్యవసాయ సంబంధ పరిశీలనలు" పేరిట ఒక "కాన్ఫరెన్స్" జరిగినది. ఆ సదస్సులో 19 దేశాలకు చెందిన ఆరువందల మంది శాస్త్రజ్ఞులు పాల్గొనినారు. "అగ్రికల్చరల్ రీసర్చ్ సర్వీస్" వారి ద్వారా ఏర్పరచబడిని ఈ సమావేశంలో వ్యవసాయ రంగానికి సంబంధించి "జెనెటిక్ ఇంజనీరింగ్" ద్వారా ఎట్టి ప్రయోజనాలను పొంద వచ్చునన్న విషయం కూలంకషంగా చర్చించబడినది. "రీ కాంబినెంట్" డి. యన్. ఏ. ను గురించి ("రీ కాంబినేషన్" జరగడానికి అవకాశమున్న జన్యుభాగాన్ని "రెకాన్" అనిపిలుస్తారు. డి.యన్.ఏ. లోని చక్కెర, ఫాస్ఫేట్ అణువులు యాదృచ్ఛికంగా విడిపోయి, మళ్లీ ఎటుపడితే అటు గజిబిజిగా నిర్దుష్టమైన పొంతన లేకుండా కలుస్తాయి. ఇలా కలయటాన్ని "రీ కాంబినేషన్" అని పిలువవచ్చు!) సవిస్తరమైన చర్చ జరిగింది. జంతువుల్లో, మొక్కల్లో ప్రయోగించే "జెనెటిక్ మ్యానిపులేషన్"

## భారతీయత

1. "లోకకళ్యాణకరముగ లోక హితము, కూర్పనెంచి మహర్షులు కూర్మి మిగుల।
తపసులన్ త్యాగముల లోకతత్వమరసి, విశ్వశాంతిని సాధించి వెలసి రౌర॥"

2. "భారతామ్నాయ మందలి భవ్యధర్మ, సరణిచే జీవలోకము జయముగొనదె?
జాతకర్మాది సంస్కార చయముచేత, లోక మారోగ్య భాగ్యము లొందకున్నె॥"

2. "మానవాళి సుఖంబుల బడయుటకును, సులభ మార్గము వ్యాసుడు సూపియుండె।
అట్టి మార్గము నెవ్వడు పట్టినడచు, "భారతీయుడ"టంచును వాసిగాంచు॥"

4. "చెడ్డలెయ్యవి తనయెడ చేయనొరులు, తనదు మనసది విరుగుచు తాపమొందు।
అట్టి పనులను సేయకు మన్యులయెడ, సర్వులకు కష్టసుఖములు సమము కాదె॥"

5. "ఆత్మ" అన "నేను" అనియెడి అర్థమగుట, అన్ని జీవుల లోపల "ఆత్మ" అలర
భేదమెట్లగు తన పర భేదమనగ, ఎవ్వడేనియు "తన" నేవగించు కొనునె॥"
"మన్మందిర మేం ప్రీతి బసాటే, ఓ భారత! ఓ భూలే భాలే"

6. "తనదు దేహమదెట్టులు తనకు ప్రీతి పాత్రమగు చుండునట్టులె పరుల దేహ
మాత్మ యుండుట "తా"నన "ఆత్మ"యగుట, ఇతరులను ఏవగించుట ఎందుకోయి"

7. "ప్రబల కాయము క్రోధము ప్రజలకెల్ల, నాశకరముల వంచునునైక గతుల
చాటవే శ్రుతులు స్మృతులును జగతికెపుడు, ఇహపరంబుల శత్రుల వెందుకోయి"

8. "ప్రబలమోహమునంబడి ప్రభను చెడిన, చక్రవర్తులు వయసున చావలేదె
కీచకుడు మోహఫలముగ 'కీచు' మనడె, "తా" అనన్ జీవితములకు "తొక్కు" కాదె॥"
"మన ఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః"

9. "తనదు మనసదె మర్యాద దాటినపుడు, తనకదే శత్రువై అరె! తపనపరచు
తనకు మిత్రము హద్దును దాటనపుడు, మనసులో హద్దుమీరక మసలుమోయి॥"

10. "పిల్లకాకికి ఉండేలు దెబ్బ యెట్లు, తెలియకుండును "తా" మజా తెలియదోయి
భారతీయత ప్రాణంబు బ్రహ్మచర్య, మనియ మనసున నమ్ముచు మనగదోయి."

— ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి

ప్రభావం— మొత్తం జంతు దేహంపై లేదా మొక్కపై ప్రయోగించినప్పుడు ఎలా వుంటుంది? కణాల పరిధిలో ప్రయోగించినప్పుడు ఎట్లా ఉంటుంది ? అణు పరిధిలో ప్రయోగించినప్పుడు ఏ విధంగా ఉంటుంది?— అనే విషయాన్ని గురించి ఈ సభలో ఒక స్పష్టమైన అభిప్రాయానికి రావటం జరిగింది. పది, ఇరవై సంవత్సరాల తరువాతనే "జెనెటిక్ ఇంజనీరింగ్" ద్వారా లభ్యమయ్యే ప్రయోజనాల ప్రసక్తి ఉంటుందట! ఆహారాభివృద్ధి (వృక్షసంబంధమైనా, జంతు సంబంధమైనా) "జెనెటిక్ ఇంజనీరింగ్" వినియోగానికి సమసంబంధ సామ్యంతో అనులోమానుపాతంగా ఉంటుంది. అంటే జన్యువులో కలుగజేసే మార్పిడియొక్క పరిణతిని బట్టి, దాని సునిశిత క్రమానుగతిని బట్టి— ఒక్క మాటలో జన్యు సాంకేతిక శాస్త్ర వినియోగ సామర్థ్యాన్ని బట్టి వ్యవసాయాభివృద్ధికాని, పాడిపరిశ్రమాభివృద్ధికాని, మాంసాభివృద్ధికాని, ఉన్ని పరిశ్రమాభివృద్ధికాని ఆధారపడి ఉంటుంది. క్రీ. శ. 1860 లో విపరీతమైన మనుష్యబలం ("మ్యాన్ పవర్") వల్ల మొట్టమొదటి హరిత విప్లవం లేదా సస్యవిప్లవం ఏర్పడింది. రెండవ పర్యాయం (క్రీ. శ. 1950, 1975ల మధ్యకాలం) ఎరువుల వాడకంవల్ల, క్రిమికీటక సంహారక పదార్థాల వాడకంవల్ల, నీటి పారుదలా సౌకర్యాలవల్ల, అధునాతనమైన "ఆర్టిఫిషియల్ ఇన్‌సెమినేషన్" ప్రక్రియలవల్ల, సంకరాల ఉత్పాదనలవల్ల — మళ్ళీ హరిత విప్లవం ఏర్పడింది. మూడవసారి (క్రీ. శ. 1975 నుంచి ఇప్పటివరకు జరిగిన కాలం) కేవలం "జెనెటిక్ ఇంజనీరింగ్" వల్లనే హరిత విప్లవం ఏర్పడినట్లుగా ( ? ) భావిస్తున్నారు. "జెనెటిక్ ఇంజనీరింగ్" శాస్త్ర వ్యవస్థను ఇతోధికంగా దోహదపరచేందుకు వీలుగా భారీ యెత్తున "అమైనో" ఆమ్లాలను, "వైటమిన్"లను, పెరుగుదల, అభివృద్ధికి సంబంధించిన "హార్మోన్"లను, "మెధనాల్" వంటి విషపదార్థాలను జీర్ణంచేసే "బ్యాక్టీరియమ్"లను, "ఆంటిబయోటిక్స్" లను తయారుచేస్తున్నారు. "జెనెటిక్ ఇంజనీరింగ్" మానవ వరప్రదాయిని అని చెప్పడానికి వీలుగా ఎన్నో మానవ హితైషి కార్యక్రమాలను చేపట్టినారు.

డి. యన్. ఏ. యొక్క చైతన్యాన్ని "జెనెటిక్ ఇంజనీరింగ్" "టెక్నిక్" వల్ల మార్పు చేయడం (ఎక్కువకాని, తక్కువకాని) బహు సులభసాధ్యమైపోయింది. జంతువృద్ధి కోసం వీలుగా "వైటమిన్"ల తయారీకి ముఖ్యంగా "బి కాంప్లెక్స్" ఉత్పత్తికి అవసరమయ్యే విధంగా జన్యువులో (డి. యన్. ఏలో) కోడాన్ (త్రిక్ సంకేతం)ల నత్రజని క్షారాలను మార్చివేస్తారు. అంటే "అమైనో" ఆమ్లాలు కావలసినవి ఏర్పడే విధంగా "కోడాన్"ను మార్పిడికి గురిచేస్తారు. "లైసీన్" 'మిథియోనైన్' వంటి "అమైనో" ఆమ్లాల సంశ్లేషణకై పాటుపడతారు. ఇలాగే పశుగ్రాసం బలవర్ధకంగా ఉండడానికి వీలుగా "ట్రిప్టోఫ్యాన్" అనబడే "అమైనో" ఆమ్లం రూపొందేటట్లు "జెనెటిక్ ఇంజనీరింగ్" చేయబడుతుంది. జీవరసాయనిక శాస్త్రగతమైన




అవగాహన "జెనెటిక్ ఇంజనీరింగ్"కు చాల ముఖ్యమని స్పష్టమౌతుంది. ఇకపోతే పెరుగుదల, అభివృద్ధికి ఉపయోగించే "హార్మోన్"ల తయారీలో "జెనెటిక్ ఇంజనీరింగ్" పాత్రను వివరిస్తాను. పెరుగుదలకు సంబంధించిన హార్మోన్ల సామర్థ్యాన్ని వివరించడాన్ని "జీనెక్స్" అంటారు. "బొవైన్" అనబడే "హార్మోన్"ను "జెనెటిక్ ఇంజనీరింగ్" ద్వారా ఏర్పడేటట్లు చేస్తే ఆవులలో దేహవృద్ధితో పాటు, క్షీరవృద్ధి కూడ పెంపొందడం గుర్తించబడింది. "పోర్సైన్" "హార్మోన్" ద్వారా పందులలో క్రొవ్వు పదార్థాలు ఎక్కువ చేయగలిగారు. "ఒవైన్" అనబడే "హార్మోన్" వల్ల ఉన్నిని ఎక్కువగా పొందగలిగినారు. జంతువుల దేహాభివృద్ధికి ఉపకరించే "హార్మోన్" లను ఎస్కరీచియాకోలై," 'బాసిలిస్ సబ్‌టైలస్" వంటి "బ్యాక్టీరియమ్"లను ఉపయోగించి "జెనెటిక్ ఇంజనీరింగ్" ప్రక్రియ ద్వారా రాబట్టగలిగినారు. ఎక్కువగా "బాసిలస్ సబ్‌టైలిస్" "బ్యాక్టీరియమ్"ను ఉపయోగిస్తున్నారు. "వ్యాక్సిన్"ల తయారీలో "జెనెటిక్ ఇంజనీరింగ్" ప్రముఖమైన పాత్రను నిర్వహించగలదని నేడెందరో శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ఇదెంత వరకు విజయాన్ని సాధించగలుగుతుందో కాలమే తీర్పు చెప్పాలి.

జంతుసంపద పైకన్నా వృక్షసంపద మీదే "జెనెటిక్ ఇంజనీరింగ్" ప్రక్రియను ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. జంతువులపై చూపినంత ప్రభావాన్ని, వెనువెంటనే, మొక్కలపై "జెనెటిక్ ఇంజనీరింగ్" చూపలేకపోయినా, కాలక్రమేణా గణనీయమైన సత్ఫలితాలను అందించగలదని శాస్త్ర నిపుణులు భావిస్తున్నారు.

మొక్క యొక్క పిండంలో "జిబ్బెరిల్లిక్ ఆసిడ్" అనబడే "హార్మోన్" స్రవించి గోధుమ, బార్లీ, బియ్యం గింజలు త్వరగా మొలకెత్తడానికి తోడుపడుతుంది. విత్తనంలో "ప్రొటీన్"లు, "స్టార్చ్" (పిండిపదార్థం)— "అల్యూరాన్" కణజాలంలో కేంద్రీకరించబడి ఉంటాయి. ఈ "స్టార్చ్," సులభంగా వినియోగించుకోవటానికి అవకాశమున్న చక్కెరగా మారటానికి "ఆల్ఫా— అమైలేజ్" అనే "ఎంజైమ్" తోడుపడుతుంది. ఈ "ఎంజైమ్" చర్యా వేగం లేదా చైతన్యశీలత "జిబ్బెరిల్లిక్ ఆసిడ్" పైన ఆధారపడి ఉంటుంది. జన్యుపరమైన మార్పిడితో ఈ "హార్మోన్" ఉత్పాదకాన్ని ఎక్కువచేసి, అదే జన్యు సంబంధమైన మార్పుతో "ఆల్ఫా — అమైలేజ్" "ఎంజైమ్" తీవ్రతను, శీలతను త్వరితంచేసే "సూపర్ సీడ్" లను (అతీతమైన విత్తనాలను) తయారుచేయగలిగినారు. ఇందువల్ల అంకురోత్పత్తి త్వరితంగా ముగియడమేగాక, అధిక ధాన్యోత్పత్తి కూడ సాధ్యమైంది. ఈ విషయాన్ని క్రింది రేఖా చిత్రం ద్వారా ప్రస్ఫుటింపజేయవచ్చును.






[ఇంకా వుంది]

# హోమ్ డిపార్ట్‌మెంట్

**తిరునగరి వేంకటనారాయణమూర్తి**

రంగనాధంగారు స్టేట్ గవర్నమెంట్ ఆఫీస్‌లో ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా పనిజేస్తున్నారు. ఆయన ప్రొద్దుటే పది గంటలకల్లా ఆఫీస్ కెళ్లిపోతే సాయంత్రం ఏడయిపోతుంది తిరిగొచ్చేసరికి అప్పటికి పిల్లలు భోజనాలయిపోయి ఎవరి గదుల్లోకి వాళ్లు పోయి చదువుకోవడమో పడుకోడమో జరుగుతుంటుంది. వాళ్లతో ఏదైనా మాట్లాడాలనుకున్నా తనకు గుర్తుండకపోవడమో లేక వాళ్లు యిల్లు జేరకపోవడమో అవుతుండేది. అందుకే యిలా కాదనుకొని రంగనాధంగారు ఆఫీస్ ప్రొసీజరంతా యింట్లో కూడా ప్రవేశపెట్టేశారు. ప్రతి సబ్జక్ట్‌కూ అంటే ఆదివారం వండే స్పెషల్ కూరల నించీ ఆరోజు సినిమా ప్రోగ్రాం వరకూ స్టాఫ్ (కుటుంబ సభ్యులు) వాళ్ల యిష్టాలు ఫైల్ వాళ్ల వాళ్ల దగ్గరకొచ్చినపుడు వాళ్ల అభిప్రాయాలు వ్రాస్తే అది సర్క్యులేట్ అయి అందరి ఏక అభిప్రాయానికి రావటం తర్వాత ఆచరణలో పెట్టడం జరుగుతుందన్న మాట.

ఆ రోజు రంగనాధం గారింట్లో స్టాఫ్ మీటింగ్ జరుగుతోంది.

సెక్షనాఫీసర్ (ఆయన శ్రీమతి కాంతమ్మగారు) వంటింట్లో పని ముగించుకొని హాల్లో కొచ్చింది. అప్పటికే కుటుంబ సభ్యులు (స్టాఫ్ మెంబర్స్) అంతా వారి వారి సీట్లలో కూర్చున్నారు. ఇంత అర్జంటుగా వాళ్ల బాస్ (రంగనాధంగారు) ఎందుకు మీటింగ్ కాల్‌ఫర్ జేసిందీ అర్థం కాలేదు.

అంతా వచ్చినట్లేననుకున్న తర్వాత రంగనాధం గారు లేచారు సీట్లోంచీ. స్టాఫ్ వుత్సాహంగా చూస్తుండగా మొదలుపెట్టారు.

'డియర్ స్టాఫ్ మెంబర్స్,

మీరంతా నేను సర్క్యులర్ పంపగనే వచ్చి మీటింగ్‌కు ఎటెండ్ అయినందుకు అందరికీ నా స్పెషల్ థ్యాంక్స్. మిమ్మల్నివాళ ఎందుకు పిలిచానంటే మన హోమ్ డిపార్ట్‌మెంట్‌కు ఎడిషనల్ ఫండ్స్ వచ్చాయి. వాటిని ఎలా ఖర్చుపెట్టాలనేది అందరి దగ్గర అభిప్రాయాలు తీస్కుని చేద్దామన్న ఆలోచనతో యింత అర్జంట్‌గా మీటింగ్‌కు పిలవాల్సి వచ్చింది. యిపుడు సెక్షన్ ఆఫీసర్ మాట్లాడుతారు ఆ విషయమై' అంటూ గంభీరంగా ముగించారు పక్కా ఆఫీస్ భాషలో.

కాంతమ్మగారు లేచి నిలబడ్డారు. పిల్లలు, కోడళ్లు, అల్లుడు అంతా చూస్తున్నారు ఎలా వచ్చాయో ఎడిషనల్ ఫండ్స్ అర్థంగాక.

'ప్రియమైన సభ్యులారా,

మొన్న మా పెద్దన్నయ్య కుమారస్వామి వచ్చి రెండు రోజులుండి వెళ్లిన సంగతి మీకు తెల్సిందే కదా? వెళ్తూ నా చేతిలో ఒక రెండువేల రూపాయిలకు చెక్‌పెట్టి వెళ్లాడు పిల్లలకు బట్టలు తీయమని. అయితే యిప్పటిలో మన మెంబర్స్ ఎవరికీ ఈ అవసరం వున్నట్లుగా మా నోటీస్‌కుగానీ హెడ్ ఆఫ్ దీ ఆఫీస్ నోటీస్‌కుగానీ అఫీషియల్‌గా కానీ ఓరల్‌గా గానీ రానందువల్ల మేం ఆ ఫండ్స్‌తోటి ఏదైనా వస్తువు రోజూ వుపయోగపడేది కొంటానికి ప్రపోజల్స్ పంపాలనుకోవడంతో మనబాస్‌తో యీ విషయం కదిపాక అలవాటుగా ఆయన ''నాదేముంది ఫైల్ 'మూవ్‌జేయి'' అన్నారు. అందుకని ఈరోజే నోట్‌ఫైల్ పెట్టడం, దానిపై స్టాఫ్ మీటింగ్‌కు సర్క్యులర్ పంపమని వారు వ్రాయడంతో మిమ్మల్నంతా పిలవటం జరిగింది. తర్వాత మీ దగ్గరకు ఫైలు వస్తుంది మేం ప్రపోజ్ జేస్తున్నాం. కొన్నిటిని వాటిపై మీ రిమార్క్స్ వ్రాసి పంపండి. లేదంటే మీరు వేరే ఏవైనా ప్రపోజ్ జేయండి. అందరూ ఏక్సెప్ట్ జేసిందే తీసుకోవాలి కనుక' అంటూ ముగించబోతూ 'ఈ విషయంలో ఫైల్ తమ దగ్గర కొచ్చినపుడు వూరికే నాన్చక త్వర త్వరగా ప్రక్క సెక్షన్‌కు ఫర్వార్డ్ జేస్తే ఫండ్స్ మిస్‌లీనియస్‌కు ఖర్చయిపోకుండా వుంటాయి' అని ముగించారు కాంతమ్మగారు. అర్జంట్ అని వున్న పేడ్‌లోపెట్టి 'ఎకౌంట్స్ సెక్షన్' అని ఫైల్‌పై వ్రాసి అవుట్ ట్రేలో పడేశారు.

రంగనాధంగారు లేవడంతో అంతా లేచారు. ఆ రోజు స్టాఫ్ మీటింగ్ అంతటితో అయిపోయింది.

కాంతమ్మగారి మనవడు మూడేళ్ల సురేష్ 'డాడీ నాన్నమ్మ ఫైల్ ఈ సారి ముందుగా నీకు పంపింది' అంటూ తెచ్చిచ్చాడు. ఎకౌంట్స్ సెక్షన్ డీల్ చేస్తున్న పెద్దకొడుకు రాజీవ్ ఏ జీస్ ఆఫీస్‌లో ఆడిటర్‌గా పని చేస్తున్నాడు. కనుక తన ధోరణిలో ఫైలు క్రిందినించీ పై వరకూ క్షుణ్ణంగా స్టడీచేసి కాంతమ్మగారు అన్నీ ఆలోచించే ప్రపోజ్ చేస్తుందిలే అనుకొని చూశాడు. ఏజీ ఆఫీస్ అంటేనే ఆవలించకుండానే పేగుల్లెక్కపెట్టగల ఆడిట్ డిపార్ట్‌మెంట్ కదా! ఫైల్‌లో

'గ్రైండర్ కొనగా మిగిలిన ఏడువందలతో మేడపై రాజీవ్ గదిలో సీలింగ్ ఫాన్ కొనాలని' ప్రపోజ్ జేశారు.

రాజీవ్ కలానికి వెంటనే మేత దొరికింది.

'ఎండాకాలం అయిపోయి రెండునెల్లయింది. వానలొస్తున్నాయి, తర్వాత కూడా వచ్చేది చలి కాలమే కాబట్టి మేడ పైగదిలో ఫ్యానుకు యిప్పట్లో అంత అవసరం లేదు' అని వ్రాస్తూ —

'ఆ ఏడువందలకూ వేరే ఏదైనా కొనాలని' సూచించాడు తను ఆడిటర్‌గా ఎకౌంట్స్ సెక్షన్ రిమార్క్సులో.,

ఒక పొట్టి సంతకం పడేసి ఫైల్ రాజీవ్ తర్వాత అమ్మాయి సుశీలకు మార్క్ జేశాడు.

వేసవి సెలవుల్లో భర్తకు సెలవు దొరకనందువల్ల సుశీల సరదాగా ఓ నాలుగు రోజులుండి వెళ్దామని వచ్చింది పిల్లలతో, భర్తతోటి. అన్నయ్య ఫైల్ తనకు మార్క్‌జేయటం చూసి తన పై వున్న ప్రేమకు సంతోషించి శ్రీవారికి చూపెట్టి 'ఏమండీ మీరూ కొనండీ గ్రైండర్ మనకూ' అంది.

'మనక్కూడా మీ అమ్మకు మాదిరిగా హటాత్తుగా ఎడిషనల్ ఫండ్స్ రానీ' అని నవ్వేశారు ఆయన.

మీకన్నీ వేళాకోళమే అంటూ మూతివిరిచింది.

'రాజీవ్ ప్రపోజ్ చేసిన దానికి నేనూ ఎగ్రీ అవుతున్నాను. నాలుగు రోజులు సర్దాగా వుండి పోదామని వచ్చిన నాకు ఫైలు పంపటం నా రిమార్క్స్ అడగటం నాకు సంతోషంగా వుంది. అమ్మ ప్రపోజ్ జేసినట్లు గ్రైండర్ ఎలాగూ నిత్యావసరమే, దాన్ని కొని రాజీవ్ అన్న అన్నట్లు సీలింగ్ ఫ్యాన్ మెల్లగా కొనుక్కోవచ్చు. అదీ అన్నయ్యే మేడ పైగదిలో వుంటాడు కనుక, యిపుడే తనకేమీ సీలింగ్‌ఫ్యాన్ అవసరం లేదంటున్నాడు కనుక ఫ్యాన్ ఫిబ్రవరి — మార్చిలో కొనుక్కోవచ్చు. ఈ ఏడొందలతోటే చివరి చెల్లికి ఎలానూ వచ్చే ఏడో పై ఏడో పెళ్లి చేయాలి కాబట్టి ఆ ఎమవుంట్‌లో ఎంతో కొంత బంగారం వస్తే అంత కొనిపెట్టడం మంచిదని నా అభిప్రాయం' అంటూ పెద్ద డ్రాఫ్టే వ్రాసింది తన రిమార్క్సుగా.,

సుశీల తర్వాత ఫైల్ రాజీవ్ భార్యకు అంటే వదినకు మార్క్ చేసింది, అన్న ఆమెకు ముందుగా మార్క్ చేయకండా తనకు పంపినందుకు విస్ఫూర్తి పడుతూ.

ఫైల్ తెచ్చిన కొడుకు సురేష్ అత్త పంపిందని చెప్పగా విని ఆశ్చర్యపోయింది వదిన తనపై ప్రేమతోటి తనకు మార్క్ జేసినందుకు. తన భర్త తనను కన్సల్ట్ కూడా చేయకండానే తన చెల్లెలుకు పంపినా ఆమె తనకిచ్చిన మర్యాదకు సంతోషిస్తూ సాయంత్రం రాజీవ్ రాగానే చెవిపట్టుకుంది.




'చూశారా మీ చెల్లెలు నా రిమార్క్స్ అడక్కుండానే ముందు తనకు పంపినందుకు ఫైల్ పైన ఎలా వ్రాసిందో, మీకు గుర్తులేను నేను' అంటూ సాగదీసింది.

'అరెరె మర్చిపోయానోయ్ !' అంటూ ఫైల్ అందుకొని చెల్లెలు వ్రాసిందాని క్రింద 'యిలా జరిగినందుకు ఈ సారికి క్షమించాలి' అని వ్రాసి సంతకం పడేసి యిల్లాలి చేతికిచ్చాడు. ఆమె 'సుశీల వ్రాసింది బానేవుంది. మా గదిలో సీలింగ్ ఫ్యాన్ నెక్స్టు బడ్జెట్‌లో తీసుకోవచ్చు'నని వ్రాసేసి ఫైల్ మరిది గారికి మార్కు జేసింది.

రమేష్ డిప్యూటి తాసిల్దార్‌గా పనిజేస్తున్నాడు ప్రక్క వూళ్లో. ఒక్కోసారి లాండ్ రెవెన్యూ కలెక్షన్‌కు కాంప్‌కు వెళ్తే రెండు మూడు రోజులుండి పోతుంటాడు.

రమేష్‌కు తీస్కెళ్లి యిచ్చాడు ఆఫీస్ బోయ్ సురేష్.

మొత్తం ఫైల్ ఒకసారి చదివాడు. పక్కన పెట్టేశాడు రేపు పంపిద్దాంలే అని. మరో రోజు ప్రొద్దుటే మర్చిపోయి కాంప్ వెళ్లిపోయాడు జీప్ రావడం తోటి.

*　　　*　　　*

కాంతమ్మగారు పది రోజులైనా ఫైల్ తిరిగి తన సీటుకు రాకపోవడం తోటి ఒక ఎక్స్‌ప్రెస్ రిమైండర్ వ్రాసి పెద్దకొడుకుకు మార్కు జేసింది.

అది పెద్దకొడుకు చూడగానే తన దగ్గర డిలే లేదనీ వ్రాసి వెంటనే పాస్ జేసేడు.

అలా గిర్రున తిరిగి రమేష్ దగ్గరకు వచ్చింది కాంప్ నుంచీ వచ్చేసరికి. చూడగానే ఫైల్ మీద తన రిమార్క్స్ ఏమీలేవనీ, పైన అక్క సుశీల వ్రాసిన రిమార్క్స్‌తో ఏకీభవిస్తున్నానని వ్రాస్తూ, డిలే తన సీటు దగ్గరయినందువల్ల క్షమించాల్సిందని ఎక్స్‌ప్లనేషన్ యిస్తూ తన భార్యకు మార్కు జేశాడు పెద్దన్న జేసిన పొరబాటే తనూ మరొక్కసారి చేయకుండా.

కాంతమ్మగారి రెండో కోడలు యిన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్‌గారి అమ్మాయి సుగుణ ఫైలు తనకు తెచ్చిచ్చిన సురేష్‌ను ఎత్తుకుని ముద్దు పెట్టుకొని ఒకసారి తిరగేసింది. అంతా అది కొనాలి యిది కొనాలి అనేవాళ్లేగానీ అనుకోకుండా రెండు వేలు వచ్చినందుకు ఒక పార్టీగానీ ఒక సినిమాగానీ అడిగే వాళ్లెవరూ లేరే అనుకొంటూ ఫైల్‌మీద అడ్డంగా వ్రాసేసింది. ఆలస్యం జేస్తే కొడుకునే ఎక్స్‌ప్లనేషన్ కాల్‌ఫర్ జేసింది. నాకైతే ఛార్జెస్ ఫ్రేం జేస్తుంది అత్తగారు అని వెంటనే ఏక్షన్ తీస్కుంది.

'ఈ రోజు బుధవారం. రేపు వచ్చే శనివారం సెకండ్ సాటర్ డే. అందరి ఆఫీస్‌లకూ సెలవ్ కాబట్టి మామగారు దగ్గర్నుంచీ అందరికీ సెలవే. సుశీల వాళ్లుకూడా వెళ్లిపోతున్నారు ఆదివారం. అందుకే అందర్నీ శనివారం మాట్నీకు తీస్కెళ్ల వలసిందిగా ఫైనాన్స్ డిపార్ట్‌మెంట్ సెక్షనాఫీసర్ గార్ని కోరుతున్నాను.' అని వ్రాసేసి సంతకం పెట్టేసింది.

యిపుడు ఫైల్ కాలేజీలో బికాం ఫైనల్ చదువుతున్న మరిది రాజేంద్రకు మార్కు జేసింది.

సురేష్ తెచ్చిచ్చిన ఫైల్ చివరి పేరా చూడగానే, 'చిన్న వదిన ప్రపోజ్ జేసింది బాగుంది. పైగా సిన్మా కూడా 'స్టార్‌వార్స్' మంచి పిక్చర్ శనివారం శలవు కాబట్టి టికెట్స్ ఆ రోజు దొరకవు గాబట్టి ముందుగా నాకు డబ్బిస్తే టికెట్స్ ఎడ్వాన్స్ కౌంటర్లో తేగలను ఆ రోజుకు. పైగా పెద్దక్క వెళ్లిపోతోంది కూడా.'

అసలా ఫైల్ ఎందుకు వచ్చిందీకూడా చూడకండా పై పేరాలు చూడకుండానే డ్రాఫ్టు పెట్టే బద్దకపు గుమస్తాలా చివరి పేరా పైనే రిమార్క్స్ వ్రాసి పంపేసాడు చెల్లెలు శాంతికి.

శాంతి కాలేజీలో ఫస్టు బి.ఏ. చదువుతోంది. అన్నలా తనకు యింగ్లీష్ పిక్చర్స్ పిచ్చిలేదు. ఇంట్లో అంతా కాంతమ్మగారి దగ్గర్నుంచీ చిన్న అన్న దాకా యింగ్లీష్ పిక్చర్స్ చూడటం అలవాటేగానీ తను మాత్రం వెళ్లదు. తెలుగులోనే ఏడాదికో రెండేళ్లకో వచ్చే మంచి మూవీస్ వుంటే చూస్తుంది లేకుంటే లేదు.

ఫైల్ సురేష్ తెచ్చి 'చిన్నత్తా ఈ ఫైల్ నీకిమ్మన్నాడు రాజేంద్ర బాబాయ్' అని యిచ్చి వెళ్లిపోయాక ఒకసారి చదివి తనకోసం బంగారం కొనమని పెద్దక్క చేసిన ప్రపోజల్స్‌కు సంతోషించింది. చిన్న వదిన సినిమా ప్రపోజ్ జేసి టాక్స్ వేసింది అమ్మకు అనుకుంది. చిన్నన్న 'స్టార్‌వార్స్' సినిమా ప్రపోజ్ చేయడమే నచ్చలేదు. ఇంచక్కా చాలా రోజులకు అభిమాన దర్శకుడు డైరెక్టు చేసిన సినిమా అయితే బావుంటుంది అనుకొంటూ అదే ప్రపోజ్ జేసింది. 'సినిమా విషయం మాత్రం నేను ఒప్పుకోడంలేదు ఈ విషయమై మరొక్కసారి ఆలోచించాలి అందరూ' అని వ్రాయడంతో ఫైలు వెనక్కితిరిగి ఫైనాన్స్ సెక్షన్‌కు వెళ్లింది.

*　　　*　　　*

కాంతమ్మగారు పదిహేనురోజులకు తిరిగి ఫైలు తన దగ్గరకు వచ్చినందుకు నొచ్చుకున్నా




## కె. వి. ఆర్. — విజయవాడ

నా వయస్సు 20 సం॥లు. మలవిసర్జన జరిగేటప్పుడు శబ్దం వస్తున్నది. మలంలో జిగురు, నులిపురుగులు అప్పుటప్పుడు కనబడుచున్నవి. ఒక్కోసారి రోజుకి రెండు, మూడుసార్లు మల విసర్జన చేయవలసి ఉంటుంది.

★ మలపరీక్ష చేయటంవల్ల అమీబిక్ డిసెంటరీ ఉన్నదీ లేనిదీ తెలుస్తుంది. ఈ రోగాన్ని కలుగజేసే ఎంటమీబా హిస్టోలిటికాలను కనుగొనటం అంత సులభం కాదు. రెండు మూడుసార్లు వరుసగా మలపరీక్ష చేయించవలసి ఉంటుంది.

రోగనిర్ధారణ జరిగిన తర్వాత మెట్రోనిడజాల్ మాత్రలు వరుసగా పది రోజులపాటు వాడవలసి ఉంటుంది. మలవిసర్జన సమయంలో శబ్దం అనేది కొంతవరకూ సహజమే అయినా, అధికంగా రావటం అనేది కడుపులోని ఇన్‌ఫెక్షన్‌ని తెలియజేస్తుంది.

## పి. ఎమ్. ఆర్. — ఆముదాలవలస

నా వయస్సు 37 సంవత్సరములు. ఒక నెల రోజుల క్రిందట రాత్రి మంచి నిద్రలో వున్న నేను ఒక్కసారి లేచి గట్టిగా అరిచేసరికి నా భార్య అదిరిపడి నా రెండు చేతులు పట్టుకొనగా నేను చేతులు విదిలించి కటకటాల వరకు పరుగెత్తానట. నా అరుపులకు వీధివీధంతా అదిరిపడి లేచివచ్చారు. నా గొంతు కూడా రెండు రోజులు కీచుగా మారినది. తెలివి వచ్చిన మరుక్షణం కాళ్ళల్లో వణుకు పుట్టింది. మళ్ళీ మొన్న గతంలో అంత వుధృతంగా కాక నిద్రలో అరవటం జరిగింది. ఇంట్లో అందరికీ భయముగా వున్నది.

★ మానసిక బుగ్మతవల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది. దీనిని స్లీప్ వాకిరగ్ అని అంటారు. మీరు నిపుణులైన సైకియాట్రిస్టులను సంప్రదించవలసి ఉంటుంది.

## ఎస్. ఎల్. — తెనాలి

నాకు ఈ మధ్య తరచుగా తలవెనుక భాగాన కుడి చెవికి ప్రక్కగా సన్నగా పోటు వస్తూన్నది. ఆఫీసులో పని ఎక్కువగా వున్న రోజుల్లోను, ఎక్కువ సేపు చదవడం వల్ల గూడా ఇలా వస్తుంది. ఇది ఏ రకం జబ్బు? బ్రెయిన్ ట్యూమర్‌ను గురించి తెలుప గలరు.

★ ఈ లక్షణం బ్రెయిన్ ట్యూమర్ వల్ల రాదు. మడిల్ ఇయర్ ఇన్‌ఫెక్షన్ వల్లగాని, యూస్టేచియన్ కెటార్ వల్లగాని ఇలా జరిగే అవకాశం ఉన్నది. దీనికి ఇ. ఎన్. టి. వైద్యుల వద్ద పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది.

ఫిట్లు రావటం, తలనెప్పి వాంతులు మొదలయినవి బ్రెయిన్ ట్యూమర్ లక్షణాలు ట్యూమర్‌వచ్చిన ప్రాంతాన్ననుసరించి అదనంగా లక్షణాలు కనబడతాయి. ట్యూమర్‌ఉన్న ప్రాంతాన్ననుసరించి శస్త్రచికిత్స చేసే వీలున్నదా లేదా అని తీర్మానిస్తారు.

## డి. జి. బి. ఎస్. — రామాయంపేట

నాకు 21 సం॥లు. అయిదు గంటలసేపు ఏకధాటిగా చదివితే చాలు, తల భారం, కళ్ళు మూతలు పడటం జరుగుతుంది. ఓ అరగంట కళ్ళు మూసుకొని రెస్టు తీసుకొంటేగాని మామూలు మనిషినిగాను. కళ్ళజోడు వాడవలసిన అవశ్యమేమైనా ఉన్నదా ?

★ ఎవరైనాగాని అదేపనిగా కాన్‌సెన్‌ట్రేట్ చేసి చదవటం రెండు గంటలకన్నా ఎక్కువ కాలం చేయలేరు. మధ్యలో కాస్త విశ్రాంతి అవసరం అవుతుంది. కళ్ళజోడు వాడటం అనవసరం.

---

## హోమ్ డిపార్ట్‌మెంట్

పిల్లలు కోడళ్లు తను ప్రపోజ్ జేసిన గ్రైండర్ తీస్కొంటానికి అందరూ ఒప్పుకున్నందుకు సంతోషించింది. తను సీలింగ్‌ఫ్యాన్ ప్రపోజ్ జేస్తే కొడుకు తనకు సీలింగ్‌ఫాన్‌కు అర్జంటేమీలేదంటం, చిన్న కూతురు శాంతికి బంగారం కొనమని ప్రపోజ్ జేయటం చూసి మరింత సంతోషించింది సుశీల సమయస్ఫూర్తికి.

సుగుణ వేసిన సినిమా టాక్స్ చూసి నవ్వుకొంది, మొత్తానికి మరోసారి యినకమ్‌టాక్స్ ఆఫీసర్ కూతురు అన్పించుకొంది అనుకొంటూ. ఆ అమ్మాయి ప్రపోజ్ జేసిందీ మిగిలిన పిల్లలు ఒప్పుకుంటారు కానీ శాంతీ, రాజేంద్రా అస్తమానం కీచులాడుకొన్నట్లే ఫైల్ మీద కూడా కీచులాడు కోడం చూసి నవ్వుకొంది కానీ తెలుగుసినిమా అయితేనే బాగుంటుంది. ప్రక్కింటి రామలక్ష్మమ్మగారు కూడా చెప్పారు చాలరోజులకు తెలుగులో మంచి సిన్మాలొచ్చాయి అంటూ. అందుకే ఎలాగూ రెండో కోడలు ప్రపోజ్ జేసిన సినిమా ఏక్సెప్ట్ జేస్తున్నాం కనుక తెలుగు సిన్మానే ఏదైనా ప్రపోజ్ జేయమని వ్రాసి 'ఫర్ ఫేవర్ ఆఫ్ ఆర్డర్స్' అని ఆరోజు రాత్రి ఒకసారి శ్రీవారికి చూపెట్టింది నీ ఫైల్ పొజిషన్ ఎంతవరకూ వచ్చిందోయ్ అని రోజూ అడుగుతున్నారుకదాని.

ఆయనా సంతోషించారు పిల్లల అభిప్రాయాలకు.

శ్రీమతి ప్రపోజ్ చేసినట్లే నేనూ తెలుగుసిన్మాకు వెళ్లడానికే ఒప్పుకొంటున్నాను. అదీ ఏ పిక్చరనేది డెసిషన్ శాంతినీ చిన్నకొడుకు రాజేంద్రనూ యిద్దరూ డిస్కస్ జేయటానికి రమ్మనమని వ్రాసి ఆ ఫైల్ అప్రూవ్ జేశారు. పర్చేజింగ్ పవర్స్ రమేష్‌కు యిస్తూ ఫైనాన్షియల్ డిపార్ట్‌మెంట్‌కు పద మూడొందలు రమేష్‌పేర యిష్యూ జేయాల్సిందిగా ఆర్డర్స్ వేశారు.

ఫైల్ రమేష్ దగ్గరకు వెళ్లితే రమేష్ సర్ నోటెడ్ అని సంతకం వేశాడు.

రాజేంద్ర, శాంతి ప్రొద్దుటే ఆ ఫైల్ తీస్కొని తండ్రి దగ్గిరకొచ్చారు. 'ఆ ఏవర్రా యిద్దరూ రాజీకొచ్చారా యింకా పేచీల్లోనే వున్నారా! మీరడిగినట్లు పిక్చర్‌కు డబ్బు శాంక్షన్ జేసింది మీ అమ్మ. మీరేసిన్మాయో తేల్చుకొంటే రాజేంద్ర వెళ్లి ఎడ్వాన్స్‌లో టికెట్స్ తెస్తాడు' అన్నారు రంగనాథం గారు.

రాజేంద్ర ఏ మూడ్‌లో వున్నాడోకానీ 'పోన్లే డాడీ చిన్నీ యిష్టం. ఏ పిక్చర్కైనాసరే తెలుగు పిక్చర్‌కే ఒప్పుకుంటున్నా ఈసారి మాత్రం. తర్వాత ఆ పిక్చర్ వెళ్లిపోతుంది డాడీ, మీరు నాకొక్కడికైనా స్పెషల్ పర్మిషన్ ఇప్పిస్తే తర్వాతనైనా చూస్తాను' అన్నాడు.

'సరేలేరా' అని 'ఏమ్మా నీ యిష్టమొచ్చిన సినిమాకు అమ్మ దగ్గర డబ్బులు తీస్కొని టికెట్స్ తెప్పించేయి అన్నయ్యతోటి' అనేసి ఆయన టైం అవడంతో ఆఫీస్‌కు తయారవటంలో పడిపోయారు.

ఆ ఫైల్‌ను కాంతమ్మగారికి ఇచ్చేయటంతోటి గ్రైండర్‌కు డబ్బు యిస్తూనే రాజేంద్రకు సినిమా డబ్బుకూడా యిచ్చేసింది.

రమేష్ ఆ రోజే ఆఫీస్ నుంచీ రాగానే వెళ్లి గ్రైండర్ కొనితెచ్చాడు. అంతా సంతోషించారు. బిల్ ఫైల్‌కు గుచ్చేసి ఫైల్ క్లోజ్ చేయటానికి నోట్ వ్రాసాడు.

కాంతమ్మగారే వెళ్లి మిగిలిన డబ్బుతో బంగారం కొనాలని ఆమెతో నోటెడ్ అనిపించి సైడ్‌యిన్సల్ వేసి బాస్‌కు పంపాడు.

దానిపై రంగనాథంగారు ఫైల్ 'డీడిస్' చేసినట్లు సంతకం పెడ్తూ 'యిలా ప్రతి వుమ్మడి కుటుంబంలో కూడా అంతా యిలా సర్దుకుంటూ పోతే ఏ కీచులాటలూ రాకుండా ఎంతో ఆనందంగా వుంటుంది కదా' అన్నారు.

'ఏవంటారు ఫైనాన్షియల్ సెక్షన్ ఆఫీసర్ వారు' అంటంతో 'మరేలెండి ఫైలు క్లోజ్ అయిపోయింది కదా. యిపుడు నా దగ్గర ఫండ్స్‌లేవు. కాబట్టే నేనుట్టే కాంతమ్మనే' అంది.

అంతా నవ్వేశారు.



# సినిమా విశేషాలు

-జి. వి. జి:

## అనుమానం మొగుడు

"మూఢనమ్మకాలు గల ఒక ఆఫీసర్ జీవితంలో ఎదురయ్యే ప్రాబ్లంలను సంపూర్ణ హాస్య చిత్రంగా రూపొందిస్తాం నటీనటులతోపాటు గాయనీ గాయకులను కూడా కొత్తవారినే పరిచయం చేస్తాం," అన్నారు గిడుతూరి సూర్యం ఈయన స్క్రీన్ ప్లే, దర్శకత్వంలో చిన్నారి రాఘవ నిర్మించే జయలక్ష్మి ఎంటర్ ప్రైసెస్ "అనుమానం మొగుడు" చిత్రానికి బరంపురం కొల్లాడి కథ, ఆర్. వి చలం మాటలు రాశారు సి నారాయణరెడ్డి, వేటూరి, పడ్డేపల్లి గీతాలకు ఎ ఎ రాజ్ స్వరకర్త, గోయెల్ డి కె. ఛాయ, బి చలం శిల్పం, శేషు నృత్యాలు, ఎం. ఎస్. ఎన్ మూర్తి కూర్పుతో నిర్వహణ బాధ్యతలను సి హెచ్ సాంబమూర్తి, బాబు సుబుద్ధి, కె. భానుప్రసాద్ వహిస్తారు శ్రీకాకుళం, విశాఖ ప్రాంతాల్లో జనవరి 1 నుంచి ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది.

## ఛాయాగ్రాహకుని దర్శకత్వంలో కల్యాణ బంధం

"ప్రేమించిన యువతి విధివశాత్తూ మరొకరికి అర్ధాంగి అవడంతో భగ్నహృదయుడవుతాడు ఓ యువకుడు. అతనిలో పరిణామం తీసుకురావడానికి పాటుపడ్డ ఆ యువతి అపవాదుకు గురి అవుతుంది దాంతో కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది," అన్నారు ఛాయాగ్రాహకుడు అశోక్ కుమార్. ఈయన దర్శకత్వంలో రమణమూర్తి నిర్మించే లలితశ్రీ కంబైన్స్ "కల్యాణ బంధం" షూటింగ్ జనవరి 1న ప్రారంభమవుతుంది. ఊటీ, కొడై కెనాల్, మద్రాసు, హైదరాబాద్ ప్రాంతాలలో ఏప్రిల్ కు పూర్తవుతుంది. శరత్ బాబు, మోహన్, సుహాసిని, అంజు, సురేష్ వగైరా తారాగణం. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. ఇళయరాజా సంగీతం, లెనిన్ కూర్పు, చంద్ర శిల్పం, రఘు నృత్యాలు నిర్వహిస్తారు.

## డైరెక్టర్ మదన్ మోహన్ చిత్రాలు

★ టి ఎస్ ప్రసాద్ సారధ్యంలో ఎస్ రజాక్ సాహెబ్ సమర్పించే శ్రీకృష్ణకళామందిర్ వారి "కనకమాలక్ష్మి" చిత్రం మొగిలి, అగ్రహారం, దండిమిట్ట ప్రాంతాలలో సగానికి పైగా షూటింగ్ పూర్తి చేసుకుందని నిర్మాతలు జి కన్నయ్య, ఊటుకూరి నంజియ్యర్ తెలిపారు చంద్రమోహన్, ప్రభ, ఈశ్వరరావు, వంకాయల, కాకరాల, మురళీకృష్ణ, నిర్మల, విజయవాణి, శ్రీకళ, శ్యామల పాత్రధారులు సుజాత కథకు గొల్లపూడి సంభాషణల కర్త ఇళయరాజా స్వరకల్పనలో/ఆరుద్ర, వేటూరి గీతాలు రాశారు. యోగానంద్ ఛాయ, రంగారావు శిల్పం, విజయ్ కూర్పు, సూర్యప్రకాష్ సహకార దర్శకత్వం గల ఈ చిత్రాన్ని ఉగాది కానుకగా అందివ్వాలని నిర్మాతల సంకల్పం.

★ టి వి. సుబ్బారావు నిర్మించే టి. వి ఎస్ పిక్చర్స్ తొలి చిత్రం "కనకదుర్గ"లో కొత్త నటీ నటులు పాల్గొంటారు.

★ జాతీయ సమైక్యతను, మత సామరస్యాన్ని ప్రబోధించే "అరుణోదయం" చిత్రాన్ని కె. కె పిక్చర్స్ అధినేత కిరణ్ కుమార్ నిర్మిస్తారు.

'అమాయక చక్రవర్తి' లో విజయశాంతి

ఉన్నాడుగా ? అతను చాలు నాకు. వెరీ గుడ్ మీరు షికారుకి ఎక్కడికీ వెళ్ళరా ?'' అడిగింది ప్రేమ

''నువ్వెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాం,'' అన్నాడు సింహం.

''అయితే, ముందు బీచ్‌కెళ్దాం భలే జాలీగా ఉంటుంది కాకపోతే— మీతోబాటు వచ్చి ఊరు చూపించడానికి ప్రత్యేకంగా ఫీజు ఇవ్వాలి, ఎక్కువేం కాదు గంటకి పది రూపాయలే!''

సింహం ఆత్రుతతో ''దేనికి దేనికి ఎంతెంత రేటో ఒక్కసారిగా చెప్పు.''

ప్రేమ ఫక్కున నవ్వింది ''ఇంకేంలేవు మిగతావన్నీ ఫ్రీయే''

చౌదరి పట్టరాని సంతోషంతో ''ఏమిటీ! మిగతావన్నీ ఫ్రీయేనా ?'' అన్నాడు

''అవునుగాని – ముందు నాకో విషయం తేల్చండి మిమ్మల్ని ఏమని పిలవాలి ? అస్తమానం 'మిస్టర్, డస్టర్' అనడం నాకు చాలా ఇబ్బందిగా ఉంది. . అంకుల్ – అని పిలవనా ?''

''ధూర్తి,'' అని సింహం ఇబ్బందిగా



'ముద్దులమొగుడు'లో శ్రీదేవి, సుహాసిని, అక్కినేని, శరత్‌బాబు

## "ప్రేమ పిచ్చోళ్లు" లో ప్రేమోపాసకులు

''హాయ్ ఎవ్రిబడీ!'' అంటూ ప్రేమ (రాధిక) డైనింగ్ రూమ్‌లోకి ప్రవేశించింది అక్కడ సింహం (రావు గోపాలరావు), చౌదరి (గుమ్మడి), బాలు (అల్లు రామలింగయ్య) నోళ్ళు తెరుచుకొని కూర్చొన్నారు ''భోజనాలు వచ్చేశాయి పదండి— డైనింగ్ టేబుల్ దగ్గరికి నేను వడ్డిస్తాను,'' అంది ప్రేమ.

''వెరీగుడ్! ఏమిటో, ప్రేమా! నీ అభిమానం చూస్తుంటే చాలా సంతోషంగా ఉంది,'' అన్నాడు చౌదరి.

''చూడండి ఈ ఊళ్ళో రెండు వారాలకి పని చెయ్యడానికి ఎవరూ రారు. ఈ బంగళాలోకి ఎవరొచ్చినా— వాళ్ళ భోజనం, మంచీ చెడ్డా నామీదే పడుతూంటుంది నేను కూడా ఊరికే ఏం చెయ్యను లెండి ఒక పద్ధతి పెట్టుకున్నాను మనిషికి ముప్ఫై రూపాయలు తీసుకొని లంచ్, బ్రేక్‌ఫాస్ట్, డిన్నర్ అన్ని ఏర్పాట్లూ చేస్తాను. మీరు ముగ్గురున్నారు కాబట్టి రోజుకు తొంభై రూపాయలు ఇచ్చేయండి అన్నీ నేనే చేస్తాను ఎనీ అబ్జెక్షన్ ?'' అంది ప్రేమ

''చాలా రీజనబుల్‌గా ఉంది,'' అన్నాడు చౌదరి.

''కాకపోతే—నేను వంటా అదీ చేయడానికి కాస్త ఎవరైనా సాయపడాలి,''అంది వడ్డన ప్రారంభిస్తూ.

''నేనొస్తా సాయం చేయటానికి నేనొస్తా,'' అన్నాడు సింహం.

''భలేవారే సరదాగా టూర్‌కొచ్చి మీరు వంటలు చేయడమేమిటి ? మీ డ్రయివర్ ఖాళీగానే

'గాజుబొమ్మలు'లో చిత్ర →



చూస్తే, "అది తాతల కాలంనాటి పిలుపు" అన్నాడు చౌదరి.

ఉన్నట్టుండి ప్రేమ "అవునూ... ఈ రవి ఎటు వెళ్లాడు? సారీ యాదగిరి ఎటెళ్లాడో ఏమిటో చూసి వస్తాను," అంటూ బయటకు వెళ్లిపోయింది.

ముగ్గురూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. "వాటీస్ దిస్? ఈ పిల్ల ఆ రవిగాడ్ని పట్టుకుని రవి – రవి అంటుందేమిటి?" అని బాలు గుడ్లు తేలేశాడు "కారులో కూడా, అలాగే పొరపాటు పడింది కదా?" అని చౌదరి బుర్ర గోక్కున్నాడు.

ఎస్ పి వెంకన్నబాబు నిర్మాణ పర్యవేక్షణలో సత్యదేవీ కంబైన్స్ "ప్రేమ పిచ్చోళ్ళు" వినోదభరిత చిత్రానికి దర్శకత్వం నెఱపే ఎ కోదండరామిరెడ్డి "రవిగా, మారు వేషంలో గిరిగా నటించింది చిరంజీవి," అని తెలిపారు సుధాకర్, రాజా, మాలి, గీత, కవిత, సూర్యకాంతం, పుష్పలత, జయమాలిని, నిర్మల, విజయలక్ష్మి ఇతర పాత్రధారులు సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు రాశారు చక్రవర్తి సంగీత దర్శకుడు



'కుంకుమ తిలకం'లో
మురళీమోహన్, జయసుధ



## "కుంకుమ తిలకం"

"స్త్రీ బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యయంలో కొడుకులఆదరువులో బ్రతుకుతుంది ఐతే, శ్రీ విఘ్నేశ్వర ఆర్ట్‌పిక్చర్స్ 'కుంకుమ తిలకం'లో బాల్యంలో బాధ్యతగల బాలికగా, వివాహమయ్యాక భర్తకు తోడుగా, ఆ తర్వాత కొడుకు లాంటి మరిదికి తల్లిగా ఎన్నో బాధ్యతలను నిర్వహిస్తుంది," అన్నారు డైరెక్టర్ బి భాస్కరరావు ఆ అపూర్వమైన స్త్రీ పాత్రధారిణి జయసుధ మురళీమోహన్ హీరో. ఇంకా సురేష్, తులసి, హేమసుందర్, పుష్పలత మున్నగువారు కూడా నటించారు. మద్దిపట్ల సూరి సంభాషణలు, గోపి గీతాలు రాశారు సత్యం సంగీతం, సత్తిబాబు ఛాయ, బి. ఎన్ కృష్ణ శిల్పంలో యడవల్లి విజయేంద్రరెడ్డి నిర్మించిన ఈ చిత్రం డాక్టర్ ఎం ప్రభాకరరెడ్డి సమర్పణ

## "ధర్మకర్త'

"కాకినాడలో జనవరి రెండవ వారం నుంచి ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ ముగిస్తాం" అన్నారు హనుమాన్ పిక్చర్స్ అనే నూతన సంస్థ నిర్మించే పై చిత్రానికి కథ రాసి, నిర్వహణ బాధ్యతలు వహించే బిట్రా వెంకట్రావు తొలిగీతం డిసెంబర్ 30 న రికార్డయింది మురళి, శివరాజ్, విజయ భూషణ్, చంద్రలేఖ, ఈశ్వరి, సుధ నాయుడు బాబు, చంద్రశేఖర్, చౌదరి, పి. బి బి రావ్ నటిస్తారు రవీంద్రనాథ్ సంభాషణలు, గబ్బిట వెంకట్రావు గీతాలు రాశారు మాధవరావు సంగీతం, వెంకటేశ్వరరావు ఛాయ, బాబ్జి శిల్పంతో వి. బ్రహ్మజీ దర్శకుడు

← 'రెండు జెళ్లసీత'లో మహాలక్ష్మి



'ధర్మ పోరాటం'లో
← జయసుధ, మోహన్‌బాబు, సారధి

## సినిమా

## ''అడవి సింహాలు''లో అడవి మనిషి !

''మా చిత్రంలో ద్విపాత్రాభినయం చేయడానికి అమెరికా నుంచి ఓ ఆర్టిస్టును అష్టకష్టాలూ పడి ప్రొడూసర్సు తెప్పించారు,'' అన్నారు వైజయంతీ మూవీస్ కొత్త చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న డైరెక్టర్ కె రాఘవేంద్రరావు ఆ ఆర్టిస్టు 'లులూ' అనే చింపాంజీ ఇది వరకు 'అయిదారు టెలివిషన్ ప్రోగ్రామ్స్‌లో పాల్గొన్నదట సినిమాలలో నటించడం ఇదే తొలిసారి 30 కాల్‌షీట్లలో నటించడానికి దీని పారితోషికం ఆరు లక్షల రూపాయలు ఆ తర్వాత ఇంకా షూటింగ్ కొనసాగితే రోజుకి 800 డాలర్ల చొప్పున అదనంగా చెల్లించాలట. ఈ చింపాంజీ చాలా తెలివైనది. పైప్ పీల్చడమంటే ఎంతో ఇష్టం ఆపిల్సు, అరటిపళ్ళు ఆహారం ప్రతి రోజూ పాతిక పైగా 'కేంపాకోలా' కూల్‌డ్రింక్‌లను తాగుతుంది ఇంగ్లీషులో ఏం చెప్పినా అర్థం చేసుకుంటుంది డిసెంబర్ 16, 17, 18 తేదీలలో ఈ చింపాంజీని చూడడానికి వచ్చిన జనంతో శారదా స్టూడియో కిటకిటలాడి పోయింది ఆ తర్వాత 19 నుంచి నెలాఖరు వరకు ముదుమలై అడవుల్లో షూటింగ్‌లో ఈ చింపాంజీ పాల్గొంది ''అడవి సింహాలు'' చిత్రాన్ని హిందీలో ''జానీ దోస్త్''గా అశ్వనీదత్, అర్జునరాజు నిర్మిస్తున్నారు. తెలుగులో కృష్ణ, కృష్ణంరాజు, సత్యనారాయణ ధరించే పాత్రలను హిందీలో జితేంద్ర, ధర్మేంద్ర, అమ్జాద్‌ఖాన్ నిర్వహిస్తున్నారు

## నవయువ చైతన్యం

''కుమారి రోహిణి మా చిత్రంలో హీరోయిన్ నాగభూషణం, సాక్షి రంగారావు, జగ్గారావు, కృష్ణకుమారిలతోపాటు కొత్త కళాకారులు వి. మురళీధర్, జి వి రత్నం, జి లింగారెడ్డి, జి జైహింద్‌లను పరిచయం చేస్తున్నాం,'' అని డైరెక్టర్ జి ఎస్ రామచంద్రరావు తెలియజేశారు. డిసెంబర్ నెలాఖరు నుంచి నల్గొండ జిల్లా రామన్నపేట స్వాములవారి లింగోటం, వలిగొండ, హైదరాబాద్ ప్రాంతాల్లో షూటింగ్ జరిగి, ఉగాది విడుదలకు సిద్ధమవుతుంది వల్లకాటి కథకు దర్శకుడే స్క్రీన్‌ప్లే రాశారు శ్రీమతి సీతారాం, శ్రీ శ్రీ, దాశరధి గీతాలు రాస్తారు. గౌతమ్ కుమార్ ఛాయ, త్రినాధరావు శిల్పంతో వల్లకాటి చెన్నకృష్ణయ్య, గరిక వెంకటసుబ్బయ్య, గజ్జెల వెంకటరెడ్డి నిర్మాతలు. ఈ ''నవయువ చైతన్యం'' చిత్రం విజయ్ ప్రొడక్షన్స్ పతాకంలో తయారౌతుంది

'రంగులకల'లో శకుంతల →



## కొన్ని చిత్రాల పేర్లు

★ శోభన్‌బాబు, రాధిక నాయకా నాయికలుగా తాతినేని రామారావు దర్శకత్వంలో అట్లూరి పూర్ణచంద్రరావు నిర్మించే లక్ష్మీ ప్రొడక్షన్స్ చిత్రం పేరు ''అఖండుడు.''

★ కోడి రామకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో రవిశేఖరరాజు నిర్మించే విశ్వచిత్ర కంబైన్స్ చిత్రానికి ''రంగుల పులి'' అనీ పేరు పెట్టారు. మోహన్‌బాబు, సుమలత నాయకా నాయికలు.


DIMPLE





విజయనిర్మల

## రూపొందించిన మధుర శృంగార కావ్యం కోకిలమ్మ

"విశాఖపట్నం పరిసరాలంటే నాకెంతో ఇష్టం. కొండలు ... ఓ వైపున మహాసముద్రం ... పక్కన నవనాగరికతకు మెరుగులు దిద్దుతూన్న నాగరిక ప్రపంచం. లోగడ 'అంతులేని కథ, మరో చరిత్ర' చిత్రాలను కూడా ఇక్కడే రూపొందించాను. 'ఏక్ దూజే కే లియే'లో విశాఖ లొకేషన్‌లకు ముగ్ధులైన ఎందరో హిందీ చిత్ర నిర్మాతలు 'మనం కూడా అక్కడే తీద్దామా ?' అని నన్ను అడిగారు. లక్ష్మీ జ్యోతీ ఫిలిమ్స్ అధినేత ఆర్. ఎస్. రాజుగారు ఉత్తమాభిరుచిగల నిర్మాత. మంచి వ్యక్తి. ఆయన "కోకిలమ్మ" చిత్రంలో విశాఖపట్నంను కొత్త కోణాల్లో చూపించాను. నా తదుపరి తెలుగు చిత్రానికి కూడా విశాఖ లొకేషన్‌లనే ఎన్నుకుంటానేమో ! మొత్తంమీద విశాఖకూ, నాకూ ఏ జన్మలోనో ముడిపడి ఉంది," అంటూ డైరెక్టర్ కె. బాలచందర్ "కోకిలమ్మ" చిత్రం గురించి ఇలా వివరించారు : "నాయిక సరిత చెవిటిది. అయితే, ఆమె హృదయానికి చెముడులేదు. ప్రేమకే ఆ హృదయం విచ్చుకుంటుంది. స్పందిస్తుంది. అనురాగాల అనుబంధాల తీయటి ఊహలతో విహరిస్తుంది. ఆ హృదయాన్ని ఆమె ఓ మధుర గాయకునికి అర్పించింది కాని, అతని ప్రణయ గీతాలు బధిర కర్ణాలవద్ద శంఖం ఊదినట్లే కదా ? అతని సన్నిధానమే తన జీవిత మకరందమనుకుంది. కాని, అతను గొప్పవాడయ్యాక అతని పాటలు అతనివి, ఆమె పాట్లు ఆమెవి అయిపోయాయి. 'నీకు చెముడు భగవంతుడిచ్చిన వరం,' అని ఒక సందర్భంలో ఆమె ప్రియునికి సంగీతం నేర్పిన విద్వాంసుడు అన్నాడు కూడా. అది సైతం ఆమెకు అవగాహన కాలేదు. తీరా బోధపడేసరికి ఆమె ఊహల గాలిపటం చటుక్కున తెగిపోయింది. తాడూ బొంగరం లేని జీవితమైపోయిందామెది," అంటూ ఆ చిత్రంలోని కొన్నిపాటలను వినిపించారు.






బాలచందర్ పాటల చిత్రీకరణలోని విశిష్టత అందరూ ఎరిగినదే. ఆయన పాటలు కూడా కొంత వరకు కథను నడుపుతాయి. అందుకే ఆయన పాటలు ప్రదర్శింపబడే సమయంలో సిగరెట్టు, కాల్చుకో డానికి ఎవరూ థియేటర్ బయటకు వెళ్లరు, వెళ్లలేరు. ప్రత్యేకించి "కోకిలమ్మ" చిత్రంలో పాటలు వింటూంటే — అలాగే సీటుకు అంటుకు పోయినట్లుంటుంది ఎవరికైనా. ఆయన దర్శకత్వ ప్రతిభకు ఆత్రేయ గీతాలు, ఎం. ఎస్. విశ్వనాథం సంగీతం, బాలు సుశీలల గానం, లోక్‌నాథ్ ఛాయ అంతగా తోడ్పడ్డాయి. "ఈ చిత్రం మరో చరిత్ర సృష్టించవచ్చు," అన్నారు సంభాషణలకర్త గణేశ్‌పాత్రో.

## పావనీ జలదుర్గ క్రియేషన్స్ తొలి చిత్రం

'శాంతి నిలయం' చిత్రానికి ప్రశంసనీయంగా దర్శకత్వం నెఱపిన సి. వైకుంఠరామశర్మ దర్శకత్వంలో గురజాడ సోదరులు, పి. వి. సత్య నారాయణ పై పతాకంలో నిర్మించే చిత్రానికి ఇటీవల పాటలన్నీ రికార్డయ్యాయి. సుధాకర్, సాధన, హరిప్రసాద్, మిఠాయి చిట్టి, రమ, శ్యాంబాబు, చిడతల అప్పారావు, జి. ఎస్. ఆర్. మూర్తి (కొండూరు) నటిస్తారు. గురజాడ నాగ గౌతమ్ కథకు దత్తాత్రేయశర్మ మాటలు రాశారు. కొన్ని గేయాలను సముద్రాల జూనియర్ రాశారు. వాటిని బి. బ్రహ్మానందం స్వరకల్పనలో బి. వసంత, ఆనంద్ ప్రభృతులు పాడారు. బి. రామారావు ఛాయాగ్రాహకుడు. మురళి సంకలనకర్త. "కృష్ణా జిల్లా కైకలూరు ప్రాంతాలలో జనవరి 21 నుంచి ఫిబ్రవరి 15 వరకు షూటింగ్ జరుగుతుంది," అని దర్శకుడు తెలియజేశారు.

# సినిమా

## డైరెక్టర్ కె.ఎస్ ఆర్ దాస్ చిత్రాలు

★ చిరంజీవి హీరోగా పింజల నాగేశ్వరరావు నిర్మించే పి. ఎస్. ఆర్. పిక్చర్స్ కొత్త చిత్రానికి ఫిబ్రవరిలో పాటలు రికార్డవుతాయి. మార్చి 16 నుంచి ఏప్రిల్ 10 వరకు ఒకే షెడ్యూల్లో చిత్రీకరణ పూర్తవుతుంది.

★ సుందర్‌లాల్ నహతా సమర్పించే శ్రీకాంత్ పిక్చర్స్ 8వ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్ డిసెంబర్ 29 నుంచి జనవరి 5 వరకు కొచ్చిన్ ప్రాంతంలో జరిగింది. కొన్ని బోట్ ఛేజ్ సన్నివేశాలను గగుర్పాటు కలిగించే విధంగా చిత్రీకరించినట్లు నిర్మాత శ్రీకాంత్ నహతా తెలిపారు. అంతకు ముందు పాండిచ్చేరి సమీపాన కొన్ని కీలక సన్నివేశాలను తీశారట. చివరి షెడ్యూల్ జనవరి 19 నుండి ఫిబ్రవరి వరకు కొంత ఇన్‌డోర్‌లోనూ, కొంత ఔట్‌డోర్‌లోనూ జరుగుతుంది. కృష్ణ, జయప్రద, జయంతి, సత్యనారాయణ. నూతన్‌ప్రసాద్, కాంతారావు, మాస్టర్ వెంకటేశ్వర్లు నటిస్తున్నారు. ఎం. ఎస్. చక్రవర్తి కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాస్తున్నారు. వేటూరి గీతాలకు సత్యం స్వరకర్త. ఎస్. వి. శ్రీకాంత్ ఛాయ, సూర్యకుమార్ శిల్పం, డి. వెంకటరత్నం కూర్పు, ఎం. మోహన్‌తిలక్ సహకార దర్శకత్వంతో ఎస్. మణి, ఎస్. ఆర్. కె. మూర్తి నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

'కిరాయిబొమ్మలు'లో ప్రభ





'ఈ దేశంలో ఒకరోజు'లో రాజా, గీత.

# ఇరుగు - పొరుగు

★ బెంగళూరులో ప్రముఖ కన్నడ హీరో రాజ్‌కుమార్ యొక్క 80 అడుగుల బానర్‌ను ఆయన అభిమాన సంఘాల వారు నెలకొల్పిన విషయం వాచకులకు విదితమే. ఆ బానర్ "పాలు—తేనె" అనే కన్నడ చిత్రం తాలూకుది. ఇటీవల ఆ అభిమానులు పాలు, తేనెతో ఆ బేనర్‌కు అభిషేకం చేశారు.

★ కన్నడంలో పలుచిత్రాలు నిర్మించిన అబ్బాయి నాయుడు తొలుత తాపీమేస్త్రీగా నీతితో, నిజాయితీతో శ్రమించి, స్వశక్తితో కాంట్రాక్టర్ అయి, ఆ తర్వాత చిత్ర నిర్మాత అయ్యారు. ఈయన సంస్థ చిహ్నం 'తాపీ పనిముట్టు.' ఈయన స్వస్థలం చిత్తూరు. ఇప్పుడు "మూగినసేదు" అనే ఈయన కన్నడ చిత్రాన్ని తెలుగులో మోహన్‌బాబు హీరోగా బోయిన సుబ్బారావు దర్శకత్వంలో నిర్మించబోతున్నారు.

★ భీ శెట్టి కథ రాసిన "న్యాయగెద్దితు" (న్యాయం గెలిచింది) అనే కన్నడ చిత్రాన్ని వరుణా ఆర్ట్ క్రియేషన్స్ వారు నిర్మిస్తున్నారు. అంతకు ముందు భీ శెట్టి కథ సమకూర్చిన అజంతా కంబైన్స్ "ఊరిగె ఉపకారి" కన్నడ చిత్రం కర్నాటక రాష్ట్రంలో పది వారాలకు పైగా ప్రదర్శింపబడుతోంది.

★ అస్సాంలో చలన చిత్ర నిర్మాతలకు ప్రోత్సాహం కలిగించే నిమిత్తం ప్రతి అస్సామీ చిత్రానికి మొదటి సంవత్సరం వసూలయ్యే వినోదపు పన్ను మొత్తాన్ని ఆ చిత్ర నిర్మాతకే ఇవ్వడానికి అస్సాం ప్రభుత్వం నిర్ణయించింది.

★ గాయని వాణీజయరాం అసలు పేరు వాణీసుధ. ఈమె బి. ఎ. (ఎకనమిక్స్) పాసయింది. చదువుకునే రోజుల్లో వక్తృత్వ పోటీలలో, చిత్రలేఖనం, ఎంబ్రాయిడరీ పోటీలలో బహుమతులు పొందింది. ఉస్తాద్ అక్బర్ రెహమాన్‌ఖాన్ వద్ద హిందూస్థానీ శాస్త్రీయ సంగీతం అభ్యసించింది. ఈమెకు సూర్యరశ్మి అంటే ఎలర్జీ.

★ అరుణా ఇరానీ నటించిన "ఫుట్‌పాత్ ని రాణి" అనే గుజరాతీ చిత్రంలో 2,550 అడుగులు మళ్ళీ చిత్రీకరించవలసి వచ్చింది. షిలిప్ం షూటింగప్పుడు కెమెరా షట్టర్ కొద్ది రోజుల వరకు పని చేయకపోవడం ఎవరూ గమనించలేదట. అంచేత, ఆ మేరకు రీ షూట్ చేయవలసి వచ్చింది.

★ "అమర్ యౌవన్" అనే హిందీలో డబ్ చేయబడిన చిత్రాన్ని ఎనిమిది నెలల క్రితం సెన్సార్ వారు ఆమోదించలేదు. కాని, దాని మలయాళ మాతృక "వ్యానదస్ ధంపస్," తమిళ తర్జుమా "కన్నెవేట్టై"కి ఏ విధమైన అభ్యంతరం చెప్పకుండా హస్తముద్ర వేశారట. చివరికి కేంద్ర సమాచార ఆకాశవాణి మంత్రిత్వశాఖ నుంచి వచ్చిన ఆదేశానుసారం హిందీ డబ్బింగ్ చిత్రానికి మద్రాసు సెన్సార్ వారు సర్టిఫికేట్ ఇవ్వక తప్పలేదు.

# సినిమా

## ధనరాశి రంగారావు అండ్ సన్స్ (కువైట్) చిత్రం

"కొంత భాగం కువైట్‌లో చిత్రీకరించదలిచారు నిర్మాత ధనరాశి రంగారావుగారు. ఈయన గతంలో కాకినాడ వాస్తవ్యులు. ప్రముఖ జాతీయవాది. దేశభక్తుడు. ఇప్పుడు కువైట్‌లో ఉంటున్నారు. మన భారతీయ సంస్కృతిపై ఒక చక్కని చిత్రాన్ని పాత కొత్త తారలతో నిర్మించడానికి నిశ్చయించారు," అన్నారు డైరెక్టర్ టి. ఎస్. రామారావు. రంగూన్ రామారావుగా వాసికెక్కిన ఈయన ఎన్నో ఏళ్ళుగా ఈ చిత్ర పరిశ్రమలో ఉంటూ, సహాయ దర్శకుడుగా, సహ దర్శకుడుగా ఎన్నో విజయవంతమైన చిత్రాలకు పనిచేశారు. పై సంస్థ నిర్మించే చిత్రానికి సత్యం సంగీత దర్శకుడు. సిహెచ్. యజ్ఞనారాయణ ఛాయాగ్రాహకుడు. జనవరి నుంచి షూటింగ్ ఉంటుంది.

## శిల్పవా చిత్రాలయ తొలి చిత్రం

"రెగ్యులర్ షూటింగ్ డిసెంబర్ నెలాఖరు నుండి తూర్పుగోదావరి జిల్లాలో 25 రోజులపాటు నిర్విరామంగా జరుగుతుంది," అన్నారు గెద్దాడ ఆనందబాబు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో అట్లూరి రాజలింగం, మోహన్‌సింగ్ నిర్మించే చిత్రం షూటింగ్ ఇటీవల మద్రాసులో మొదలైంది. ప్రసాద్‌బాబు, లక్ష్మీకాంత్, హేమసుందర్, జయభాస్కర్, సారథి, రాళ్ళపల్లి, గోకిన రామారావు, శివకుమార్, జమ్మి రాజా, మోహన్‌సింగ్, లక్ష్మీరాణి, సరోజ పాత్రధారులు. గోపి, విజయరత్నం గీతాలు. ఎ. ఎ. రాజ్ స్వరకర్త. పార్థసారథి ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, నరసింహారావు కూర్పు, కె.ఎస్. వరప్రసాద్ సహకార దర్శకత్వంతో వాహినీ రామదాస్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు.

## నందం హరిశ్చంద్రరావు దర్శకత్వంలో విజయమాధవీ పిక్చర్స్ చిత్రం

"జయసుధ ఇంతవరకు ధరించిన పాత్రలన్నీ ఒక ఎత్తు. దర్శకునిగా తొలి అవకాశమిచ్చిన వడ్డే రమేష్‌గారు నిర్మించే కొత్త చిత్రంలో ఆమె ధరించే పాత్ర ఒక ఎత్తు. పైశాచ్యాన్ని, అరాచకాన్ని సహించలేని అబల — సబలగా ఎదురు తిరిగే బీభత్స రస ప్రధాన పాత్ర" అన్నారు డైరెక్టర్ నందం హరిశ్చంద్రరావు. ఈయన దాసరి నారాయణరావు ప్రియశిష్యుడు. పలుచిత్రాలకు సహదర్శకుడుగా పని చేశారు. "జనవరి 20న షూటింగ్ మొదలెడ్తాం. మార్చికి ముగుస్తుంది," అన్నారు నిర్వహణ బాధ్యతలు వహించే వడ్డే రమేష్. పరుచూరి సోదరుల సంభాషణలు, జె. వి. రాఘవులు సంగీతంతో ఈ విప్లవాత్మక చిత్రాన్ని వడ్డే కిశోర్ సమర్పిస్తారు. ★

# "మా అమ్మ అభాగ్యురాలిగా మరణించలేదు!"

"చలన చిత్ర ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్రవేసి, చిరంజీవిగా, చిరయశస్వినిగా జీవిస్తూన్న మహానటి, మా తల్లి సావిత్రి మాకు దూరమై నేటికి సరిగ్గా ఏడాది అయింది," అంటూ డిసెంబర్ 27 సాయంత్రం సావిత్రి కుమార్తె శ్రీమతి విజయచాముండేశ్వరి పాత్రికేయుల సమావేశం ఏర్పాటు చేసి, ఎన్నో విస్మయం గొలిపే విషయాలను వెల్లడి చేశారు :

"మా అమ్మ మృతి సమస్త ప్రజానీకాన్నీ కంటతడి పెట్టించింది. అది ఆమె భాగ్యం. మా అమ్మ ఏ విధంగానూ 'అభాగ్య' కాదు; అభాగ్య



రాలుగానూ అస్తమించలేదు. మా తమ్ముడ్నిగాని, నన్నుగాని రోడ్డుమీద నిలుచోబెట్టలేదు. ఆమె సంపాదించిన కోట్ల ఆస్తిని నిలబెట్టుకోలేక పోవచ్చునుగాని, నగల రూపంలోనైతేనేమి, ఇళ్ళ రూపంలోనైతేనేమి కొన్ని లక్షలు విలువ చేసే ఆస్తి మిగిల్చి వెళ్ళింది. అటువంటి మా కన్న తల్లి గురించి కొంతమంది చీకటి వ్యక్తులు పని గట్టుకుని నీచ ప్రచారం చేశారు. ఇన్నాళ్ళుగా నేను మౌనం పాటించడం కొంతమంది దగాకోర్లకు ఇష్టమొచ్చిన కథలు సృష్టించి సంపాదించుకోడానికి వీలు కలిగినందుకు ఎంతో విచారిస్తున్నాను.

మా అమ్మ మరణించే నాటికి దాదాపు పాతిక లక్షలు విలువ చేసే బంగారు, వజ్రాల నగలు ఉండాలి. ఇక వెండి లెక్కే లేదు. హైదరాబాద్‌లో ఒకటిన్నర ఎకరం స్థలంలో కనీసం 15 లక్షలు విలువ చేసే రెండు బంగళాలున్నాయి. విజయవాడ దగ్గరున్న ఒక స్పిన్నింగ్ మిల్‌లో ఒకటిన్నర లక్షల రూపాయల వాటాలున్నాయి. రెండు మూడు లక్షలకు పైగా విలువ చేసే చాలా అందమైన పూజా మందిరం, పాలరాతి విగ్రహాలు, ఇంకా ఎన్నో విలువైన వస్తువులు నేడు ఎవరి హస్తగతమయ్యాయి? ఎవరింట్లో ఉన్నాయి? మా అమ్మ ఇరవై మాసాలపాటు అపస్మారక స్థితిలో ఉండగా — అయిన వాళ్ళను ఆ దరికి రాకుండా చేసి, బీరువాలు బద్దలుకొట్టి, లాకర్లు తెరిచి, లక్షలు విలువచేసే బంగారు నగలు, వెండి సామానులు దొంగిలించుకు పోయిన ప్రబుద్ధులెవరు? ఆదాయం పన్ను శాఖకు మా అమ్మ బాకీ ఉన్న పది లక్షల రూపాయలకుగాను ఆమెకున్న ఇతర ఆస్తులన్నిటినీ వదిలేసి, నేనుంటున్న 'ఆస్తి'ని అటాచ్ చేయించడం ఎవరి పుణ్యం?

కన్న తండ్రిని గురించిన చేదు నిజాలను కన్నబిడ్డ బయట పెట్టవలసి రావడం కంటె దురదృష్టకరమైన విషయం మరొకటి లేదు. సావిత్రి నూరు తప్పులు చేసినా తాను క్షమించాననీ, ఆస్తి అంతా ఆమె పేర రాస్తానన్నా ఆమె రాయించుకోలేదనీ మా డాడీ నేడు ప్రచారం చేయిస్తున్నారు. 'తప్పు' అనే మాటకు ప్రతిరూపమే మా డాడీ! మా తల్లి చేసిన తప్పులేవైనా ఉంటే— అవి ఆయన ఆమె చేత చేయించినవే. అసలు మా తల్లి జీవితంలో చేసిన పెద్ద తప్పు ఏదైనా ఉంటే, అది మా డాడీని పెళ్ళి చేసుకోవడమేనని నేనంటే, మీలాంటి పెద్దలు నన్ను తప్పు పట్టబోరని ఆశిస్తాను. మా డాడీ తనను వంచించాడనే భావమే అమ్మను నిలువునా దహించి వేసింది. మా తల్లిని మత్తుకు బానిస చేసి, తన ఆశ్రిత బృందాన్ని ఆమె దగ్గర చేర్చి, లెక్కా పక్కా లేకుండా ఇంటిని యధేచ్ఛగా దోచుకున్న విషయం అబద్ధమా? ఎలాగూ చచ్చే మనిషికి వైద్య మెందుకని సరియైన వైద్య చికిత్స కూడా ఆమెకు డాడీ అందించక పోవడం అసత్యమా? బినామీ అయిన ఆస్తి నంతటినీ కొడుకుకు అప్పగించేలా చేస్తానని వాగ్దానం చేసి కూడా ఇంతవరకు మా డాడీ తన వాగ్దానాన్ని నిలుపుకోనక పోవడం అబద్ధమా? ఆస్తి ఎర చూపి, నా తమ్ముడ్ని తన వద్దే ఉంచుకొని, నా తమ్ముడు బయటకు వస్తే ఆస్తి దక్కనివ్వననే బెదిరింపుతో వాడ్ని అన్ని రకాల ఉచ్చుల్లో బంధించి ఉంచడం కల్లా? త్వరలోనే నిజానిజాలు బయటపడ్తాయి.



మా తల్లి సంపదనంతా దోచుకొని, దాచుకుని నేడు మొసలి కన్నీరు కారుస్తూ, ఆమెకు మిగిలిన ఉన్న కీర్తిని కూడా భ్రష్టు పట్టించి లాభం పొందాలని ప్రయత్నిస్తున్న గజదొంగలను బయటకు లాగి, చోరీ సొత్తును యథాస్థానంలో దాఖలు చేయించేలా కృషి చేయవలసినదిగా మా తల్లి మీద అభిమానం, మా మీద జాలిగల పెద్దలందరినీ కోరుతున్నాను. అలా చేయడం ద్వారా మా అమ్మ ఆత్మకు శాంతి, మా కుటుంబానికి న్యాయం కలుగజేయగలరని విశ్వసిస్తున్నాను."

## మహానటి సావిత్రి కుమార్తె విజయచాముండేశ్వరి వెల్లడించిన విషయాలు!




## నాటి నుంచీ నేటి వరకూ 'కృష్ణ'

కృష్ణ ... పద్దెనిమిదేళ్ళు ... రెండు వందల చిత్రాలు! 1964 లో "తేనెమనసులు" చిత్రం ద్వారా హీరోగా ప్రవేశించిన కృష్ణ, యీ పద్దెనిమిదేళ్ళలోను రెండువందల చిత్రాలు పూర్తి చేశారు. స్వర్గీయ ఆదుర్తి, శ్రీ డూండీ అతని భవిష్యత్తుకోసం తొలి రోజుల్లో ఎంతగానో కృషి చేశారు. ఈ రెండు దశాబ్దాల కాలంలోను నటుడుగా తనకో గుర్తింపు కోసం కృష్ణ చేసిన కృషి కూడా అద్వితీయమైనది; గణనీయమైనది.

కృష్ణ నటించిన 100 వ చిత్రం 'అల్లూరి సీతారామరాజు' నటుడుగా అతన్ని ఉన్నత శిఖరాలకు తీసుకు వెళ్ళింది. అది అతని జీవితంలో లాండ్ మార్క్. మరచిపోలేని గొప్ప చిత్రమది. ఇటీవల విడుదలైన అతని 200 వ చిత్రం 'ఈనాడు' కూడా లాండ్‌మార్కే! ఇది కూడా ఎంతో విజయవంతమై నటుడుగా కృష్ణకు గొప్ప పేరు తీసుకు వచ్చింది.

నటుడుగానే కాదు, నిర్మాతగా కూడా కృష్ణ ఎన్నో విజయాలను సాధించారు. మొట్టమొదటి సారిగా ఏడేళ్ల క్రితం స్టూడియో కట్టాలన్న సంకల్పం ఆయనలో మొలక ఎత్తింది. దాన్ని విజయవాడ, గుంటూరుల మధ్య కట్టాలనుకున్నారు. అందుకోసం స్థలం చూసి ప్రభుత్వాన్ని స్టూడియో నిర్మాణానికి ఆ స్థలం మంజూరు చేయవలసిందిగా కోరారు. ఎంతో ఉత్సాహంతో, ఆంధ్రదేశపు నడిబొడ్డులో స్టూడియో రూపొందించాలనుకున్న కృష్ణకు—నాలుగైదేళ్ళు నిరీక్షించిం తర్వాత ఆ ఉత్సాహం సన్నగిల్లేదాకా ప్రభుత్వం ఆయనకు స్థలం మంజూరు చేయలేదు. ఆయన ఇక విరమించుకుందామనే నిర్ణయానికి వచ్చాక ప్రభుత్వం అనుమతి యిచ్చింది.



ఆ తర్వాత యిటీవల ప్రభుత్వం తీవ్రంగా సినిమా పరిశ్రమను రాజధానికి తరల్చాలనే నిర్ణయానికి వచ్చి కృష్ణగారికి స్టూడియో నిర్మాణానికి హైదరాబాద్‌లో స్థలం కేటాయించింది. దాన్ని ఆయన తక్షణమే ఇంప్లిమెంట్ చేశారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రావ్ దానికి శంకుస్థాపన చేశారు. ఇపుడు కొత్త సంవత్సరంలో పండగ పర్వదినాన 'పద్మాలయా స్టూడియోస్' ప్రారంభం కానున్నది. "ఇపుడు మొదట రెండు ఫ్లోర్స్ ప్రారంభిస్తున్నాను. ఒకటి పెద్ద ఫ్లోర్, రెండవది చిన్న ఫ్లోర్. ఉగాదికి పద్మాలయా స్టూడియోస్ (ప్రై)లిమిటెడ్ 'పేరున మా స్వంత చిత్ర నిర్మాణం ప్రారంభిస్తున్నాము"అన్నారు కృష్ణ. ఈ మాటలంటున్నపుడు ఆయన మొహంలో ఎంతో కళ కనిపించింది. ఏడేళ్లనాడు ఆయన కన్నకల యివాళ నిజం కాబోతున్నది. అనుకొన్నది సాధించే వరకూ నిద్రపోని అవిరళ కృషి వుంది. అందుకే అంత గొప్ప వ్యక్తిత్వాన్ని సంతరించుకో గలిగారు "ఈనాడు" కృష్ణ.

### విజయవంతమైన చిత్రాలు!

కిందటి సంవత్సరం విడుదలైన డైరెక్ట్ టేక్ చిత్రాలు 87. అందులో విజయవంతంగా ప్రదర్శింపబడినవి 26 చిత్రాలు. అవి: అనురాగదేవత, బంగారుభూమి, మరోమలుపు, గృహప్రవేశం, క్షేమ మూర్తులు, జస్టిస్‌చౌదరి, శుభలేఖ, ప్రతిజ్ఞ, బొబ్బిలిపులి, ప్రతీకారం, నాలుగు స్తంభాలాట,

## కృష్ణ కొత్త చిత్రాలు!

ఈ సంవత్సరం జనవరి నుంచి సెప్టెంబర్ వరకూ కృష్ణ 8 కొత్త చిత్రాలలో నటించడానికి అంగీకరించి కాల్‌షీట్స్ యిచ్చారు. వాటి వివరాలు యిక్కడ యిస్తున్నాము. కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఏ. గోపాలకృష్ణ నిర్మిస్తున్న గోపీ మూవీస్ ద్వితీయ చిత్రం జనవరి 1న ప్రారంభం అయింది. రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ పతాకంపై మిద్దే రామారావు ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో నిర్మించే 'రామరాజ్యంలో భీమరాజు' ఫిబ్రవరి నుంచీ ... శశిరేఖా మూవీస్ పతాకంపై విజయనిర్మల దర్శకత్వంలో పి. బాబ్జి నిర్మించే చిత్రం మార్చి నుంచి ... రంజిత్ క్రియేషన్స్ పతాకంపై కానూరి రంజిత్‌కుమార్ విజయనిర్మల దర్శకత్వంలో నిర్మించే 'లంకెల బిందెలు' ఏప్రిల్ 16 నుంచి ... కృష్ణ పద్మాలయా స్టూడియోస్ పతాకంపై ఎం. మల్లికార్జునరావు దర్శకత్వంలో నిర్మించే తొలి చిత్రం మార్చి నుంచి ... నటుడు సత్యనారాయణ సమర్పణలో కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో కె. నాగేశ్వరరావు రమా ఫిలింస్ పతాకంపై నిర్మించే చిత్రం ఏప్రిల్‌లో ప్రారంభించి రెగ్యులర్ షూటింగ్ జూన్ నుంచి ... యస్. ఆర్. ఫిలిమ్స్ పతాకంపై శాఖమూరి రామచంద్రరావు — ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో నిర్మించే చిత్రం జూలై 11 నుంచి ... విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ పతాకంపై టి. త్రివిక్రమరావు — దాసరి నారాయణరావు దర్శకత్వంలో నిర్మించే చిత్రం సెప్టెంబరు నుంచీ ప్రారంభం అవుతాయి.

ఇందులో — గోపీ మూవీస్‌లో జయసుధ, రాధ — 'రామరాజ్యంలో భీమరాజు'లో శ్రీదేవి, శశిరేఖా మూవీస్‌లో జయసుధ, లంకెలబిందెలులో జయసుధ, పద్మాలయా స్టూడియోస్ చిత్రంలో జయప్రద, రమా ఫిలింస్‌లో రాధ, యస్. ఆర్. ఫిలింస్‌లో జయసుధ, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌లో శ్రీదేవి నాయికలు.

నిర్మాణంలో ఉన్నవి : సురేష్ ప్రొడక్షన్స్ 'ముందడుగు' దర్శకత్వం : బాపయ్య, నాయిక జయప్రద. శ్రీకాంత్ పిక్చర్స్ చిత్రానికి కె. యస్.ఆర్. దాస్ దర్శకుడు. నాయిక జయప్రద. వైజయంతీ మూవీస్ 'అడవి సింహాలు'. దర్శకత్వం : కె. రాఘవేంద్రరావు, నాయిక శ్రీదేవి.

నిర్మాణం పూర్తి అయినవి : 'ఊరంతా సంక్రాంతి'. దర్శకత్వం: దాసరి నారాయణరావు, నాయిక శ్రీదేవి. రాం ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ 'కిరాయి కోటిగాడు'. దర్శకత్వం : ఏ. కోదండరామిరెడ్డి, నాయిక శ్రీదేవి. రంజిత్ ఆర్ట్స్ 'చట్టానికి వేయి కళ్ళు'. దర్శకత్వం : విజయనిర్మల, నాయికలు జయసుధ, మాధవి.



'దుర్గాదేవి'లో జయసుధ

ఈ చరిత్ర ఏ సిరాతో, పగబట్టిన సింహం, దేవత జగ్గు, పట్నంవచ్చిన పతివ్రతలు, యమకింకరుడు, నాదేశం, ఇల్లాలి కోరికలు, తరంగిణి, కదలివచ్చిన కనకదుర్గ, కొత్తనీరు, కలవారి సంసారం, ఈనాడు, డాక్టర్—సినీయాక్టర్, స్వయంవరం. ఈ ఇరవై ఆరు చిత్రాల్లోను యన్. టి. ఆర్. వి 4, కృష్ణవి 5, శోభన్‌బాబువి 5, కృష్ణంరాజ 1, చిరంజీవి వి 4, మోహన్‌బాబువి 3, ఉన్నాయి. ఇవి వారు నాయకులుగా నటించినవి. వీటిలో రెండు చిత్రాలు — కొత్తనీరు, కదలివచ్చిన కనకదుర్గ రెగ్యులర్ షోస్‌గా కాక, మధ్యాహ్నపు ఆటలుగా ప్రదర్శించారు. మరో రెండు చిత్రాలు— మరో మలుపు, ఈ చరిత్ర ఏ సిరాతో హీరో లేక హీరోయిన్ ఓరియంటెడ్ సబ్జెక్ట్స్ కావు. దర్శకుడు (వేజెళ్ల) ప్రతిభపైనా, బలమైన కథ కలిగిన చిత్రాలు.

పోతే — సంవత్సరం ప్రారంభం రెండవ వారం చివరలో (సంక్రాంతికి) విడుదలైన బంగారుభూమి, సంవత్సరం చివరినెల మొదటివారంలో విడుదలైన 'కలవారి సంసారం', 83 ప్రారంభానికి మరో రెండు వారాలు ఉన్నదనగా విడుదలైన 'ఈనాడు' చిత్రాలు కృష్ణకి సూపర్ హిట్ చిత్రాలు. ఇందులో మొదటి రెండు చిత్రాలు — ఒకే వ్యక్తి (యస్. పి. వెంకన్న బాబు) ఆధ్వర్యంలో రూపొందడం ఒక విశేషం. ఈ విజయవంతమైన చిత్రాలలో ఆరింటిలో శ్రీదేవి, ఆరింటిలో జయసుధ, మూడింటిలో జయప్రద నటించారు.

## 'కొత్త చిత్రాల' ముమ్మరం!

కొత్త సంవత్సరం పరిశ్రమకు ఆశాజనకంగానే కనిపిస్తున్నది. కొత్తచిత్రాల నిర్మాణం ముమ్మరంగా ప్రారంభం అయింది జనవరి 1న గోపీ మూవీస్ వారి ద్వితీయ చిత్రం షూటింగ్, రికార్డింగ్‌లతో మొదలయింది. కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఎ. గోపాలకృష్ణ నిర్మిస్తున్న యీ చిత్రంలో కృష్ణ, జయసుధ, రాధ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, గొల్లపూడి, గిరిబాబు ముఖ్య పాత్రలు. తొలి షెడ్యూలు వారంరోజులపాటు జరిగింది. రెండు పాటలు, కొన్ని ముఖ్య సన్నివేశాలు చిత్రీకరించారు. శ్రీ కాంతి చిత్రవారి కొత్తచిత్రం జనవరి 5న సాంగ్ రికార్డింగ్‌తో ప్రారంభం అయింది. ఈ చిత్రం కోసం ఊటీ వాటర్ ఫాల్స్ దగ్గర ఆశ్రమం సెట్‌వేశారు. జనవరి 16 నుంచి అక్కడ షూటింగ్ ప్రారంభించి, తొలి షెడ్యూల్ ఫిబ్రవరి 3 వరకు జరుపుతారు. రాధిక, చిరంజీవి, జగ్గయ్య, రావు గోపాలరావు, గొల్లపూడి, గిరిబాబు ముఖ్య తారాగణం. క్రాంతికుమార్ నిర్మిస్తున్న యీ చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు. బలమైన ఇతివృత్తాలను చిత్రాలుగా నిర్మించి మహిళల్లో సాంఘిక చైతన్యాన్ని తీసుకొచ్చిన క్రాంతికుమార్ యీసారి సెమీఫోక్‌లోర్ పై చిత్రాన్ని నిర్మిస్తూండడం విశేషమే! విజయ బాపినీడు — శ్యామ్ ప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ పతాకంపై 'మగ మహారాజు' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. చిరంజీవి, సుహాసిని, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్ తారలు. రావుగోపాలరావు ద్విపాత్రాభినయం చేస్తున్న యీ చిత్రానికి మౌళి దర్శకుడు. జనవరి 6న పూజ జరిపారు. బాపినీడుగారి అన్ని చిత్రాల వలెనే ఇదీ ఏలూరు, ఆ పరిసరప్రాంతాలలో షూటింగ్ జరుపుకొంటుంది. ఆయన కిందటేడు నిర్మించిన 'పట్నం వచ్చిన పతివ్రతలు' బాక్సాఫీసు దగ్గర మంచి వసూళ్లను పోగుచేసింది. చడీ చప్పుడూ లేకుండా బోలెడంత కలెక్ట్ చేసింది. రెండేళ్ల నాడు ప్రారంభం అయిన విజయ మాధవీవారి ఐదో చిత్రం 'బాబులుగాడి దెబ్బ' చివరి షెడ్యూలు జనవరి 2న ప్రారంభమై 12కి పూర్తి అయింది. కృష్ణంరాజు, శ్రీదేవి, రాధిక, రావు గోపాలరావు, సత్యనారాయణ, త్యాగరాజు, జ్యోతిలక్ష్మి, ప్రభాకరరెడ్డి ముఖ్య తారలు. వడ్డే శోభనాద్రి నిర్మిస్తున్న యీ చిత్రానికి కె. వాసు దర్శకుడు. వడ్డే రమేష్ నిర్వాహకుడు. విజయమాధవీ సంస్థ తమ ఆరవ చిత్రం 'దుర్గాదేవి'ని జనవరి 20 నుంచి ప్రారంభిస్తున్నది. టైటిల్ రోల్‌ని జయసుధ పోషిస్తున్నది. నందం హరిశ్చంద్రరావు దర్శకుడు. ఈ యువకుడు ప్రముఖ దర్శకుడు దాసరి నారాయణ రావు దగ్గర దర్శకత్వపు శాఖలో శిక్షణపొంది, ఆయన వద్దనే పలుచిత్రాలకు కో—డైరెక్టర్‌గా పనిచేశారు. మరో మూడు నాలుగు కొత్తచిత్రాలు ఈ నెలలోనే ప్రారంభం కానున్నాయి.

— మోహన్ కుమార్



'కిరాయి కోటిగాడు'లో శ్రీదేవి, కృష్ణ. ➔

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్



(గత సంచిక తరువాయి)

**జరిగిన కథ — 12 :** మిస్ మీనామ్ముర్రే, మిస్ లూసీ ఒకరికొకరు తమ తమ విషయాలను ఉత్తరాల ద్వారా తెలియపర్చుకొంటారు. క్విన్సీ పి. మోరిస్‌కు ఆర్థర్ హోల్మ్‌వుడ్ తన దగ్గర వళ్ళు జలదరించే కబుర్లు వున్నాయని, తనకోసం ఎదురుచూడమని టెలిగ్రాం ఇస్తాడు. మిస్ మీనా తన డైరీలో, జోనాథన్ దగ్గరనుంచి ఎటువంటి సమాచారం అందకపోవడంతో దిగులుచెందుతున్నట్లు రాసుకొంటుంది. 'ది డైలీ టెలిగ్రాఫ్' పత్రిక నుండి కత్తిరించి, మీనామ్ముర్రే డైరీలో అంటించిన ముక్కలలోని సారాంశం వివరిస్తున్నారు. తుఫాను తాకిడికి ఒడ్డుకు కొట్టుకొచ్చిన ఓడలోని శవం జేబులో వున్న కాగితంలోని విషయాలనుబట్టి, అతను పుస్తకంలో రాసినదాన్నిబట్టి కొంత సమాచారం బయట పడుతుంది. ఆ ఓడలో మొత్తం తొమ్మిదిమంది ప్రయాణం చేస్తుంటారు కెప్టెన్‌తోసహా. దారిలో ఒక్కొక్కళ్ళు మాయమవుతూ వుంటారు. చివరికి కెప్టెన్, మరో ముగ్గురు మిగుల్తారు. అందరితోపాటు చివరకు అతనుకూడా చనిపోతాడు. కానీ ఇదంతా ఎవరు చేశారో, లేక కెప్టెనే చంపేసి తాను ఆత్మహత్య చేసుకొన్నాడో తెలియదు. మీనా లూసీని జాగ్రత్తగా కాపాడుతుంటుంది. జోనాథన్ హార్కర్ సెయింట్ జోసెఫ్, సెయింట్ మేరీ హాస్పటల్‌లో కోలుకుంటున్నాడని సిస్టర్ అగథా ఉత్తరం ద్వారా తెలుసుకొన్న మీనా మనసు కొంతవరకు కుదుట పడుతుంది. జోనాథన్, మీనా వివాహం చేసుకొంటారు. లూసీ ఆరోగ్యం గురించి జాన్ సెవార్డు ఆర్థర్ హాల్మ్‌వుడ్‌కి తెలియజేస్తుంటాడు. లూసీ పరిస్థితి దయనీయంగా వుంది. ఆమె వంట్లో రక్తం చాలా తక్కువగా వుంది. అందువల్ల ఆమెకు రక్తం ఎక్కించటానికి ప్రయత్నాలు చేస్తుంటాడు ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్.

## డాక్టర్ సెవార్డు డైరీ (సెప్టెంబర్, 7 లోని తరువాయి భాగం)

ఆర్థర్ లోపలికొచ్చాడు గబగబా. తిన్నగా నా దగ్గరకు వచ్చాడు.

''జాన్, నాకు చాలా ఆదుర్దాగా వుంది. నీ ఉత్తరం చూసుకున్నాను. నాకు చాలా బాధేసింది. మా నాన్నకి కాస్త కులాసాగానే వుంది. అందుకే ఇక్కడికి పరుగెత్తుకొచ్చాను చూద్దామని. ఈయన డాక్టర్ వాన్‌హెల్సింగ్ కదూ? మీరు ఇక్కడ కొచ్చినందుకు ఎంతో కృతజ్ఞతలు సర్!'' అన్నాడు ఆర్థరు. మధ్యలో వచ్చి పనికి ఇబ్బంది కలిగించినందుకు వాన్ హెల్సింగ్‌కి కాస్త కోపం వచ్చింది. కానీ అతని ఒడ్డూ పొడుగూ, యవ్వనం, బలం చూడగానే వాన్ హెల్సింగ్ కళ్ళు మెరిసాయి. వెంటనే అతని చేయి పుచ్చుకుని చాలా గంభీరంగా చెప్పాడు. ''మీరు మంచి సమయంలో వచ్చారు. లూసీని ప్రేమించినవారు మీరేకదా! ఆమె పరిస్థితి బాగో లేదు. ఏమాత్రం బాగోలేదు. పాపం, ఆ పిల్ల అట్లా పోవడానికి వీల్లేదు'' అన్నారు. అట్లా అంటున్నప్పుడు హెల్సింగ్ మొహం పాలిపోయింది. నిలబడలేక అక్కడే ఒక కుర్చీలో కూలబడిపోయాడు. ''మీరే ఆమెను కాపాడాలి. ఇక్కడున్నవాళ్ళలో అందుకు తగినవారు మీరే! మీ ధైర్యం ఆమెను కాపాడుతుంది'' అన్నాడు.

''నేనేం చెయ్యాలో చెప్పండి'' బొంగురు పోయిన గొంతుకతో అన్నాడు. ''మీరు ఏం చెయ్యమంటే అది చేస్తాను. నా ప్రాణం ఆమె కిస్తాను; నా వొంట్లో చివరి రక్తపుబొట్టు ఆమె కిస్తాను'' అన్నాడు. దానికి ప్రొఫెసరు కాస్త హాస్యరసంతో జవాబిచ్చాడు. పూర్వానుభవంవల్ల అది నా ఒక్కడికే తెల్సు!

''మీ చివరి రక్తంబొట్టు వరకూ అడగను'' అన్నాడు.

''నేను ఏంచెయ్యాలో చెప్పండి'' అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. అతను వణుకుతున్నాడు. వాన్ హెల్సింగ్ అతని భుజం తట్టాడు. ''రండి'' అన్నాడు. ''మగాడంటే మీరే! మీలాంటివాళ్ళే ఇప్పుడు మాక్కావాలి! మీరు నాకంటే చాలా మెరుగు. నా మిత్రుడు జాన్ కన్నా మెరుగు.'' అన్నాడు. అతను విస్తుపోతూ చూసాడు. వాన్ హెల్సింగ్ మెల్లగా చెప్పసాగాడు.

''ఆ పిల్లకు ఏమీ బాగాలేదు. బొత్తిగా బాగా లేదు. ఆమె కిప్పుడు రక్తం కావాలి. లేకపోతే చనిపోతుంది. జాన్, నేనూ ఈ విషయం గురించి సంప్రదించుకున్నాం. ఆమెకు రక్తం ఎక్కించే ప్రయత్నం చేద్దామనుకుంటున్నాం. రక్తంతో నిండిన నరాల నుండి రక్తంలేని ఆమె నరాల్లోకి రక్తం వెళుతుంది. రక్తం ఇచ్చినవాళ్ళకు ఇది ఎంతో బాధను కలుగజేస్తుంది. జాన్ తన రక్తాన్ని ఇవ్వడానికి సిద్ధంగా వున్నాడు, ఎందుకంటే అతను నాకన్నా వయసులో వున్నాడు. బలంగా వున్నాడు'' అన్నాడు. ఆ సమయంలో ఆర్థర్ నా చెయ్యిని ఎంతో ఆప్యాయంగా నొక్కాడు. ''కానీ ఇంతలో మీరు వచ్చారు. మా ఇద్దరికన్నా మీరు నయం మా నరాలు మౌనంగా లేవు. మారక్తంలో మీ అంత మెరుపులేదు'' అన్నాడు హెల్సింగ్.

ఆర్థర్ అతనివంక తిరిగి ''ఆమె కోసం నా ప్రాణాన్ని అయినా సంతోషంగా ఇవ్వడానికి సిద్ధంగా వున్నానని మీకు తెలిసే వుంటుంది'' అన్నాడు.

''గుడ్ బాయ్! ఆమెను కాపాడి, తర్వాత మీరే ఎంతో సంతోషపడతారు. రండి. మౌనంగా వుండండి. ఒక్కసారి ఆమెను ముద్దు పెట్టుకోండి. అంతా అయిన తర్వాత మీరు ఇక్కడ వుండకూడదు. నేను వెళ్లమని చెప్పగానే వెళ్ళిపోవాలి. ఈ విషయం లూసీ తల్లికి చెప్పకూడదు. ఇటువంటి విషయాలు ఆమె ఆరోగ్యానికి ఎంత చెడుపు చేస్తుందో మీకు తెలుసు. ఆమెకు అసలు ఆందోళన కలిగించకూడదు. రండి'' అన్నాడు వాన్ హెల్సింగ్.

ఇద్దరం లూసీ గదిలోకి వెళ్లాం. ఆర్థర్ని బయటే వుండమని చెప్పాం. లూసీ తల కాస్త తిప్పి మమ్మల్ని చూసింది. ఆమె ఏమీ మాట్లాడలేదు. ఆమె నిద్ర పోవడంలేదు. చాలా బలహీనంగా వుండడంచేత ఆమెకు నిద్ర రావడంలేదు. ఆమె కళ్ళు మాతో మాట్లాడాయి. అంతే. వాన్ హెల్సింగ్ తన సంచీలోనించి కొన్ని పరికరాలు తీసి చిన్న టేబుల్ మీద కనపడకుండా పెట్టాడు. మత్తుమందు కలిపాడు. తర్వాత ఆమె మంచం దగ్గర కెళ్ళి చిర్నవ్వుతో ''చూడమ్మా! ఈ మందు మంచి పాపాయిలా తాగేయాలి. నేను మందు పోస్తాను. నువ్వు గుటక వేసేయ్,'' అన్నాడు. ఆమె అలాగే చేసింది.

మందు పనిచేయడానికి అంతసేపు పట్టడం దేమిటా అని ఆశ్చర్యపోయాను. ఎంతసేపటికీ ఆమెకు మత్తు రాలేదు. మొత్తానికి ఆమె కళ్ళు మత్తుగా చూసాయి. కాసేపటికి ఆమె గాఢనిద్రలో మునిగిపోయింది. వాన్ హెల్సింగ్ ఆమె స్థితికి తృప్తిపడ్డ తర్వాత ఆర్థర్‌ని లోపలికి పిల్చాడు. అతని కోటు తీసెయ్యమని చెప్పాడు. ''టేబుల్ ఈ ప్రక్కకు తీసుకువస్తాను. ఈ లోపున ఆమెను ఒకసారి ముద్దు పెట్టుకో. ఏమోయ్ జాన్, నాక్కాస్త సాయంపట్టు'' అన్నాడు. మే ఇద్దరం టేబులు పడుతుండగా, అతడు ఆమె మీదకు వంగడం చూడలేదు.

వాన్‌హెల్సింగ్ నాతో అన్నాడు ''అతను చాలా

యువకుడు. బాగా బలంగా వున్నాడు. అతనిది చాలా మంచి రక్తం, పరీక్షించ నక్కరలేదు.''

తొందరగానైనా, పద్ధతి ప్రకారం వాన్‌హెల్సింగ్ లూసీ శరీరంలోకి ఆర్థర్ రక్తం ఎక్కించాడు. రక్తం ఎక్కిస్తుండగా, లూసీ చెంపల్లో కాస్త జీవం కనపడసాగింది. ఒక ప్రక్క ఆర్థర్ మొహం పాలిపోయివుంది. అయినా అతని మొహంలో కొంత సంతోషం కనపడుతూనే వుంది. కాసేపటికి నాలో కంగారు పుట్టింది, ఆర్థర్‌కు ప్రమాదం జరుగుతుందేమోనని. అంత బలమైన ఆర్థర్ నీరసించి పోయేంత రక్తం లూసీ శరీరంలోకి ఎక్కించినా, ఆమెలో సగం మాత్రమే జీవంవచ్చింది. దీన్ని బట్టి లూసీ ఎంత రక్తం కోల్పోయిందో అనిపించింది. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ తన వాచీ చూసుకుంటూ, లూసీని, ఆర్థర్‌ను కూడా గమనిస్తున్నాడు. నా గుండె కొట్టుకోవడం నాకే వినిపించ సాగింది. వాన్‌హెల్సింగ్ నెమ్మదిగా అన్నాడు ‘‘ఓ క్షణం కదలవద్దు. ఇక చాలు. నువ్వు ఆతడ్ని చూడు. నేను ఈమెను చూస్తాను.'' అంతా అయిన తర్వాత ఆర్థర్ ఎంత బలహీనుడయ్యాడో గమచించాను. రక్తం తీసినచోట అతనికి కట్టుకట్టి, అతని చెయ్యి పుచ్చుకుని మెల్లగా బయటకు తీసుకెళుతుండగా వాన్‌హెల్సింగ్ అన్నాడు ‘‘ఇతను గొప్ప సాహసవంతమైన ప్రియుడు. అతను ఇప్పుడు మరో ముద్దు పెట్టుకోవచ్చు.''

వాన్‌హెల్సింగ్ లూసీ తలగడ సర్ది, ఆమెను సరిగా పడుకోపెట్టాడు, ఆపరేషన్ అయిపోయింది గాబట్టి. అట్లా చేస్తుండగా ఎప్పుడూ ఆమె మెడకు కట్టుకుని వుండే నల్లటి వెల్వెట్ బాండ్ కొద్దిగా పైకి జరిగింది. దానికి వజ్రపు బకిల్ వుంది. ఆర్థర్ దానిని ఆమెకిచ్చాడు. అట్లా పైకి జరిగినప్పుడు, గొంతు దగ్గర ఎర్ర గుర్తు కనపడింది. ఆర్థర్ దానిని గమనించలేదు. ప్రొఫెసర్ మాత్రం గట్టిగా గాలి పీల్చాడు. ఉద్రేకం వచ్చినప్పుడు ఆయన అలా చేస్తాడు. క్షణం సేపు మౌనంగా వుండి, తర్వాత నావంక తిరిగి, ‘‘ఇతన్ని క్రిందికి తీసుకెళ్ళి పోర్ట్ వైన్ ఇచ్చి, కాసేపు పడుకోబెట్టు. తర్వాత ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోమను. అతను బాగా నిద్రపోవాలి. బాగా తినాలి. అట్లా అయితేనే గానీ మళ్ళా మామూలు స్థితికి రాలేడు. అతను మాత్రం ఇక్కడ వుండటానికి వీలులేదు. ఒక్క క్షణం ఆగు.'' అంటూ ఆర్థర్ వైపు తిరిగి ‘‘ఇప్పుడు జరిగిన ఆపరేషన్ ఏమయిందోనన్న ఆతృత వుంది మీకు ఆపరేషన్ విజయవంతమైంది. మీరు ఆమె ప్రాణాన్ని రక్షించారు. మీరు ఇంటికెళ్ళి హాయిగా విశ్రాంతి తీసుకోండి. ఆమె కోలుకున్న తర్వాత మీ గురించి చెప్తాను. మీరు చేసిన సహాయానికి ఆమె మిమ్మల్ని తప్ప మరెవ్వర్ని ప్రేమించదు. గుడ్ బై'' అన్నాడు.

ఆర్థర్ వెళ్ళిపోయిన తర్వాత మళ్ళీ నేను గదిలోకి తిరిగి వచ్చాను. లూసీ నిద్రపోతోంది. ఆమె శ్వాస బాగా వినపడుతోంది. ఆమె రొమ్ములు కదులుతున్నాయి. వాన్‌హెల్సింగ్ ఆమె మంచం మీద ఒక పక్కగా కూర్చుని, ఆమెను పరీక్షగా చూసాడు. మెళ్ళోని వెల్వెట్ బాండ్, ఎర్రటి గుర్తును కప్పేసింది ప్రొఫెసర్ని మెల్లగా అడిగాను ‘‘దేంతో ఆమె మెడకు అట్లా గుర్తుపెట్టారు ?''

‘దేనితోనో గుర్తు పెట్టడమా ?' అన్నాడు.

‘‘నేను పరీక్షగా చూడలేదు ...'' అన్నాను. వెంటనే ఆ వెల్వెట్ బాండ్‌ను విప్పాడు. గొంతు క్రింద ఎముక దగ్గర రెండు గాట్లు వున్నాయి. పెద్దగా లేవు. అదిజబ్బుకు సంబంధించినది కాదు. ఆ గాట్ల చివర్లు తెల్లగా వున్నాయి, ఏదో పొడి చల్లినట్టుగా. వెంటనే నా కనిపించింది, ఈ గాయంవల్లే ఆమె రక్తాన్ని కోల్పోతోందని. కానీ ఆ ఆలోచన నుండి వెంటనే విరమించుకున్నాను, ఎందుకంటే, అట్లా ఎప్పుడూ జరగదు గాబట్టి. అట్లా జరిగివుంటే, ఆమె మంచం అంతా రక్తంతో నిండిపోయి వుండేది కదా.

‘‘చూసావా ?'' అడిగాడు.

‘‘చూసాను. కానీ నాకేమీ తట్టడంలేదు'' అన్నాను. ప్రొఫెసర్ లేచి నిలబడ్డాడు. ‘‘ఈ రోజు రాత్రికే నేను ఆంస్టర్‌డామ్ వెళ్ళిపోవాలి. అక్కడ నాక్కావలసిన పుస్తకాలు, వస్తువులు వున్నాయి. రాత్రి అంతా నువు ఇక్కడే వుండాలి. ఆమె నుంచి నా దృష్టిని మరో వైపుకు మరల్చకూడదు'' అన్నాడు.

‘‘పోనీ నర్సును పెట్టనా ?'' అడిగాను.

‘‘గొప్ప నర్సులం మనమే. నువ్వూ, నేను !



రాత్రి అంతా ఆమెను గమనిస్తూవుండాలి నువ్వు. ఆమెకు బాగా,ఆహారం ఇవ్వు. ఆమె ప్రశాంతతకు భంగం రాకుండా చూడు. నువ్వు రాత్రి అంతా మేల్కొనే వుండాలి. తర్వాత మనం నిద్రపోవచ్చు. నేను వీలయినంత త్వరగా తిరిగివస్తాను. తర్వాత మళ్ళీ మనం ప్రారంభిద్దాం'' అన్నాడు.

''ప్రారంభిద్దామా ? ఏవిటీ ప్రారంభించేది ?'' అడిగాను ఆశ్చర్యంగా.

''అదేవిటో చూద్దాం'' అంటూ అతను హడావిడిగా బయటకు వెళ్లిపోయాడు. అతను మళ్లా వెనక్కి వచ్చి తలుపుల మధ్యలో తల వుంచి, వేలితో హెచ్చరిస్తూ అన్నాడు, ''ఆమెను నీ ఆధీనంలో వుంచాను, గుర్తుంచుకో! ఆమెను వదిలావంటే మాత్రం, మళ్ళీ ప్రమాదంలో పడిపోతుంది. నువ్వు మాత్రం నిద్రపోవడానికి వీల్లేదు ''

సెప్టెంబర్ 8 : రాత్రి అంతా మేల్కొని లూసీతో కూర్చున్నాను. ఆమెకిచ్చిన మత్తుమందు చీకటి పడేవేళవరకు పనిచేసింది. తర్వాత మేల్కొంది. ఆపరేషన్‌కు ముందు ఎలా వుందో అందుకు భిన్నంగా కనపడింది. ఆమెలో కళ వచ్చింది. కాస్త సంతోషం కనిపించింది. కానీ ఆమె ఎంత నరకయాతనకు లోనయిందో ఆ ఛాయలు నాకు కనపడుతూనే వున్నాయి. లూసీ తల్లికి నేను లూసీ గదిలో వుండవలసిన సంగతి చెప్పాను. దానికెంతో ఆమె గొణుక్కుంది. ఆమెకిప్పుడు బాగానే వుంది కదా అంది. డాక్టర్ వాన్‌హెల్సింగ్ అట్లా చెప్పాడని చెప్పాను. అయినా ఆమెను పట్టించుకోలేదు. నేను ఆమెతోపాటు గదిలో వుండటానికి నిశ్చయించుకున్నాను. పనిమనిషి లూసీ పడక సర్దుతున్నప్పుడు నేను బయటకు వచ్చి భోజనం ముగించాను. తర్వాత లూసీ మంచం పక్కన కూర్చున్నాను. అందుకు ఆమె అభ్యంతరం చెప్పలేదు. పైగా ఎంతో కృతజ్ఞతాభావంతో చూసింది. కాస్సేపటికి ఆమె నిద్రలో జారుకున్నట్టు కనిపించింది కానీ, మళ్ళీ వెంటనే నిద్రపోగొట్టుకోడానికి తల విదిలించి ప్రయత్నం చేసింది. అట్లా చాలాసార్లు చేసింది. ఇదంతా చూస్తుంటే ఆమెకు నిద్రపోవడం ఇష్టం లేదనిపించింది. వెంటనే అడిగాను. ''నీకు నిద్రపోవాలని అనిపించడంలేదా ?''

## జీవన్ మృతులు

''వ్వూహూం — నాకు భయం వేస్తోంది.''

నిద్రపోవడానికి భయం వేస్తోందా ? అదేవిటి ? మనమంతా నిద్రపట్టడం ఒక గొప్ప వరం అనుకుంటుంటే...

''నా స్థితిలో వుంటే మీరు అలా అనరు. నిద్ర, రాబోయే భయంకర స్థితికి సంకేతం !''

''భయంకర స్థితికి సంకేతమా ? ఏవిటో నీ మాటలు నాకు అర్థం కావటంలేదు'' అన్నాను.

''నాకు తెలీదు. ఏమీలేదు. మొత్తానికి అది చాలా భయంకరం. నేను నిద్రలో జారుకున్నప్పుడు అది జరుగుతుంది'' అంది.

''ఫర్వాలేదు. ఈ రాత్రికి నువ్వు హాయిగా నిద్రపో. నిన్ను చూస్తూ వుంటాను. నీకేమీ జరగదని హామీ ఇస్తున్నాను'' అన్నాను.

''మీరు చెపితే నమ్ముతాను'' అంది.

వెంటనే అన్నాను ''నీకేమైనా పీడకల వచ్చినట్టు నేను గమనిస్తే, వెంటనే నిన్ను నిద్ర లేపుతాను, సరేనా ?''

''అలాగే చెయ్యండి. చేస్తారు గదూ? మీరెంత మంచివారు. అయితే ఇక నేను నిద్రపోతాను.'' అట్లా అన్న కాసేపటిలోగా, గాఢ నిద్రలోకి జారుకుంది.

రాత్రి అంతా ఆమెను గమనిస్తూ కూర్చున్నాను. ఆమె అసలు కదలలేదు. హాయిగా, ప్రశాంతంగా, ఆరోగ్య సూచకంగా నిద్రపోయింది. ఆమె పెదాలు కొద్దిగా విచ్చుకున్నాయి. వూపిరితీసి వదులుతున్నప్పుడు ఆమె రొమ్ములు లేచి పడుతున్నాయి. ఆమె మొహంలో నవ్వు కనిపించింది. దాన్నిబట్టి ఆమె నిద్రను చెడగొట్టే ఎటువంటి పీడకలా రాలేదని అనిపించింది.

తెల్లవారగానే ఆమె పనిమనిషి వచ్చింది. లూసీని ఆమెకు అప్పగించి నేను ఇంటికి వెళ్ళాను. నాలో ఎన్నో ఆలోచనలు. వాన్ హెల్సింగ్‌కి, ఆర్థర్‌కి చిన్న టెలిగ్రాంలు ఇచ్చాను, ఆపరేషన్ తర్వాత ఆమె చాలా బాగుందని. నా సొంత పనులు కొన్ని మురగబెట్టినవి చాలా వుండిపోయాయి. అవన్నీ చేస్తూ వుండేసరికి రోజు గడిచిపోయింది. మా పురుగుమాంస భక్షక మిత్రుడ్ని చూడడానికి వెళ్లేసరికి చీకటిపడింది. గతరాత్రి, ఈరోజు, అతను బాగానే వున్నాడట. ఏ గొడవా లేదట. నేను భోజనం చేస్తుండగా, ఆంస్టర్ డామ్‌లోవున్న వాన్ హెల్సింగ్ నుంచి టెలిగ్రాం వచ్చింది. నన్ను హిల్లింగ్‌హామ్ రమ్మన్నాడు. తనుకూడా ఈరాత్రికి బయలుదేరి ప్రొద్దుటే హిల్లింగ్‌హామ్ చేరుకుంటానన్నాడు.

సెప్టెంబర్ 9 : హిల్లింగ్ చేరుకునేటప్పటికి నేను బాగా అలసిపోయాను. గత రెండు రాత్రిళ్ళు కంటిమీద కునుకులేదు. నా మెదడు మొద్దుబారిపోయింది. ఆలోచించలేకపోతోంది. లూసీ ఉత్సాహంగానే వుంది. ఆమె నాతో కరచాలనం చేసి, నా మొహంలోకి సూటిగా చూస్తూ అంది : ''ఇవాళ రాత్రి నాకోసం కూర్చోవద్దు. మీరు బాగా బడలికగా వున్నారు. నాకు బాగానే వుంది. నిజంగానే బాగానే వుంది. ఇవాళ మీరు కూర్చునేట్టయితే, నేనుకూడా నిద్రపోకుండా కూర్చుంటాను.''

నేను ఆమెతో వాదించలేదు. భోజనం ముగించాను. లూసీ నాతోపాటు వచ్చి కూర్చుంది. నేను బాగానే భోంచేసాను. రెండు గ్లాసులు పోర్టువైన్ తీసుకున్నాను. తర్వాత లూసీ నన్ను పైకి తీసుకెళ్ళింది. తన గది ప్రక్కనే వున్న మరో గది చూపించింది. అక్కడ చలి కాచుకునే పొయ్యి వెలుగుతోంది. ''మీరు ఇక్కడ వుండండి ఈ గది తలుపులు తీసివుంచుతాను. నా గది తలుపులు కూడా తీసివుంచుతాను. ఇక్కడ సోఫాలో పడుకోండి. ఎందుకంటే మీ డాక్టర్లుకు పేషంటుకు దూరంగా వుంటేగానీ నిద్రపోలేరు. నాకేమైనా కావలసివస్తే మిమ్మల్ని పిలుస్తాను. మీరు వెంటనే రావచ్చు'' అంది. నేను బాగా అలసిపోయివున్నాను. అందుకని ఆమెను కాదనే ప్రయత్నం చేయలేదు. 'నీకేమైనా కావలిస్తే తప్పకుండా పిలుస్తావు కదా' అని ఆమెను మళ్ళీ అడిగి, సోఫాలో పడుకున్నాను. తర్వాత అన్నీ మరిచిపోయాను.

### లూసి వెస్‌టెన్‌రా డైరీ:

సెప్టెంబర్, 9 : ఇవాళ రాత్రి నాకు సంతోషంగా వుంది. నేను చాలా నీరసించిపోయాను. ఇప్పుడు బాగున్నాను, దట్టమైన మబ్బుల్లో సూర్యుడు చిక్కుకుని, తర్వాత మబ్బులు తొలగిపోయి ప్రకాశించినట్టు. ఆర్థర్ నాకు మరింత దగ్గరయ్యాడు. అతని వునికి నాకు అనుభవమవుతోంది. నా ఆలోచనలన్నీ ఆర్థర్ మీదే వున్నాయి. రాత్రి ఎంత గాఢంగా నిద్రపోయాను. ఎంత విశ్రాంతి పొందాను. ఇదంతా డాక్టర్ సెవార్డు గమనిస్తూ వుండగా. ఇవాళ రాత్రి నేను ఒంటరిగా పడుకోడానికి భయపడను. ఎందుకంటే డాక్టర్ సెవార్డు నా ప్రక్క గదిలోనే వున్నారు. పిలుపుకి అందుబాటులో వున్నారు. నేనంటే అందరికీ ప్రేమ. వాళ్లందరికీ కృతజ్ఞతలు. దేవుడికి కూడా కృతజ్ఞతలు. గుడ్‌నైట్, ఆర్థర్ !

### డాక్టర్ సెవార్డు డైరీ :

సెప్టెంబర్, 10 : నా తలమీద చెయ్యి పడగానే అది ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ అని తెలివి

శ్రీ నవ్యకళా నికేతన్ (కడప) ఆధ్వర్యంలో ఇటీవల రాయలసీమ నిరుద్యోగ రంగస్థల కళాకారుల సమాఖ్యని శ్రీ అరవేటి శ్రీనివాసులు జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న దృశ్యం



# జి. ఆర్. ఎస్* కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త

## ప్రెస్టీజ్

Patent pending
గ్యాస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige
PRESSURE COOKER
Cook a whole meal in minutes

**100% భద్రత**



### జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది. నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో, ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయకరం. ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా, గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరిన ఆవిరి ఒత్తిడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది. జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది.



### అది ఎలా పనిచేస్తుంది?

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి. కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తిడి అవసరానికి మించి ఉంటుంది. సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తిడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది. అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది.

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తిడి అధికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తిడిని అంతర్ముఖంగా, భద్రంగా వదలివేస్తుంది.



### జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు. అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు. దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు. ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు.**



**మామూలుగా వంటచేసే పద్ధతిలో జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు.**

ఉండనే ఉండదు. అందులో మార్చడానికి ఏమీలేదు. రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే, తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా వాడగలిగే భద్రమైన కుక్కర్ — అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

**ttk తయారీ.**

**Prestige**



ప్రెస్టీజ్ . . . భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

maa(s) TTP 3 Tel b 82

తెచ్చుకుని లేచాను. చెయ్యి పడగానే వెంటనే మేల్కోవడం ఆశ్రమంలో బాగా అలవాటయింది.

''మన పేషంటుకు ఎలా వుంది ?'' అతని ప్రశ్న.

''నేను ఆమెను చూసినప్పుడు బాగానే వుంది'' అన్నాను.

''పద వెళ్ళి చూద్దాం'' అన్నాడు. ఇద్దరం ఆమె గదిలోకి వెళ్ళాం.

గదిలో తెరవేసి వుంది. నేను వెళ్ళి మెల్లగా తెర ఎత్తాను. వాన్ హెల్సింగ్ చప్పుడు కాకుండా మంచం దగ్గరకు వచ్చాడు.

తెర ఎత్తగానే సూర్య కిరణాలు గదిలోకి ప్రసరించాయి. ప్రొఫెసర్ ఏదో తప్పు జరిగినట్టుగా నోటితో శబ్దం చేసాడు, ''చ్చొ చ్చొ చ్చొ !'' అతనెప్పుడూ అలా సాధారణంగా చేయడు. అతనట్లా చేయగానే నా గుండెలో భయంతో నిండి పోయింది. నేను మంచం దగ్గరకు వెళ్ళబోతుండగా. అతను వెనక్కి వచ్చేసాడు. ''కొంప మునిగింది'' అన్నాడు. అతను మొహం బాధతో, భయంతో నిండిపోయింది. మంచం వేపుకు చెయ్యి చాచి చూపించాడు. అతని మొహం బాగా పాలిపోయింది. నా కాళ్ళలో వణుకు ప్రారంభమయింది.

మంచంపై వున్న లూసీని చూసాను. సొమ్మసిల్లి పడిపోయినట్టుగా వుంది. ఇదివరకటి కన్నా శరీరం తెల్లగా పాలిపోయి వుంది. పెదాలు కూడా తెల్లగా వున్నాయి. పళ్ళ చిగుళ్ళు పీక్కుపోయాయి, ఎన్నో రోజులు జబ్బువల్ల తీసుకుతీసుకు చచ్చిన మనిషిలా. వాన్ హెల్సింగ్ కోపం పట్టలేక కాలు పైకెత్తాడు నేలను తన్నడానికి. కానీ, జీవితంలో ఎంతో అనుభవం వున్నవాడు అవటంచేత వెంటనే తన కోపాన్ని నిగ్రహించుకుని, కాలును మెల్లగా నేలమీదకు దించాడు. ''త్వరగా బ్రాందీ పట్టుకురా !'' అన్నాడు. భోజనాల గదిలోకి పరుగెత్తి బ్రాందీ పట్టుకొచ్చాను. దానితో అతను ఆమె పెదాలను తడిచేసాడు. ఇద్దరం ఆమె అరచేతులు, మణికట్టుదగ్గర, గుండెపైన పైన కదలిక కలగడానికి రుద్దాము. ఆమె గుండె చప్పుడు వాన్ హెల్సింగ్ కనిపెట్టాడు, ఏమవుతుందా అని బాధతో. ఆరాటపడ్డ కొన్ని క్షణాల తర్వాత అన్నాడు— ''ఇప్పటికైనా మించిపోయింది లేదు, గుండె

## జీవన్మృతులు

బలహీనంగా కొట్టుకుంటున్నప్పటికీ. మనం చేసిందంతా వృథా అయింది. మళ్ళా కొత్తగా మొదలెట్టాలి. బలంగా వున్న ఆర్థర్ ఇప్పుడిక్కడలేదు. ఈసారి నువ్వే ఇక రక్తం ఇవ్వాలి జాన్'' అట్లా అంటూనే సంచీలోని సామాన్లు బయట పెట్టడం ప్రారంభించాడు. నా వొంటిమీది కోటు తీసేసాను. చొక్కా చేతులు పైకి మడిచాను. ఆమెకు మత్తు మందు ఇచ్చేంత టైం లేదు. అది కూడా అవసరం లేదనిపించింది. ఆపరేషన్ మొదలు పెట్టాం. ఇదంత తక్కువ టైం ఏం పట్టలేదు. నేను ఎంత మనస్ఫూర్తిగా రక్తం ఇవ్వడానికి సిద్ధపడ్డా, బాధ భరించలేనిదయింది. వాన హెల్సింగ్ నా వంక వేలు చూపిస్తూ, ''ఏ మాత్రం కదలొద్దు. ఇప్పుడిప్పుడే ఆమెకు బలం వస్తోంది. నీ కదలికకు ఆమె మేల్కొంటుంది. మేలుకున్నదంటే, ఇక పెద్ద ప్రమాదం జరిగిపోయిందన్నమాటే. ఏమైనా కాస్త జాగ్రత్త తీసుకోవాల్సిందే. మర్ఫియా ఇంజక్షనిస్తాను'' అన్నాడు. వెంటనే ఆ పని ముగించాడు. ఆమె బలం పుంజుకుని స్పృహలోకి వచ్చింది గానీ, ఇంజక్షన్ వల్ల నిద్రలోకి జారుకుంది. ఆమె చెంపలు, పెదాలు ఎరుపు రంగులోకి కొద్దిగా వస్తూ వుండడం కనిపించింది. నాకు చాలా గర్వమేసింది. తాను ప్రేమించిన పడతి శరీరంలోకి తన రక్తం వెళుతుంటే కలిగే అనుభూతి, ఎవరికైనా అనుభవించితే గానీ తెలియదు.

ప్రొఫెసర్ నన్ను చూస్తూనే వున్నాడు. ''ఇక చాలు'' అన్నాడు.

''అప్పుడే ?'' అడిగాను. ''ఆర్థర్ దగ్గర చాలా ఎక్కువ రక్తం తీసుకున్నారు కదా !''

అందుకు వాన్ హెల్సింగ్ చిరునవ్వు నవ్వాడు. అందులో విచారం గోచరించింది.

''అతను ఈమెకు ప్రియుడు. పైగా కాబోయే భర్త. మరి నువ్వు ? నువ్వు చెయ్యాల్సింది ఎంతో వుంది. ఆమెకోసం చెయ్యాల్సింది వుంది. ఇతర్ల కోసం చెయ్యాల్సింది వుంది. ప్రస్తుతానికి ఇది చాలు'' అన్నాడు.

ఆపరేషన్ ఆగిపోయింది. అతను లూసీ సంగతి చూస్తుండగా, నేను నా చేత్తో రక్తం తీయబడ్డ చోట రుద్దుకున్నాను. నేను పడుకునే వున్నాను, బాగా నీరసంగా వుండడం చేత. వాన్ హెల్సింగ్ తర్వాత నా దగ్గరకొచ్చి, నాకు కట్టుకట్టి, మెల్లగా క్రిందికి పంపించాడు, నేను కాస్త వైన్ తాగడం కోసం. నేను గదిలోంచి వెళుతుండగా, ప్రొఫెసర్ నా వెనకే వచ్చి మెల్లగా అన్నాడు ''దీని గురించి ఎవరికి తెలియకూడదు. ఒక వేళ మీ స్నేహితుడు ఆర్థర్ అనుకోకుండా వస్తే, అతనికి కూడా చెప్ప కూడదు, తెల్సిందా? అతనికి తెలిస్తే భయపడతాడు. పైగా నీ మీద అసూయ కలగొచ్చు. అందుకని అట్లాంటిదేమీ జరగకూడదు.''

మళ్ళీ నేను పైకి వచ్చినపుడు అన్నాడు ''నువ్వు మరీ అంత నీరసంగా కనిపించడం లేదులే. గదిలోకి వెళ్ళి సోఫాలో పడుకుని విశ్రాంతి తీసుకో. తర్వాత కాస్త బాగా తిని మళ్ళీ నా దగ్గరకు రా.''

అతను చెప్పినట్టే చేసాను. ఎందుకంటే, అతను ఏది ఎప్పుడు చెయ్యాలో బాగా చెప్పగలడు. ఇప్పుడు నా బలాన్ని పుంజుకోవాలి. బాగా నీరసపడి పోయాను. నాలోని ఉత్సాహం ఎటోపోయింది. సోఫాలోపడి నిద్రపోయాను. అసలు లూసీ మళ్ళీ మళ్ళీ ఎందుకలా అయిపోతోంది ? ఎంతో రక్తం ఆమె శరీరంలోంచి పోతోంది, కానీ ఎట్లా పోతోంది? ఆమె శరీరంలో ఎక్కడ్నించి పోతోంది ? ఇవన్నీ తలుచుకుంటూ వుంటే, ఆశ్చర్యంగా వుంది. అవే ఆలోచిస్తూ నిద్రపోయానో ఏమో, కలలో కూడా ఆ సంగతులే – లూసీ నిద్రలో నడవడం, ఆమె గొంతుకింద చిన్న గంట్లు ... అవీ.

లూసీ పగలు బాగా నిద్రపోయింది. ఆమె లేచినప్పుడు కాస్త బాగానే కనిపించింది, మొన్నటంత ఉత్సాహంగా లేకపోయినా. వాన్ హెల్సింగ్ ఆమెను చూసిన తర్వాత బయటకు వెళ్ళాడు. పోయే ముందు నాతో అన్నాడు— ''నువ్వు ఆమెను కనిపెడుతూ వుండాలి. ఒక్క క్షణం కూడా వదలకుండా చూడాలి.'' అతను క్రింది హాల్లోకి వెళ్ళి 'ఇక్కడ దగ్గర్లో వున్న టెలిగ్రాఫ్ ఆఫీసు ఏదీ ?' అని అడుగుతూ వుండడం నాకు వినిపించింది.

(ఇంకా వుంది)









# ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా!
# తాగండిక బోర్న్‌విటా.

మీ కుటుంబంలోని వారికి క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా యివ్వండి. దానిలోని రుచి అంటే వాళ్ళందరికీ మహాయిష్టం. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలు గల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా ఉన్నాయి. బోర్న్‌విటా మీ కుటుంబంలోని వారందరికీ ప్రతిరోజూ యివ్వండి-రోజుకు రెండుసార్లు.




OBM/8845 R

క్యాడ్‌బరీస్
**బోర్న్‌విటా** దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక

సుధ – తపాంగ్, ఒరిస్సా

వినాయకుడు టెస్ట్‌ట్యూబ్ బేబీ కాదా ?

★ కాదు. మదర్ మేడ్ !

ఎస్. బి. – హైదరాబాదు

ఇక మూడో వరల్డ్‌వార్ ఎందుకండీ బాబూ అదేదో మీ జాతి గయ్యాళి అతివలు రోజూ ఇళ్లలో చేస్తూంటారు...

★ పొరపాటయ్యా సూరీ ! కొంపలో యుద్ధం గడపెక్కడ దాటుతుంది ? !

ఎం. ఎస్. ఆర్. – బైవల్లి

ఎగిరిపడే ప్రతి కెరటం తీరం చేరుతుందా ?

★ చేరదు. కొన్ని కలిసిపోతూ వుంటాయి. ఉవ్వెత్తున లేచిన కెరటమే – అంచులు చేరుతుంది.

హెచ్. ఆర్. – శిపాంగ్, ఒరిస్సా

కొవ్వూర్ రేషనిజం భావాలు నేటి యువతరానికి అందచేయవలసిన బాధ్యత మన పెద్దలకు లేదా ? వాటివలన మన సాంఘిక వ్యవస్థ మెరుగుపడదా ?

★ పడుతుంది – యీ బోధించడంలో చాదస్తం లేకుండా వుంటే ! రేషనలిజం కూడా ఒక రెలిజియన్ చేసేస్తున్నారే – అదే పొరపాటేమో.

వి. కె. ఎస్ – చోడవరం

అక్కయ్యా ! మీరు స్త్రీమూర్తులు కదా ? స్త్రీ స్వభావం ఎలాంటిదో వివరించకలరా?

★ "ఇది కాదు ? ఇది కాదు" అనే చెప్పకలరు ఎవరేనా సోదరా ? ప్రతి స్త్రీలో కొన్ని పురుష లక్షణాలు, ప్రతి పురుషునిలో కొన్ని స్త్రీ లక్షణాలు వుంటాయి – అందుకే – స్త్రీ పురుషులు నిజంగా ప్రయత్నిస్తే – బాగానే అర్థం చేసుకోకల్గుతున్నారు.

జి. ఎస్. ఆర్. – నేలకొండపల్లి

కష్టాల్లో వున్నప్పుడు జీవితంమీద విరక్తి కల్గుతుందెందుకు ?

★ ఉన్నంతసేపూ కష్టాలు శాశ్వతం అనిపించడంచేత !




కె. ఎస్. – గిద్దలూరు

నా ఫ్రెండ్సు సోషల్‌మూవ్ అంటారు, ఫ్రెండ్‌షిప్ అంటారు, ప్రేమ అంటారు – చివరకు పెళ్లి అంటారు. వాటిమధ్య వుండే సంబంధం ఏమిటి ?

★ సోషల్‌మువ్ అంటేనే గమ్మత్తుగా వుంది స్వామీ ! సోషల్‌గా మూవ్ అవడానికి కొత్త పదమా అది ? !

యు. యు. యు. – ఎమ్మిగనూరు

ఈ ప్రపంచంలో అతి సులువైన పని ఏది ?

★ కబుర్లు చెప్పడం ! (అతికష్టమైన పని – చెప్పింది చెయ్యకల్గడం.)

ఎం. ఎస్. ఆర్. – బైవల్లి

మీ ఆడవారికి అనుమానాలు ఎక్కువగా వస్తుంటాయి. ఎందువల్ల ?

★ మీ మగవారి డబుల్ స్టాండర్ట్స్‌వల్ల.

అమ్మాయి పెళ్లి చూపులకు (ఫ్రెండు కోసం) వెళ్లాము. అమ్మాయి నచ్చింది. కొద్ది రోజులు పోయాక కేన్సిల్ అని ఉత్తరం వచ్చింది. కారణం ఏమై వుంటుంది ?

★ అబ్బాయి అమ్మాయికి నచ్చివుండడు !

ఎమ్. ఎల్. ఎస్. – తుని

అమ్మాయిలని పరిచయం చేసుకోవడం ఎలాగ?

★ వెకిలిచేష్టలు మాని మర్యాద నేర్చుకోవడం ముందు ముఖ్యం.

వి. ఎ. బి. – నర్సాపురం

పోలీసులు రక్షకులా భక్షకులా ?

★ పరిస్థితులనుపట్టి వుంటుంది – వారి ప్రవర్తన !

జె. ఎస్. – తోటపల్లి

అక్కయ్యా! పదహారువేల గోపికలతో ఉన్నవాడు శ్రీకృష్ణుడు గొప్పవాడు, ఐదుగురిచే రేప్ చేయబడ్డ ద్రౌపతి పతివ్రత, ద్రోణుడిచే అబద్ధం ఆడించిన ధర్మరాజు మహాపురుషుడు, అధర్మంగా దుర్యోధనుని చంపిన అర్జునుడు వీరుడు. కామెంట్ ?

★ ఇవన్నీ నమ్మమని మీ పీక నొక్కుతున్నారా ఎవరేనా ? రాజకీయంలో నీతి – సూటిగా వుండడం చూశారా మీ రెప్పుడేనా ? !

టి. టి. ఎమ్. – పెదకాకాని

జీవితంలో విలువైనది ఏది ?

★ ప్రాణం.

చందు – ఆదోని

కిన్నెరసాని అంటే –

★ అందమైన పిల్లనది. చదవలేదా విశ్వనాథ వారి కిన్నెరసాని ?

ప్రఫుల్ల – ధర్మవరం

ఉత్తమోత్తమ రచన ఎలా వుండాలి మీ దృష్టిలో ?

★ నాకే తెలియదు !

కె. ఎస్. ఆర్. – అనంతపురం

కె. రా. గారూ ! నాకు కథలు వ్రాయాలని కవిత అల్లాలని వుంది. మాట్లాడగలను. కాని రాయడం సాధ్యం కావడంలేదు. మీ సలహా ఏమిటి ?

★ తక్షణం సినిమా ప్రపంచంలోకి దిగబడాలి. ఇక్కడ కథలు చెప్పడమే ప్రధానం. కవితలు చెప్పనక్కరలేదు. రాత రానివారి కిదో–స్వర్గధామం. కీర్తిమార్గం ! ★






మా వూరికి తలలో నాగరంలా వుంది బస్‌స్టాప్. పిరుదుల వరకు వేలాడే పల్లెటూరి పిల్ల ఒత్తైన జెడలా వుంది బస్‌స్టాప్ నుండి ఊళ్ళోకి వేసిన నల్లని తారు రోడ్డు.

కిందటి సారి వచ్చినపుడు తారు రోడ్డు లేదు. ఈ మధ్యే కొత్తగా వేసినట్టున్నారు. మా స్టాప్‌లో 'ఎక్స్‌ప్రెస్ బస్'లు ఆగవు. కండక్టరును 'కాకా' పట్టి కిలోమీటరు దూరం ముందు నుంచీ 'బ్రీఫ్‌కేస్'తో డోర్ దగ్గర నిలబడి—నానా హైరానా పడి ఎలాగయితేనేం ప్రయోజకుడి ననిపించుకున్నాను. బస్ దిగేసరికి ఆ స్థలమంతా నిర్మానుష్యంగా వుంది -- సద్దుమణిగిపోయిన పెళ్ళివారిల్లులా. ఓ మూలగా గంగరావి చెట్టు కింద నాలుగైదు రిక్షాలు—ప్రభుత్వం పేదలకు కట్టించి యిస్తున్న కాలనీలోని ఇళ్లలా. దగ్గరకెళ్ళి చూశాను— ఎవరైనా మెలకువగా ఉన్నారేమోనని. ఎవరి మట్టుకు వాళ్ళు ముడుచుకొని పడుకొన్నారు.

''ఏవోయ్ రిక్షావాలా''

ఒకసారి పిలిచేసరికే ఒకడు బదులు పలికాడు.

''ఎవరింటికి బాబూ ?''

''శాస్త్రుల గారింటికి''

వాడు ఉలికిపడి లేచి నావంక తేరిపారి చూశాడు.

''మీరా పెద్దబ్బాయిగారూ ? సాన్నాళ్ళయింది మిమ్మల్ని సూసి.. అయిద్రాబాదులో కదూ వుంటున్నారు ? రండి బాబూ'' అంటూ రిక్షా సిద్ధం చేశాడు.

మా వూళ్ళో వైదిక బ్రాహ్మణుల కుటుంబాలు చాలా కాకపోయినా మాతోపాటు మరికొన్ని వున్నాయి. కాని ఆబాలగోపాలానికి 'శాస్త్రులు' గారంటే మా నాన్నగారు సాందీపని శాస్త్రి గారే. ఆయన పేరు పెట్టుబడక పోవడం కొంత, ఆయన పేరు ప్రఖ్యాతులు మరికొంత — ఆయనను ఆ వూరికి ఏకైక శాస్త్రిని చేశాయి. ఆయనంత కాకపోయినా చాలా మంది నన్ను కూడా పెద్దబ్బాయిగారనే పిలుస్తారు. మరి మా తమ్ముణ్ణి మాత్రం చాలా మంది పేరుపెట్టే 'మాధవశాస్త్రి'గారనే అంటారు.

రిక్షా వేగానికి చలిగాలి ఉధృతమయింది. చెవులకు చుట్టుకొన్న మఫ్లరు బిగించాను. రోడ్డు మీద రిక్షా మువ్వల లయబద్ధమైన శబ్దం తప్ప మనుషుల అలికిడి లేదు. పల్లెటూరి ప్రశాంతమైన వాతావరణం కలిగిస్తున్న ఆహ్లాదం ప్రయాణపు బడలికను మరపింపజేస్తోంది.

నేను వస్తానని మాధవ అనుకోడు. నేను తీసుకొచ్చిన వార్త విని మరీ ఆశ్చర్యపడతాడు. ఆపైన ఆనందపడతాడు కూడా. ఎటొచ్చీ మరదలు రాధకి మాత్రం ఈ సంబంధం నచ్చుతుందో లేదో అని నా కనుమానమే. ఎస్టేటులూ, జిల్లా కలెక్టరు గిరీవున్న సినిమా హీరోలాంటివాడు అల్లుడిగా రావాలనే ఆమెను తృప్తిపరచడం సాధ్యం కాదు. ఈ మాట నేను బయల్దేరేటప్పుడే విశాలితో అన్నాను.

విశాలి మాత్రం ఈ సంబంధం ఎలాగైనా ఖాయం చెయ్యాలని పట్టుదలగా వుంది. 'ఎలాగూ ఆఫీసు పనిమీద విజయవాడ వెళ్తున్నారు కదా — అక్కడ్నుంచి ఇంకెంత దూరం ? వెళ్ళిరండి మీ వాళ్ళని చూసినట్టూ వుంటుంది. ఈ 'ఖబురు చెప్పినట్టూ వుంటుంది. ఆస్తిపాస్తులు లేకపోయినా ఇంజనీరు ఉద్యోగం చేస్తున్న అబ్బాయి పైసా కట్నం లేకుండా దొరకడమంటే అదృష్టం కదూ? అయినా ముగ్గురమ్మాయిలూ పెళ్ళికెదిగారు. ఇంకా ఎంత కాలం చీమ కుట్టనట్టు కూర్చుంటారు వాళ్ళు ? వాళ్ళకి తెలియకపోయినా ఇంటికి పెద్దగా మిమ్మల్ని లోకులేమంటారు ? మీరు మాధవకి నచ్చజెప్పండి. ఇది కాస్త చెయ్యి జారిపోతే మళ్ళీ ఇలాంటి అవకాశం రాదు'' గట్టిగా నన్ను హెచ్చరించి మరీ పంపించింది విశాలి.

తమ్ముడు మాధవకి ముగ్గురూ ఆడపిల్లలే. పెద్దది కళ్యాణి. ఇరవై పైబడినా ఇంకా కళ్యాణానికి నోచుకోలేదు. ఆడపిల్ల పెళ్ళి చెయ్యడం యజ్ఞంగా భావింపబడుతున్న ఈ రోజుల్లో రాధకి మాత్రం ఏ సంబంధమూ ఓ పట్టాన నచ్చడంలేదు. ఎవరైనా పిల్లల పెళ్ళిళ్ల ప్రసక్తి తీసుకొస్తే 'ఆ — తొందరేముంది ? ఇంకా పెద్దదానికి పదహారే కదా ?' అంటుంది. నలభయ్యో పడిలో వున్నా తను కూడా పాతికేళ్ళ పడుచులా అలంకరించుకొంటుంది. ఆమె మాటకు ఆ యింట్లో తిరుగులేదు. అందుకే మాధవకి నచ్చజెప్పీ కూడా ప్రయోజనం లేదని నాకు తెలుసు. అయినా నా ప్రయత్నలోపం లేదనిపించుకోవాలని ఈ ప్రయాణం.

విశాలి చెప్పినట్టు 'పెద్దబ్బాయిగారికిద్దరూ మగాళ్ళే గనుక బాధలేదు. పిల్లలిద్దరూ పెద్ద చదువులు చదువుకుంటున్నారు గనుక నగరంలో సుఖంగా వుంటూ తమ్ముడి పిల్లల గురించి బాధ్యత తీసుకోలేదు. శాస్త్రులు గారుంటే ఇలా వూరుకొనేవారా ?' అని వూళ్ళోవాళ్ళు అపవాదులేస్తారనే భయంతో ఈ పనికి పూనుకోవాల్సి వచ్చింది—నిజంగా సంబంధం సెటిలయినా రాధతో ఎటునుంచి ఎటు వస్తుందోననే ఆందోళన కొంత వున్నా.

''వచ్చేశాం బాబూ, దిగండి'' అనే రిక్షావాడి పిలుపుతో ఆలోచనలనుంచి తేరుకున్నాను. రిక్షావాడు వెళ్ళిపోయిన తర్వాత చీకటిలో మా వీధివైపు చూసిన నాకు 'రిక్షావాడు పొరపాటున ఇక్కడికి తీసుకు రాలేదు కదా ?' అనిపించింది, చూసీ చూడగానే. ఈ ఆయిదేళ్ళలో వీధిలో చాలా మార్పులొచ్చాయి. మా యింటి స్వరూపం కూడా నేనానవాలు పట్టలేనంతగా మారిపోయింది. తడుముకొంటూ గుమ్మం దగ్గరకెళ్ళాను.

గుమ్మానికి ఓ పక్కగా గూడు వాటతో వేయబడిన చిన్న గుడిసె. దాని నానుకొని ఓ మనిషి గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. అతనికి దగ్గరలో ఓ చేతి కర్ర వుంది. గుడిసె ముందు ఓ గుడ్డి లాంతరు వెలుగుతోంది. గుడిసెలోంచి ఓ కుక్క ఏదో వస్తువును పట్టుకొని లాగుతోంది. నన్ను ఆశ్చర్యం భయం ఆవహించాయి. గుడిసెలోకి తేరిపారి చూశాను ఒత్తుగా పరిచిన గడ్డి మీద తుంగచాప. దాని మీద

ఓ మానవాకారం ...! విస్తుపోతూ ఆ లాంతరు వెలుగులో గురక పెడుతున్న వ్యక్తి ముఖాన్ని పరిశీలనగా చూశాను— సందేహం లేదు, యతిరాజులు!

"ఒరేయ్ రాజులూ, రాజులూ" గట్టిగా పిలిచాను. వాడు గాబరా పడుతూ లేచాడు.

"మీరా పెద్దబ్బాయిగారూ? ఎప్పుడొచ్చారు?"

"ఇప్పుడే కాని గడ్డిలో వేసింది...!"

"ఎంకట సాత్రులుగారు బాబూ. మాటపడిపోయి వారమయింది. డాట్టర్లు నాబంలేదని సెప్పేశారు. గురక తగ్గిపోయి నట్టుంది... మడిసిని సూడండి బాబూ"

గుడిసెలోని వ్యక్తి మీద చెయ్యేసి చూశాను. మంచు గడ్డలా చేతికి చల్లగా తగిలింది. నా ఒళ్ళు నీరయిపోయింది.

"ప్రాణం పోయిందిరా. తమ్ముడేడి?"

"లోపలున్నారు. లెగ్గొట్టు కొత్తానండి" హడావిడిగా వెళ్ళి తలుపు కొట్టాడు.

అంతా బయటకొచ్చారు. సన్నగా ఏడ్పులు ప్రారంభమయ్యాయి. నాకు కూర్చునే స్థలం లేదు. అలాగే గోడకి చేరబడిపోయాను...

* * *

శ్రీనాధుడు భీమఖండంలో వర్ణించినట్టు మాది జోడరుగుల లోగిలి. దానిలో రెండు వాటాలుండేవి. రెండో వాటా బాబాయి గారిది. బాబాయి పట్నంలో ఉద్యోగస్థుడు కావడం చేత ఆ వాటా కూడా మాకు కలిపేసి పట్నంలో ఇల్లు కొనుక్కున్నాడు.

ఆ సంవత్సరం దీపావళి సమీపిస్తుందనగా ఏదో బాకీ చేతి కందడంతో యింటికి మరమ్మత్తులు చేయిస్తున్నారు నాన్నగారు. అంతవరకు వున్న మట్టి అరుగుల్ని కొంచెం ఎత్తు చేయించి గచ్చు చేయించడం ఆ కార్యక్రమంలో ఓ భాగం. అప్పుడే పట్నం బాబాయి గారింటికి వెళ్ళొచ్చిన పన్నెండేళ్ళ మాధవకి మాత్రం ఆ పని నచ్చలేదు.

"ముసలిదానికి ముస్తాబు చేసినట్టు ఈ పాత యింటికి మెరుగులెందుకు నాన్నగారూ? కట్టుకొంటే బాబాయిగారిల్లులా అందమైన డాబా యిల్లు కట్టుకోవాలి. కుక్కలూ ఆవీ పాడుచెయ్యడానికి కాని

# ఎత్తరుగుల లోగిలి

ఈ అరుగులెందుకు? పోనీ ఈ అరుగులమీద గదులు కట్టించండి. మేం చదువుకోడానికి బావుంటుంది."

మాధవ ఉద్దేశ్యం వేరు. చదువు నెపంతో ప్రత్యేకమైన గదులు తీసుకొంటే రాత్రులు సినిమాలకూ ఆటలకూ వెళ్ళినా యింట్లో తెలియకుండా వుంటుందని. ఇల్లు ఆధునికంగా వుంటుందనే అభిప్రాయంతో అమ్మ కూడా తమ్ముణ్ణి సమర్థించింది. కాని నాన్నగారు అమ్మని మందలించారు.

"చిన్నవాడు. వాడేదో తెలియక మాట్లాడితే నువ్వుకూడా వంత పాడతావా? అరుగుల అవసరం వాడికి ముందు ముందు తెలుస్తుంది. అరుగు సాంఘిక కార్యకలాపాలకు వేదిక. హిందూమతంలోని మానవతా దృక్పథానికి అది ప్రతీక. మన మతంలోని విశాల దృక్పథానికి భూతదయకూ అరుగు తార్కాణమని వివేకానందుడంతటి మహనీయుడు విదేశాల్లో యిచ్చిన ఉపన్యాసాల్లో వివరించాడు. 'కాకబలి'నీ 'శ్వానబలి'నీ అరుగులమీద వేసిన తర్వాతనే ఆహారం స్వీకరించాలని మనుధర్మశాస్త్రంలో చెప్పలే? సాంప్రదాయకమైన కుటుంబాన్నుంచి వచ్చిన నువ్వుకూడా ఇలా మాట్లాడ్డం విడ్డూరంగా వుందే?" అంటూ నాన్నగారు విరుచుకొనిపడ్డంతో అమ్మ కిక్కుర్రుమనలేదు.

'ఆ — నాన్నగారిదంతా చాదస్తం' అంటూ తమ్ముడు కొట్టిపారేశాడు కాని నాకు మాత్రం ఆయన మాటల్లో ఏదో మహత్తరమైన సత్య ముందనిపించింది.

దీపావళి నాటి సాయంత్రం పాలికాపు వచ్చి అరుగుల ముందు కర్రలు పాతి వాటికి అరుగు కంటె కొంచెం ఎత్తున అడ్డంగా వెదురుబద్దలు కట్టాడు. ఆ వెదురు బద్దలమీద ఆవుపేడ ముద్దలు వుంచి వాటిపై ప్రమిదలు అమర్చి అమ్మ వత్తుల్ని వెలిగించింది. ఆ రాత్రి మా కుటుంబమంతా అరుగులమీద కూర్చొని దీప తోరణాల్ని చూసి మురిసిపోతూ బాణాసంచా కాల్చుకుంటున్నప్పుడు అరుగులు లేని మా యింటిని ఊహించలేకపోయాను.

వంశీ ఆర్ట్స్ (వరంగల్) వారు ఇటీవల ధ్వన్యనుకరణ సామ్రాట్ శ్రీ నేరెళ్ల వేణుమాధవ్ 50వ జన్మదిన సందర్భంగా జరిపిన సన్మానోత్సవంలో వేణుమాధవ్ దంపతులని ఆశీర్వదిస్తూ అక్షతలు చల్లుతున్న సినీనటులు ధూళిపాళ, గుమ్మడి, మిక్కిలినేని గార్లని చిత్రంలో చూడవచ్చు.



ఒక అరుగంతా సొంతం చేసుకొని విష్ణు చక్రాలూ, భూచక్రాలూ కాలుస్తూ ఆనందిస్తున్న తమ్ముణ్ణి చూసి నాన్నగారదే అన్నారు 'గచ్చరుగులు అనవసరం అన్నావు — అవి ఎలా ఉపయోగపడుతున్నాయో చూశావా మాధవా?' అని.

"మీకు ఎత్తిపొడవడానికి మంచి అవకాశమే వచ్చింది" అని అమ్మ నవ్వింది. తమ్ముడు ఈ మాటల్ని పట్టించుకొనే స్థితిలోలేడు. ఆనందంతో తలమున్కలవుతున్నాడు.

ఆ తర్వాత పట్టించుకొనే రోజుకూడా వచ్చింది. మాధవ పెళ్ళికి ఉదయం నుంచి ఒకటే వర్షం. భోజనాలకీ ముహూర్తానికీ కూడా వాన తెరపి యివ్వలేదు. వర్షంలోనే నానావస్థలూ పడివచ్చిన అతిధులందరికీ నీడ నిచ్చినవీ, పెళ్ళిని కళ గట్టించినవీ అరుగులూ, చావిడీ.

"నాన్నగారూ, మీరు నా చిన్నప్పుడు అరుగుల గురించి చెపితే ఏమో అనుకున్నానుగానీ... ఇప్పుడు మాత్రం చాలా ఉపయోగపడ్డాయి" అంటూ ఆ సందర్భంలో మాధవ నాన్నగారి ముందు తన అవివేకానికి తలవంచాడు.

వర్షం పేరు చెపితే నా మనఃఫలకం మీద హత్తుకుపోయిన ఆ సంఘటన గుర్తుకొస్తుంది — అప్పటికి నా వయస్సు పదహారు లోపు. ఆ సంవత్సరం కనీ వినీ ఎరుగని వర్షాలు ... అప్పటికి రెండు రోజుల్నుంచి కుండపోతగా వాన కురుస్తోంది. పల్లపు ప్రాంతాలన్నీ జలమయమైపోయాయి. బంగాళా ఖాతంలో వాయుగుండం ఏర్పడ్డం వల్ల రాగల రెండురోజుల్లో భారీ వర్షాల, పెనుగాలుల ప్రమాదం వుందని రేడియోలో పదే పదే హెచ్చరికలు చేస్తున్నారు. గుడిసెలు మునిగిపోయిన బీదా బిక్కీ ఆశ్రయం దొరికిన చోటల్లా గుంపులు గుంపులుగా చేరుతున్నారు. ఆ రోజు పుదయం యతి రాజుల కుటుంబం, మరికొందరు వచ్చి అరుగు పక్క చూరుకింద చేరడం నేను గమనించాను. వాళ్ళు వర్షానికి వణికిపోతూ, పైకి రావడానికి భయపడుతూ ఒదిగి ఒదిగి నిల్చున్నారు. వాళ్ళను అరుగు మీదకు రమ్మనాలనిపించింది గాని నాన్నగారేమంటారోనని భయపడ్డాను. సరిగ్గా అదే సమయానికి మడికట్టుకొని సంధ్యావందనం చేసుకోడానికి అరుగు మీదకు వచ్చారు నాన్నగారు. ఆయనను చూసి వాళ్ళు మరింత కంపించి పోయారు.

"సాత్రులు గారూ మా కొంపలు మునిగిపోయాయి. వాన తగ్గేదాకా యిక్కడ నిలబడ్డాం. ఎళ్లిపోతాం. కోప్పడకండి బాబూ." నాన్నగారేమీ అడక్కుండానే యతిరాజులు సంజాయిషీ చెప్పాడు. నాన్నగారి పెదవులపై చిరునవ్వు మెరిసింది.

"మిమ్మల్ని వెళ్ళిపొమ్మని ఎవరన్నారు? హాయిగా అరుగు మీదకొచ్చి ఆ తడిగుడ్డలు పిండుకొని ఆరేసుకోండి. అమ్మగార్ని ఏమైనా పాత బట్టలుంటే ఇమ్మని అడిగి కట్టుకోండి."

యతిరాజులు హరిజనుడు. సాందీ పని శాస్త్రి గారు వేదాధ్యయనం చేసిన సదాచార సంపన్నులని ఊళ్ళో వాడుక. నాన్నగారి మాటలు వాళ్ళతోబాటు నన్ను కూడా సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాయి.

అంతటితో ఆగలేదు నాన్నగారు. ఆరెండ్రోజులూ

వాళ్ళకి భోజనాలు మా అమ్మగారి చేత వండించి ఆ అరుగుల మీద వడ్డింపజేశారు. అమ్మ కొంచెం తటపటాయిస్తుంటే 'అరుగుకి మైల లేదని ధర్మ శాస్త్రంలో చెప్పబడిందే వెర్రిదానా. నిజంగా వాళ్ళకి అన్నదానం చేస్తున్న నిన్ను చూస్తుంటే వ్యాసుడికి శిష్య సమేతంగా భోజనాలు పెట్టిన అన్నపూర్ణాదేవి గుర్తుకొస్తుంది' అంటూ ఆమెను సమాధాన పరిచారు.

అయితే ఆ రెండ్రోజుల తర్వాత కూడా వరుణుడు శాంతించలేదు. ఆ రోజు సాయంత్రం యతిరాజులు భార్య ఏడుపు అరుగుల మీద కలకలా వినిపించాయి. యతిరాజులు బాణంలా దూసుకొని వచ్చి నాన్నగారి పాదాలకు నమస్కరించి కళ్ళ నీళ్ళు పెటుకున్నాడు. విషయం అర్థం కాక నాన్నగారు కలవరపడ్డారు.

''సాత్రులుగారూ... మీ అరుగు మీదకి ఈ యెదవ సంతని తీసుకొచ్చి సాలా తప్పసేసాను. నన్ను సెమించాలి... మా ఆడదానికి నెలలు నిండినయ్ బాబూ... నొప్పులతో మెలికలు తిరిగిపోతోంది. ఉన్న పళంగా ఏడకెల్లాలో నా కరదం కావడంలేదు బాబూ''

నాన్నగారు కొంచెం ఆలోచించి తలపంకించారు.

''అంతే కదా. నువ్వు కంగారు పడాల్సిన అవసరం లేదు. అటక మీద మన బండికి కట్టే గూడు చాప వుంటుంది. అది తెచ్చుకొని మన అరుగుకి అడ్డం కట్టుకో. పిల్లా పీచుతో సహా మిగతా వాళ్ళనందరినీ అవతల అరుగు మీదకు పంపించు. అనుభవం వున్న మీ ఆడాళ్ళని సాయం చెయ్యమను.''

''వద్దు బాబూ... నేనంత గోరం సెయ్యలేను. సనువిచ్చినారు గదా అని పి యిల్లు మైల సెయ్య లేను''

''ఇలాంటి కార్యాల వల్ల పుణ్యం తప్ప మైల సంక్రమించదురా. నువ్వు సందేహించక వెళ్ళి తొందరగా పని చూడు'' నాన్నగారు పరమ శాంతంగా చెప్పారు.

యతిరాజులు భార్య అరుగుమీద తడక చాటునే ప్రసవించిందట. మగబిడ్డ కలిగాడు... నాన్నగారి ఔదార్యం, విశాల దృక్పథం — ఇంటా బయటా ముగ్ధుల్ని చేశాయి. ఊరూ వాడా గొప్పగా చెప్పు కున్నారు. తెలియని సాంప్రదాయికులు కొందరు ఇదేం విడ్డూరమని ముక్కున వేలేసుకున్నారు.మరికొందరూ నాన్నగారినే 'ఈ అనాచార మేమిటని' అడిగారు. అప్పుడు నాన్నగారు చెప్పిన గంభీరమైన సమాధానం నేనెన్నటికీ మర్చిపోలేను. 'మానవతా వాదాన్ని మించిన వేదం లేదు' అని.

వర్షం వెలిసిపోయింది ... వర్షాలు గడిచి పోయాయి... నాన్నగారి తరం అంతరించి పోయింది.

నాన్నగారు కాలం చేసిన తర్వాత మాధవ, నేను ఇల్లు పొలం పంచేసుకున్నాం నేను ఉద్యోగరీత్యా హైదరాబాదులో స్థిరపడిపోవడంవల్ల ఆ 'ముదరా' పొలంలో చూసుకొని ఇల్లు పూర్తిగా మాధవకే ఇచ్చేశాను. మాధవకి ఏ చదువూ అబ్బక వ్యవసాయం చూసుకొంటూ పల్లెటూరులోనే ఉండి పోవాల్సి వచ్చింది. మా ఆశయాలు తారుమా రయ్యాయి. వాడికి మొదట్నించీ పట్నవాసం అంటే





## ఎత్తరుగుల లోగిలి

మక్కువ. నాకేమో ప్రశాంతంగా పల్లెలో గడపాలని. మాధవ కంటె వాడి భార్య రాధకి నాగరిక జీవితం మీద మరీ మోజు. నేను హైదరాబాదులో ప్రభుత్వంవారు కట్టించి యిచ్చిన కాలనీలో ఓ ఇంటివాణ్ణయాను. హైదరాబాదు వచ్చి మా యిల్లు చూసి అసూయపడిన రాధ ఊళ్ళో పాత యింటిని ఆధునికంగా మార్చాలని పట్టు పట్టిందట!

ఆస్తి పంపకాలు జరిగిన ఏడాదికే తమ్ముడు నాతో చెప్పకుండానే యింటి మార్పులు ప్రారంభించాడు. నేను హైదరాబాదు నుంచి ఆ రోజు వచ్చేసరికి పనివాళ్ళు అరుగులు బద్దలుకొడుతున్నారు. నాన్నగారి మాటలు గుర్తుకొచ్చి నా కళ్ళు చెమ్మగిల్లాయి. వాళ్ళని ఆపుచేసి తమ్ముణ్ణి పిలిచి అడిగాను.

"నీకే? హైదరాబాదులో అందంగా యిల్లు కట్టుకొని మాకు ఎన్ని నీతులైనా చెపుతావ్. సంప్రదాయం పేరు చెప్పి మమ్మల్ని గబ్బిలాల్లా బతకమంటావా? అంతా ఈ పాతింటిని చూసి నవ్వుతున్నారు."

మాధవ నాతో అంత ధైర్యంగా ఎప్పుడూ మాట్లాడలేదు. స్వరం మాధవదైనా అక్షరాలు రాధవని గ్రహించి నేను మారు పలకలేదు.

గునపాలు అరుగుల్ని కాదు.. నా హృదయాన్ని బద్దలు కొడుతున్నట్టనిపించింది.

చిన్నతనంలో నేనూ, మాధవా ఆ అరుగులమీదే మా వీధి పిల్లలతో కలిసి పడుకొని పిడకల్ని, దుంగల్ని కాపలా కాసుకొని భోగిమంటలు వేసుకున్నాం.

కృష్ణాష్టమికి మా వీధికి దేవుడి పల్లకీ వచ్చేసరికి ఆలస్యమయ్యేది. అప్పటివరకు ఆ అరుగుల మీదే ఆడుకొని పిచ్చుక గొట్టాలు చిమ్మేవాళ్ళం.

నాన్నగారి చివరిరోజుల్లో ఆయన అరుగుమీద పడక కుర్చీలో చేరబడి గీతాపారాయణం చేస్తూ దారంటపోయే నలుగుర్ని పిల్చి వాళ్ళకి మంచీ చెడ్డా చెపుతూ కాలక్షేపం చేసేవారు.

గత దృశ్యాలు కళ్ళముందు మెదులుతూ హృదయాల్ని 'నిప్పుల కుంపటి' చేశాయి. అందుకే మళ్ళీ మళ్ళీ మాధవ యింటికి రావాలనిపించేది కాదు.

*   *   *

గోడకి చేరబడి గతంలోకి జారిపోయిన నన్ను మాధవ పలకరించాడు. అంత దుఃఖంలోనూ నన్ను లోపలకు వెళ్ళి కూర్చోమన్నాడు. చనిపోయిన వెంకటశాస్త్రిగారు స్వయంగా మా మాధవ మావగారు ఒకప్పుడు బాగా శ్రీమంతుడు.

"మాధవా. మీ మావగారికీపరిస్థితి రావడం నాకు చాలా బాధాకరంగా వుంది. అసలేం జరిగింది?"

"వ్యసనాలకి ఆస్తికాస్తా హారతి కర్పూరమై పోయింది

ఆరోగ్యం కూడా చెడిపోయింది. ఆఖరి దశలో కొడుకు కూడా చేరనివ్వకపోతే మేమే ఆదుకొని హాస్పిటల్‌లో జాయిన్‌చేశాం. మూత్రపిండాలు చెడిపోయాయట డాక్టరుగారు లాభంలేదు, తీసుకుపొమ్మన్నారు. తీరా యింటికి తీసుకొచ్చి గడ్డిలో వేస్తే చావకుండా బ్రతక్కుండా కోమాలో ఆ రోజుల్నుంచి అలాగే వున్నాడు తీరా యింట్లోపోతే యిల్లు మైల పడిపోతుందని బయట ఈ యేర్పాటు చేసి మేం విసిగిపోయి యతిరాజుల్ని కాపలాపెట్టాం"

"అయ్యయ్యో ఎంతటి వాడికెలాంటి గతి పట్టింది" నా హృదయం ఆర్ద్రమైంది

తెల్లవారే వరకు శవజాగరణ తప్పలేదు తెల్లారిన తర్వాత కూడా ఇరుగూపొరుగూ ఎవరూ అంతగా రాలేదు, వచ్చినవాళ్ళు కూడా నన్ను పలకరించి మాటవరసకి మాధవని పరామర్శించి పోయే వాళ్ళే తప్ప, నిలబడి సహాయం చేసినవాళ్ళు లేరు నాన్నగారు పోయినప్పుడు తీర్థంలా వీధి వీధంతా నిండిపోయి అన్ని యేర్పాట్లు చూసిన గ్రామస్థులు.. ఏమైనా ఆ తండ్రి కొడుక్కి ఆపద వచ్చినపుడు — ఏకాకిని చేసి పోవడం నాకు బాధగా వుంది.

ఇద్దరు ముగ్గురు నాతో రహస్యంగా చెప్పారు— మాధవ కాని, వాడి భార్యకాని వాళ్ళ గొడవ తప్ప ఎవరింట్లో ఏం జరిగినా పట్టించుకోరట అందుకే ఈ నిరసన.. మాధవ గిరి గీసుకొని సామాజిక వ్యవస్థకి దూరంగా పల్లెలో పట్నపు బ్రతుకును సాగిస్తున్నాడని నా కర్థమైంది.

"అన్నయ్యా నాకేం అనుభవం లేదు నువ్వే కావాల్సిన ఏర్పాట్లను చూసి పెట్టాలి" మాధవ ప్రాధేయపడుతున్నాడు

కబురు చేస్తే అతికష్టంమీద మాధవ బావమరిది వచ్చాడు. అతను తలకొరివి పెట్టాడు. నాకు, మాధవకి తోడు ఇద్దరు కిరాయి శవవాహకుల్ని పిలిపించాను.

'పాడె' లేస్తుంటే నా కనిపించింది —

'ఓ హరిజన స్త్రీ ప్రసవ సమయానికి ఆపద్ధర్మంగా ఆదుకొన్న ఈ లోగిలి కావలసిన మనిషికి మరణావస్థలో నీడ నివ్వలేకపోయిందే? ఆ అరుగులూ ఇరుగు పొరుగు సంబంధాలు వుంటే వెంకటశాస్త్రికి దిక్కులేని చావు, ఈ దుర్గతీ పట్టేవా? మళ్ళీ జోడరుగుల లోగిళ్ళు వుండే వ్యవస్థ వస్తే ఎంత బాగుండును!' అని. ★

# న్యూట్రమూల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రమూల్. సమృద్ధి అయిన అమూల్ పాలు, ఎంచిన మాల్ట్, ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు, పుష్టినిచ్చే ప్రోటీన్లు, అత్యవసరమైన ఖనిజాలు, ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి, కేవలం న్యూట్రమూల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.




**మరింత పొడుగ్గా,**
**బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక!

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001. nn

ప్రియమైన న్యూట్రమూల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజీ స్టాంపులూ, న్యూట్రమూల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ________________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ________________________

మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001.





# నీలాకాశం

## సీరియల్ — శ్యామల



(గత సంచిక తరువాయి)

ఎం. బి. బి. ఎస్. అవగానే పెళ్ళి చేసుకోవాలని కలలు కన్నాను. గవర్నమెంట్ జాబ్ దొరికింది ఈ పల్లెకు దగ్గరలో ఉద్యోగం చేసుకుంటే అంకుల్ క్లినిక్‌కూడా కొంతవరకు చూసుకో వచ్చుననే ఉద్దేశంతో, కష్టపడి ప్రక్క ఊరిలోని హాస్పిటల్‌లో పోస్టింగ్ వేయించుకున్నాను. అంకుల్ దగ్గర డబ్బు తీసుకొని ఇల్లు బాగుచేయించి, ఫర్నిచర్ కొన్నాను. ఇక పెళ్ళి తేదీ నిశ్చయించటమే తరువాయి, అనుకుంటూ ఉండగా సుందరి లెటర్ రాసింది — తనకు అమెరికాలో పనిచేస్తున్న ఒక ఇంజనీరుతో పెళ్ళి, పెద్దలు నిశ్చయించారని, క్షమించి మరిచి పొమ్మని రాసింది.

ఇన్నాళ్ళూ మా పెళ్ళికి ఒప్పుకున్న పెద్దలు ఇప్పుడు సడెన్‌గా ఇలా చేయటమేమిటి? నాకేమీ అర్థం కాలేదు. దడదడలాడే గుండెతో ఆత్రుతగా వెంటనే హైదరాబాదు వెళ్ళాను

వాళ్ళ గేటువద్దనే ఎదురుపడ్డాడు సుందరి అన్న రవి. నన్ను చూడగానే గదిలోకి తీసుకువెళ్ళి చెప్పాడు, "సారీ సుధాకర్! మా చెల్లెలి తరపున నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను. నిన్ను పెళ్ళి చేసుకుంటానని ఆశలు రేపి, ఇంత దూరం వచ్చాక— ఇప్పుడు మా బావకు అమెరికాలో జాబ్ దొరికేసరికి, అతన్ని పెళ్ళి చేసుకుంటానని అంటున్నది. ఎంత నచ్చజెప్పినా వినటంలేదు. 'ఫారిన్‌లో ఇంజనీరు భార్యగా గడిపే అవకాశం వచ్చినపుడు, పల్లెలో జీవితం అవసరం నాకేమిటి' అంటున్నది.

'మరి ఇన్నాళ్ళూ సుధాకర్‌ని చేసుకుంటానని ఎందుకు అన్నావు?' అని నిలదీసి అడిగితే

'కొన్నాళ్ళు పల్లెటూరిలో ఉన్నాక, ఆ ప్రజా సేవ మోజు అతనికి తీరాక, సిటీకి తీసుకురావటానికి ఒప్పించగలను అనుకున్నాను. కాని బావ ఫారిన్ వెళ్తాడని, నన్ను చేసుకోవాలనుకుంటున్నాడని నేనే మయినా కలగన్నానా?' అన్నది. నేనేం చెప్పను సుధాకర్! మరొక అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకో ... నన్ను, సుందరిని కూడా క్షమించు..."

నాకు ఒళ్ళంతా చెమటలు పోశాయి. అతను చెప్పేది వినటం కూడా మానేశాయి నా చెవులు. సుందరి — కావాలని, అన్నతో పోట్లాడి, నా నుంచి దూరంగా వెళ్తున్నది. తనంతట తాను మరొకరిని పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నది .. ఇది సాధ్యమేనా? సంభవమేనా??

సుందరిని చూడాలని కూడా అనిపించలేదు. యాంత్రికంగా లేచి వచ్చేశాను. ఆ షాక్ నించి తేరుకోవటానికి చాలా రోజులే పట్టింది. ఒక్కోమారు అనిపించేది, 'తీరా సుందరిని పెళ్ళి చేసుకొని ఉంటే, ఈ పల్లెలో ఉండవద్దు అని తను నన్ను సాధిస్తూ ఉంటే, జీవితం ఎంతగా ఇరుకున పడేది! ఈ పెళ్ళి కాకపోవటమే మంచిదయింది!' ఏ విధంగా మనసుని సమాధాన పరచాలన్నా తృప్తి కలిగేది కాదు. సుందరి స్మృతులు ముల్లులాగా గుచ్చుకుంటూనే ఉండేవి. ఇదిగో... ఇలా గడిచిపోతోంది కాలం .. ఎవరికోసమూ ఆగదు కదా...

"మీ వంటి ఉత్తముడిని వదులుకున్న సుందరి నిజంగా మూర్ఖురాలు" అంది ఇందిర.

"అయితే ఇప్పటికి నేను మంచివాడినని సర్టిఫికేట్ ఇచ్చారన్న మాట!" చిన్నగా నవ్వాడు సుధాకర్. "మనిద్దరం కలుసుకున్న మొదటి క్షణం నించి పోట్లాడుకుంటూనే ఉన్నాం కదూ?"

ఇందిర నవ్వింది "మీలో కొద్దిగా మధు పోలికలు ఉన్నాయి. అందుకని పలకరింపుగా నవ్వితే —" సిగ్గుతో ముఖం ఎర్రబడగా ఆపేసింది.

**జరిగిన కథ — 14** సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఇందిర తల్లిదండ్రులు. తన తమ్ముళ్ళ, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర. డాక్టర్ జాక్సన్‌తో ఇందిరకు పరిచయం కల్గుతుంది. తన దగ్గర టైపిస్ట్‌గా జేరమని జాక్సన్ ఇందిరను ఆహ్వానిస్తాడు పరీక్షలవగానే చెల్లిని తీసుకురమ్మని తమ్ముళ్ళకి చెప్పి తను ముందుగా వస్తుంది ఇందిర. పట్నంలో పెరిగిన ఇందిరకు ఆ పల్లెటూరి వాతావరణం, అక్కడి మనుష్యుల మనస్తత్వాలు నచ్చుతాయి. ఉషని తీసుకవచ్చి దించి వెళతాడు సురేష్. పల్లెటూర్లలోని మనుషుల మనస్తత్వాలు ఎలా వుంటాయో, మూఢనమ్మకాలు వాళ్ళలో ఏ విధంగా పాతుకుపోయాయో తెలియజేయటానికి డాక్టర్ అరుణకు, ఇందిరకు గతంలో జరిగిన ఓ సంఘటన వివరిస్తాడు డా॥ జాక్సన్. ఇందిరకు పద్మ తన కథను వివరిస్తుంటుంది బావ ప్రసాద్‌తో తన పెళ్ళి ఇంకా రెండురోజులుండనగా అతని కాలికి ఫ్రాక్చరయి హాస్పటల్‌లో జేరతాడు పద్మ నష్టజాతకురాలని, ఆమె మూలంగానే తన కొడుక్కి ఈ విధంగా జరుగుతోందన్న మూఢనమ్మకంతో వారిద్దరి పెళ్ళి జరగకుండా చేస్తుంది ప్రసాద్ తల్లి. రమేష్ రాకకోసం ఎదురు చూస్తుంటారు ఇందిర, ఉష. ఇందిరకు సుధాకర్ తన ప్రేమ కథ వివరిస్తుంటాడు

తను కేవలం నవ్విందా!? తమాయించుకొని తిరిగి అంది "— మీరు ఏదో అపార్థం చేసుకున్నారు."

"నిజం ఇందిరా, ఎంత సిటీలో పుట్టి పెరిగినా హద్దులు మీరిన చనువు మంచిదికాదని నాకనిపిస్తుంది మరొక వ్యక్తితో మీకు అంతటి చనువు ఉండటం — ఉహూఁ, నాకు నచ్చలేదు —"

తన పర్సనల్ విషయాలు ఇతనికి నచ్చితే ఏం? నచ్చకపోతే ఏం? చర్రున కోపం వచ్చింది ఇందిరకి. "మీరు సుందరిని పెళ్ళి చేసుకోవాలని ఎలా అనుకున్నారో, నేను, మధు కూడా అలాగే అనుకున్నాం. మా పెళ్ళి ముహూర్తం కూడా నిశ్చయమయింది అందుకనే అతనితో నాకు చనువు ఉండేది."

"సారీ .. ఇప్పుడు ఏమయినాడు అతను?" మనసులో చాలాకాలంగా మెదులుతున్న ప్రశ్న అడిగాడు

"నా మనసులో అయితే స్థిరంగానే ఉన్నాడు నన్ను అర్థం చేసుకొని తిరిగి నాతో అనుబంధం కలుపుకుంటాడని ఏ మూలో ఆశగానే ఉన్నది."

"ఐసీ!" సుధాకర్ ముఖం సడెన్‌గా ఎందుకనో కళావిహీనం అయింది. రెండు నిమిషాలు ఆగి "స్త్రీ ప్రేమ నమ్మదగింది కాదని నేను ఇన్నాళ్ళూ అనుకుంటున్నాను. మిమ్మల్ని చూసి మార్చుకోవాలి నా అభిప్రాయం" తేలికగా అనాలని ప్రయత్నించాడు

"అవును! ఒక్క సుందరిని కొలతబద్దగా పెట్టుకొని మీరు అందరినీ అంచనా వేయకూడదు."

డాక్టర్ జాక్సన్ వచ్చారు ఆ గదిలోకి, "ఏమిటి సీరియస్‌గా డిస్కస్ చేస్తున్నారు?" అంటూ.

"అదేమిటో అంకుల్! నేను, ఇందిర పోట్లాడుకోకుండా మాట్లాడుకోలేము —" నవ్వుతూ అన్నాడు సుధాకర్.

"ఆపోజిట్ పోల్స్ అన్నమాట!" నవ్వారు ఆయన. "రేపు ఉదయం ప్రక్క పల్లెలోని ప్రారంభోత్సవానికి సుదర్శనంగారి కుటుంబం, సుధాకర్ వస్తున్నారు. ఉష, నీవు కూడా వస్తారుగా ఇందిరా? మీకూ కాస్త మార్పుగా ఉంటుంది."

డాక్టర్ జాక్సన్ ఈ చిన్న గ్రామంలో ఉంటూ ప్రజలకు అందిస్తున్న వైద్య సహాయాన్ని చూసి ముగ్ధులయిన ఇద్దరు యువక డాక్టర్లు, ప్రక్కనున్న మరొక పల్లెలో ప్రాక్టీస్ చేయటానికి నిశ్చయించుకున్నారు. వాళ్ళ క్లినిక్‌ని ఆ మరుసటి రోజు డాక్టర్ జాక్సన్ చేతనే ప్రారంభం చేయిస్తున్నారు. 'ఓ దీపం మరో దీపాన్ని వెలిగించింది' అనుకుంది ఇందిర.

"నేను, ఉష వస్తాము" అంది. "మనం ఎవరూ లేనప్పుడు పేషంట్స్ వస్తే ఎలా ?"

"మధ్యాహ్నానికల్లా తిరిగి వచ్చేస్తాం కదా! కాంపౌండర్‌గారు ఉంటారు, ఫర్వాలేదు–" అన్నారు. అంతలోనే ఎవరో రావటంతో ఆయన, సుధాకర్ బయటకు వెళ్లారు. సుధాకర్ కాగితాలు టైప్ చేస్తూ కూర్చుంది ఇందిర.

## 7

మర్నాడు నిద్ర లేచేసరికి ఇందిరకు తలనొప్పిగా, భారంగా ఉన్నది. టెంపరేచర్ చూస్తే మూరు డిగ్రీలు ఉన్నది.

డాక్టర్ జాక్సన్ వచ్చి చూసి మందులు యిచ్చారు. "ఈ పూటకి విశ్రాంతిగా పడుకోమ్మా. ప్రారంభోత్సవానికి రావద్దు" అన్నారు.

వేడి పాలు, బ్రెడ్ తీసుకొని వచ్చింది పద్మ. "నేనూ వెళ్ళను. నీకు తోడుగా ఉంటాను" అంది.

ఇందిర నవ్వి "ఈ కాస్త జ్వరానికి, నాకు తోడు ఉండనక్కర్లేదు పద్మా! మధ్యాహ్నానికి వచ్చేస్తారు కదా, ఏం కంగారు లేదు. సరదాగా వెళ్ళి రండి. ఏమయినా పత్రికలు చూస్తూ పడుకుంటాను" అంది.

పనిమనిషిని, రంగయ్యను ఇందిరకు సాయంగా ఉండమని చెప్పి అందరూ, ఉషతో సహా, జీపులో వెళ్ళిపోయారు.

ఇందిర కిటికీలోనించి బయటకు చూస్తూ పడుకుంది. సన్నగా వానజల్లు పడుతున్నది. మందుల ప్రభావం వలన కాబోలు, జ్వరం జారింది. కాని తలనొప్పి మాత్రం అలాగే ఉంది. ఇంట్లో ఎవరూ లేకపోవటం వలన విసుగ్గా ఉంది. రేడియో పెట్టింది.

"నీవు రావు... నిదుర రాదు..." తీయగా పాట వస్తున్నది.

నిద్రపుచ్చేందుకు కూడా ఎవరో రావాలి కాబోలు– ఏం పాట! విసుగ్గా రేడియో ఆపేసింది అంతలోనే తన విసుగుదలకు తనే నవ్వుకుంటూ, పేపరు తీసింది చదువుదామని. మనసు దానిమీద లగ్నం కాలేదు.

"పోస్ట్ !"

లేచి కూర్చుంది ఇందిర. పనిమనిషి కవరు తీసుకొని వచ్చింది. తనకేనా లెటర్ ? ఎవరు రాశారో ? మధు ఏమో... మధు ఇంత వరకు ఈ ఊరికి ఒక్క ఉత్తరమయినా రాయలేదు. అయినా ఎందుకో తనకు వచ్చే ప్రతి ఉత్తరమూ అతనివించే నేమోనని ఆశ పడుతుంది మనసు.

కవరుమీద దస్తూరి క్రొత్తగా వుంది. లోపలి కాగితాలు బయటకు తీసింది.

"చిరంజీవి ఇందిరకు ఆశీస్సులు..."

ఆశ్చర్యంగా క్రింద సంతకం చూసింది. పెదనాన్న రాశారు.



యోగక్షేమాల తర్వాత అసలు విషయం తెలియజేశారు. "ఇందిరా, మన స్వగ్రామంలో మా తాతగారికి కొద్దిగా పొలం ఉన్నది. ఆయన చనిపోయాక ఎవరో దాయాదులు దాన్ని చేస్తూ ఉండేవారు. మా నాన్న గారు ఉద్యోగరీత్యా ఆ గ్రామం వదిలి వచ్చేయటం, అది పెద్దగా పంట పండే పొలం కాకపోవటం వలన, దాన్ని గురించి ఎవరూ పట్టించుకోలేదు. నేను, మీ నాన్న అసలు ఆ విషయమే మరిచిపోయాము.

కొద్ది రోజుల క్రితం ఒకమారు వచ్చి వెళ్ళమని ఆ గ్రామం నించి ఒకరు నాకు ఉత్తరం రాస్తే, వెళ్ళాను. పొలం చేస్తున్న ఆయన ఇటీవల చనిపోయాడు. ఆయనకు పిల్లలు లేరు. ప్రక్క పొలం మోతుబరి రైతు ఒకరు దాన్ని కొని, తన పొలంలో కలుపుకోవాలనే ఉద్దేశంతో స్వంతదారుల కోసం వాకబు చేసి, నా అడ్రస్ తెలుసుకొని నాకు జాబు రాశారు. ప్రస్తుతం నాగార్జునసాగర్ పంట కాలువల వలన ఆ మెట్టపొలమంతా మాగాణిగా మారి, దాని విలువ బాగా పెరిగింది. ఇంతకీ ఆ నాలుగెకరాల పొలానికి ఆయన లక్ష రూపాయలు ఇస్తున్నారు. మీ కుటుంబానికి, నాకు చెరి ఏభై వేలు వస్తాయి. నేను పై ఆదివారం హైదరాబాదు వచ్చి, అన్ని విషయాలు స్వయంగా చెప్తాను. నీవు కూడా ఆ రోజుకి అక్కడికి రావలెను.

అకస్మాత్తుగా మీ నాన్న పోయినందుకు, భగవంతుడే మీ పట్ల ఈ విధంగా దయ చూపిస్తున్నాడని భావిస్తున్నాను ..."

ఉత్తరం చదవటం పూర్తయేసరికి ఇందిరకు ఇదంతా కలా, నిజమా అనే అనుమానం కలిగింది. తమకు ఏభైవేల రూపాయలు రాబోతున్నాయా ? ఇది నమ్మశక్యమేనా ? ఓ విధమైన అయోమయావస్థలో ఉండిపోయింది కొంతసేపు. తర్వాత మరొకసారి ఆ లెటర్ చదివింది నింపాదిగా.

దీని అర్థమేమిటి ? తమ్ముళ్ళ చదువులు ఏ ఇబ్బందీ లేకుండా గడిచిపోతాయి. ఉష ఎవరిపైనా ఆధారపడకుండా పెద్దదవుతుంది. తను ఉద్యోగం చేయవలసిన అవసరం లేదు. అంటే... అంటే... మధుని పెళ్ళి చేసుకోవచ్చు వెంటనే.. ఆరాటంగా ఎగిరిపడింది మనస్సు. 'మధూ, మాకు అనుకోకుండా డబ్బు వచ్చింది, అందుకని మనం పెళ్ళి చేసుకోవచ్చు' అని తెలియపరచాలా ?! అంటే, మధుతో పెళ్ళి డబ్బు అనేది అంత ముఖ్యమన్నమాట ! డబ్బు లేనపుడు పెళ్ళి జరగలేదు... డబ్బు వచ్చింది కనక జరుగుతుంది... చేదు మాత్ర మింగినట్లుగా అనిపించింది. ఇంతేనా తన స్వాభిమానం ? తను, మధు ప్రేమించుకున్నామనుకున్నారే, ఇదేనా ఆ ప్రేమకు అర్థం ? ఇందిర మనసంతా అల్లకల్లోలంగా అయింది.

'మధుని పెళ్ళి చేసుకోలేకపోతున్నానే అని బాధ పడ్డాను; అతనికి దూరమయినానే అని దిగులు పడ్డాను ఇన్నాళ్ళూ. ఇప్పుడు అతనికి దగ్గరయ్యే అవకాశం వచ్చింది. ఆనందంతో గంతులేయక, ఈ మనసు ఇలా ఆలోచిస్తున్నదేమిటి ? ఎక్కడుందీ లోపం ? ?' అని ఏవేవో ప్రశ్నలు ఇందిరలో.

తన మనసు తనకే అర్థమవటంలేదు. గదిలో కూర్చుంటే అదేమిటో మరీ ఉక్కిరిబిక్కిరిగా

# నీ లా కా శం

ఉన్నది. జ్వరం ఉన్నాసరే, కాస్సేపు బయటకు వెళ్ళాలనిపించింది. చెప్పులు వేసుకొని వరండాలోకి వచ్చాక గమనించింది, ఇంకా సన్నగా వానజల్లు పడుతున్నది. అలాగే స్తంభానికి చేరబడి నిల్చొని ఆలోచించసాగింది. మధు తనకు దూరం కావటానికి కారణం ఒక్కటే — అతను వెంటనే పెళ్ళి చేసుకుందామన్నాడు; తను డ్యూటీ వైపుకి వెళ్ళి వెంటనే చేసుకోలేనన్నది. అంతేకాని, సుధాకర్ని సుందరి మోసం చేసినట్లు తను అతన్ని మోసం చేయలేదు ! తను ఎందుకు ఇంతగా ఆలోచిస్తున్నది, అసలు— ఏమిటీ సంకోచం? ప్రేమకు, విధికి మధ్యన 'క్లాష్' వచ్చినపుడు తనను అర్థం చేసుకొని చేయూత నీయవలసిన బాధ్యత అతనికి లేదా ? ఇదేగా తన కంప్లెయింట్ ? ఒక్కో మనిషిది ఒక్కో తీరు — తమ్ముళ్ళ కోసం పెళ్ళి వాయిదా వేయటం అతనికి నచ్చలేదు. అందులో తప్పేంలేదు! ఇలా ద్వైదీభావాలతో సతమతమౌతూ నిలబడింది ఇందిర. చివరకు తన సంకోచాలకు అర్థం లేదని, హైదరాబాదు వెళ్ళి మధుతో అతను కోరినట్లే వెంటనే పెళ్ళి చేసుకోవటానికి సిద్ధంగా ఉన్నట్లు చెప్పాలని నిశ్చయించుకుంది. కాని మధు మనస్తత్వం గురించి సందేహాలు, తన నిశ్చయం సరయినదా, కాదా అనే సంకోచం మనసులో ఉండనే ఉన్నాయి.

గేటు తీసిన చప్పుడయింది. పద్మ బావ ప్రసాద్ వస్తున్నాడు. అతను సాధారణంగా ఇక్కడికి రాడు. ఉత్తరాలలోనే వ్రాసుకొని ఎక్కడో పద్మని కలుసుకుంటాడు. కాస్త ఆశ్చర్యం అనిపించినా "రండి !" అంది మామూలుగా.

"పద్మ వాళ్ళంతా ప్రక్క పల్లెలో ఫంక్షన్కి వెళ్ళారా ?" అన్నాడు వరండాలోకి వచ్చి.

"అవును. మీరు వానలో తడిసినట్లున్నారు."

"ఏమంత వాన కాదులెండి. సన్నజల్లు అంతే! పద్మకి నేను చెప్పినట్లు ఒక కబురు చెప్పాలి."

"అలాగే, ఏమిటి ?"

"ఈమారు నాలుగు రోజులు ఈ ఊరిలోనే ఉంటానని పద్మకు లెటర్ రాశాను. కాని రేపు రాత్రి నా కొలీగ్ ఒకతని పెళ్ళి హైదరాబాదులో. అందుకని ఈ సాయంత్రమే వెళ్ళిపోతున్నాను. తనను చూడనయినా చూడకుండా తప్పనిసరి కనక వెళ్తున్నాను, పై వారం మళ్ళీ వస్తానని చెప్పండి."

**చిరునామాలు : మనవి**

పత్రికలో పడ్డ రచయిత్రుల చిరునామాలు కావాలని రాయవద్దని మనవి. మీరు వారికి రాసే ఉత్తరాలు కేరాఫ్ ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం అని రాసినట్లయితే — మా కార్యాలయం వాటిని "రీ డైరెక్టు" చేయడానికి ప్రయత్నిస్తుంది. కనుక రిప్లయి కార్డులు రాయవద్దని మనవి.

— సం॥

"అలాగే !"

"ఆశపెట్టి, ఇలా వెళ్ళిపోవటమేమిటని పద్మ అలుగుతుందేమో ! ఇదిగో, ఈ శుభలేఖ చూపించండి." ఒక కవరు యిచ్చాడు.

"కాబోయే భార్యామణి అలకకు బాగానే భయపడుతున్నారే !" నవ్వుతూ అన్నది ఇందిర.

"తప్పుతుందా మరి ?" అతనూ నవ్వాడు "వెళ్ళొస్తానండి !"

ఇందిర కవరు తీసుకొని లోపలకు వెళ్తుంటే కవరు జారి చేతిలోనించి క్రిందపడి శుభలేఖ కొంచెం ఇవతలకు వచ్చింది. కవరు తీయడానికి వంగబోతుంటే అందులోని పేరు కనిపించి గుండె దడదడలాడింది

వరుడు—చిరంజీవి ఆర్. మధుసూదనరావు

వధువు— చిరంజీవి స్వర్ణలత.

ఆర్. మధుసూదనరావు. ఆంధ్రాబ్యాంకు.

మధూ... నీ పెళ్ళి... నాతో కాదు... ఎవరో స్వర్ణలతతో...

కాళ్ళు, చేతులు చెమటలు పోయగా అలాగే క్రింద కూలపడింది.

మధూ... ఇందాకనే మన పెళ్ళికి ఇంక అడ్డంకులు లేవనుకున్నాను... ఏ మూలనో సంకోచంగావున్నా, హైదరాబాదుకివచ్చి నిన్ను కలుసుకొని, 'నీవు కోరినట్లు పెళ్ళి వెంటనే చేసుకోవటానికి నేను సిద్ధమే' అని చెప్పాలనుకున్నాను. నయం, ఆ పని చేశాను కాను. బహుశా, అప్పుడు నీ భార్య నాకు ఎదురు వచ్చేది .. కళ్ళ నుండి నీళ్ళు జలజలా రాలాయి.

ఎందుకు – ఎందుకు – ఇలా చేశావ్ మధూ? కనీసం నన్ను ఒక్కమారు కలుసుకోనయినా లేదేం ? ఇన్నాళ్ళ స్నేహం, ప్రేమ వీటికి బొత్తిగా విలువ, తీసేశావెందుకని ? ?

చిన్నగా లేచి బయటకు వచ్చింది ఇందిర. జల్లు పడుతున్నా లెక్క చేయలేదు. అంతా అయోమయంగా ఉంది ఆలోచనల్లో మునిగిపోయి నడవసాగింది.

తనకు మధు మనస్తత్వం పట్ల సందేహాలు కలిగినట్లే అతనికీ తన స్వభావం గురించి సందేహాలు కలిగాయేమో ? తప్పేముంది ?— అని ఊరడించుకోవటానికి ప్రయత్నించింది. కాని మనసులో అతి సున్నితమైన చోట తగిలిన గాయం అది. కనీసం స్నేహితుడిగానయినా తనను కలుసుకోలేదేం ? ఇంతగా అతని మనసు విరిగిపోయేటంత తప్పు పని ఏం చేసింది తను ? పదే పదే ముల్లులా గుచ్చుకుంటున్నదీ ప్రశ్న.

వివేకం ప్రశ్నించింది — అతను నీ సమస్యలను అర్థం చేసుకోలేదని నీకు మాత్రం అతని పట్ల కొంతయినా మనసు విరిగిపోలేదూ ?

ఊహూ ... బాధ పడ్డానే కాని, కోపం తెచ్చుకోలేదు. అతన్నే పెళ్ళి చేసుకోవాలనే కోరికను చంపుకోలేదు. అతన్ని, తమ మధ్య కల ప్రేమానుబంధాన్ని ఏ మాత్రం మరిచిపోలేదు.

మనసంతా మండుతున్నట్లే ఉంది. లోపల జ్వరం కూడా ఎక్కువగానే ఉంది ఏం చేస్తున్నదో కూడా తెలియకుండా అలా నడుస్తూనే ఉంది. వాన వలన కాబోలు, వీధుల వెంట ఎక్కడా జనంలేరు.

( ఇంకావుంది )

# ఫాలాక్షుని డైరీ



## కొత్తరకం సమ్మె!

మధురైకు చెందిన పాండ్యరాజపురం అనే వూరిలోని వో పంచదార మిల్లులో పని చేసే 600 మంది పనివారూ తమ కోర్కె మేర బోనసు లివ్వలేదని వో కొత్త పద్ధతిలో తమఅసమ్మతి చూపనారంభించారట. పని చేసే కాలంలో వారు పెదవు విప్పి మాట్లాడరుట. పై అధికారు లడిగే ప్రశ్నలకు జవాబియ్యరట. వారి పని వారు చూసుకు, చేసుకు పోతారట.

### అలహాబాదు ఆస్పత్రిలో పిల్లల మార్పిడి!

అలహాబాదులోనవంబర్ 19 వతేదీన ఒక ఆసుపత్రిలో ఒకామె వో ఆడ పిల్లనూ, వో మగ పిల్లాడినీ కన్నదట. ఆ పక్కనే పక్క మీదున్నావిడ వో ఆడ పిల్లను కని, తనాడ పిల్లని యీవిడ పక్కలో పడేసి తాను ఆ మగ పిల్లాణ్ణి మార్చేసుకున్నదట. ఈ విషయం పై కవలలు కన్నావిడ అలహాబాదుకోర్టులో కేసు వేసి తన కొడుకైన ఆ పిల్లాడిని భారతదేశం దాటించే యత్నం జరుగుతోందని ఫిర్యాదుచేసిందట.అయినాఆ పిల్లాడినికెనడాలోనితమబంధువులకు పెంపకమిచ్చి ఆ మహాతల్లి పంపేసిందని యిప్పుడీ కవల పిల్లల తల్లి సుప్రీం కోర్టులో దావా వేసి తనకొడుకైనఆపసివాడిని తిరిగి భారతదేశం రప్పించాలని, ఆతన్ని అలహాబాదు కోర్టు రక్షణలో గాక, మరో కోర్టు రక్షణలో మార్చాలనీ కోరిందట!

### కుక్కని తిన్న క్షుద్బాధితుడు!

మిచిగాన్‌లో59ఏళ్ళ ఎమెరిక్అనే వో వృద్ధుడు క్షుద్బాధ తట్టుకోలేక పక్కింటి వారి కుక్కను కాల్చి, స్వాహా చేశాడట. ఈ కేసు విచారించిన డిస్ట్రిక్ట్ జడ్జి జాన్ స్పెయిర్స్ యీ సంఘటనకు విచారించి, "ఆకలితో కడుపు మాడే మనిషి ఏదైనా చేయగలడా, లేడా అనే విషయం నాకు సంబంధించినది కాదు. అతడు చేసిన పని చట్ట విరుద్ధమైతేనే నా వద్దకు వస్తుంది తీర్పు కోసం. కనుక యీ ఫ్లాయిడ్ ఎమెరిక్ అనే అతనికి 90 రోజుల కారాగార శిక్ష విధిస్తున్నాను" అన్నారట. ఎమెరిక్కేమంటాడు—పోన్లే యీ 90 రోజులయినాపుడు వుంటుంది అనుకుని వుండాలి.

### అంధురాలి సేవ!

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన సోంపేటలోనిఆరోగ్యం కన్నా ఆసుపత్రిలో మందాకిని అనే వో గుడ్డి నర్సు 1955 లో చేరిందట. ఈ 22 ఏళ్ళలో ఆమె తన పనితనంవల్ల ఆసుపత్రిఅధికారుల, రోగుల మంచిని సంపాదించిందట. ఈమె ఇంజక్షని వ్వడం,స్పాంజి బాత్‌లు చేయించడం, పక్కలు సరిచేయడం వంటి అన్ని పనులూ తడుముకుంటూనే ఎంచక్కా చకచకాచేయగలదట.

### మోసానికి శిక్ష!

తానొక షెడ్యూల్ కులానికి చెందిన వాడినని కలకత్తాకు చెందిన యస్. కె. దత్తా అనే అతడు పబ్లిక్ సర్వీస్ కమిషను వారిని మోసగించి రికార్డులు సృష్టించి 1968 లో సెంట్రల్ సివిల్ సర్వీసెస్ లోవో ఉద్యోగం,ఆనక రెండేళ్లలోఐ.ఏ.ఎస్. ఆఫీసరుగానూ జీవితాన్ని స్థిరపరుచుకున్నాడట. ఈవిషయంబయటికివచ్చి అతనికి రెండేళ్ళు కఠిన కారాగార శిక్షను అతనికి సహాయం చేసిన ఏ. పి. ముఖర్జీకి వో ఏడాది సాదాశిక్ష వెయ్యి రూపాయలు జరిమానాను విధించిందట చట్టం—

### జులాయిలకి కొత్తశిక్ష!

మద్రాసు రాజ వీధులలో ఏ పనీ పాటా లేకుండా జులాయిగా తిరుగుళ్లు తిరిగే వారికి నగర డెప్యూటీ సూపరింటెండెంట్ ఆవ్ పోలీసు వో కొత్త శిక్షను ఆరంభించదలుచుకున్నట్టుచెప్పారట.అట్టియువకులను పట్టుకుని, వారు కనుపించిన చోటే నిలబెట్టి వో గంట సేపు ట్రాఫిక్ కాన్‌స్టబుల్‌కు సహాయంగా ఉండేలా చేస్తారట. దీనివల్ల పౌర హక్కులతో పాటు పౌర నీతి కూడా ప్రజలకర్థమవుతుందన్నారటాయన.

### అలవాటులో పొరపాటు!

ఢిల్లీలో ఏషియాడ్ క్రీడోత్సవాల ఆరంభ శుభ సందర్భంలో టార్చిని పట్టుకునే సద్భాగ్యం కలిగిన వారి లిస్టులో సురేష్ గోయల్ అనే వో బ్యాండ్ మింటన్ చాంపియన్ పేరు కూడా వున్నది. అసలు విచారకరమైన, ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఆ సురేష్‌గోయల్‌చనిపోయి నాలుగేళ్ళయిందట— మరెలా వస్తాడాయన!

### జపాన్‌లో నాలుగో బుల్లెట్ రైలు!

టోక్యోనుంచి జపాను నదిఒడ్డున వున్న నిగ్నటా అనే వూరుకు జపాను బుల్లెట్ ట్రయిన్ వేసిందట. ఇది నాలుగో ట్రయినట. ఇది గంటకు 130 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తుందట. ఈ రైల్వే లైను వేయడానికి మైలుకు 38 మిలియను పౌనులు ఖర్చయిందట. ఈ లైనుతో మొత్తం జపానులో 1127 మైళ్ల బుల్లెట్ ట్రయిన్ ఆయా మార్గం అయినదట. ఎంతైనా జపాను జపానే!

### సముద్రంలో దున్నపోతు!

మార్మ గోవాసముద్రంలో వో పన్నెండు మంది జాలరులు వో పెద్ద వల విసిరి, కాస్సేపు కూర్చుని ఆహా పడింది అని వలలోకితొంగిచూసి ఆశ్చర్యంతో ఎగిరి గంతేశారట. వాళ్ళకి వలలో ప్రాణం వున్న వో దున్నపోతు పడ్డదట. *



# వృద్ధాప్యంలో ఓ బామ్మ

[10వ పేజీ తరువాయి]

"నా చొక్కా నువ్వు తొడుక్కోవచ్చా బామ్మా !' నవ్వుతూనే అడిగాడు.

"అయ్యో, ఏంరా ! బాగోలేదా ?"

"ఊఁహు, బావుండలేదుగాని, ఇందాక నువు, అన్నయ్యా ! అని పిల్చేవు ఎవర్ని ?" అంటూ దగ్గరకెళ్ళి నెమ్మదిగా ఆ చొక్కా ఊడదీసేశాడు.

"నిన్నే పిల్చానురా !"

"నన్నలా పిలవొచ్చా ! నీకు నేను మనవడ్నవుతానని మర్చిపోయావా !" చిర్నవుతోనే గద్దించినట్టడిగాడు.

"నాకిపుడెవరూ అన్నయ్యలు లేరుగదరా, నిన్నంటే తప్ప ! అయినా నువు చూస్తే నాకంటే పొడుగ్గా కనబడుతున్నావ్ – పేరెట్టి పిలిస్తే ఏం బావుంటుంది చెప్పు !"

"బావుంటుందిగాని పేరెట్టే పిలువ్. ఏం ?"

ఆవిడ దానికి బుద్ధిగా ఊఁ కొట్టి, అగరొత్తుల నుండొచ్చే పొగని చూస్తూ కూర్చుండిపోయింది

ప్చ్, ఎలా ఈవిడ్ని మామూలు మనిషిని చేయటం? మునుపటంతబాగా ఉండకపోయినా తన గురించి తను తెలుసుకో గలిగితే చాలు, మరీ నానిగాడి కంటే అధ్వాన్నమైపోయింది

"చూడు బామ్మా నే నెవర్ని ?"

"అదేమిటా అలా అడుగుతావ్ ! నాకు గుర్తు లేదనుకున్నావా ! నా ప్రసాదువి, ఆయన పేరే గదరా నీకు పెట్టుకున్నది." టక్కున సమాధానమిచ్చింది.

"మరది బాగా తెలుసుగనా ! ఆ పక్క దుప్పట్లన్నీ పాడజేసావు ఎలా పడుకుంటా మని ?" గద్దించినట్టడిగాడు.

"ఏ దుప్పట్లురా; ఓహో అవా ! నానిగాడు పాడుజేసుంటాడురా, అయినా ఇంత వయసొచ్చి నేనటువంటి పని చేస్తానా ! ఇంట్లో అందరూ అనేది చాలక నీక్కూడా నేను లోకువయ్యానుటా !" ముక్కు ఎగబీల్చుతూ పమిటచెంగుతో కళ్ళు తుడిచెయ్య సాగింది.

ఆవిడ్నలా చూసి ప్రసాద్ కంగారుపడిపోతూ– ఆవిడ కళ్ళు తన చేతిగుడ్డతో తుడిచేసాడు. "అబ్బ. ఈవిడకింకెలా చెప్పాలి !"

"బామ్మా, నేనంటే నీ కిష్టముందా !" ముందుకువంగి లాలనగా అడిగాడు.

"చాలా ఇష్టం" నొక్కి చెప్పిందామె.

"మరి నేనెలా చెప్తే అలా వింటావా ?"

"ఎందుకు వినను. నువ్వెలా చెప్తే అలా వింటాను, నువ్వేం చెయ్యమంటే అలా చేస్తాను."

"బామ్మా, నీ పక్క దుప్పట్లు నువ్వే పాడు చేస్తున్నావు. నే నబద్ధం చెబుతానా ! అలా ఖరాబ్ చేస్తుంటే రోజుకో దుప్పటి రత్తి తీసుకెళ్ళిపోతుంది. అలా రోజూ పోతే మనకెంతనష్టమో చెప్పు. మేం బికార్లలా అయితే నీకు బాగుంటుందా..."

అతడా మాట పూర్తి చెయ్యకుండానే ఆవిడ కళ్ళు పెద్దవైనాయి. "అదేమిట్రా దుప్పట్లన్నీ రత్తికిచ్చేస్తున్నారా ! మీ అమ్మ ఉతకడం లేదూ !' ఉడుక్కుంటున్నటు గా అడిగిందావిడ

"ఊఁహు"

ఆవిడ ఊరికే లబలబలాడిపోతూ కోడల్ని అనేక విధాల శాపనార్థాలు పెట్టసాగింది

"అదెపుడూ 'నెరజాణ'రా, నన్నెపుడు చూసింది గనకా– నేను చెప్పినమాట విన్నది గనకా? ఇప్పుడైనా నన్ను కాస్తంత కనిపెట్టుకోనక్కర్లేదూ !"

చకచకా అనేస్తుంటే ఆవిడనే వింతగా చూస్తుండిపోయాడు ప్రసాదు.

నిజానికి తల్లిదేం తప్పులేదు మొన్న మొన్నటి వరకూ ఆవిడ అమ్మని ఆజ్ఞాపిస్తూ వచ్చింది. ఏమాత్రం ఆవిడ ఆజ్ఞలు జవదాటినా అప్పటికప్పుడు తలవాచేలా చివాట్లు పేది. తండ్రి కూడా తన తల్లిమీదుండే అభిమానంతో భార్యనేమీ మాట్లాడనిచ్చే వాడు కాదు.

ఇపుడు ఏం చేయలేని స్థితిలో కూడా ఓ మూలన కూర్చునుండక కోడల్ని ఈ విధంగా శిక్షించాలనుకుంటుందా ? అర్థంకాని ఆలోచనతో అయోమయంగాఆమెనే చూస్తుండిపోయాడు.

ఆమె ముఖంలో నుండి కోపచ్ఛాయలింకా పోలేదు. ఇపుడేం చెప్పి ప్రయోజనం లేదు అనుకుని నెమ్మదిగా తనగదికి జారుకున్నాడు.

ఈ బామ్మతో అమ్మ పాపం ఎలా వేగుతుందో ఏమిటో? ఇంటెడు చాకిరీతో బాటు ఈమెను చూసుకోవడమంటే మాటలా ?

ఒదినకు వచ్చే అహంకారం తప్ప ఏమీ ఆలోచించదు.

"ఏం చేస్తున్నావురా ప్రసాదూ!' అంటూ వచ్చిన తల్లి పిలుపుతో తేరుకున్నాడు.

"అదేనమ్మా బామ్మని గురించి..."

"ఏం బామ్మోలేరా! ఆవిడతో క్షణం తీరుబడి లేకుండా ఛస్తున్నాను. అంతా చేసినా ఇంకా తనని పట్టించుకోవడం లేదంటూ అరుస్తుంది. ఈ రోజు మాత్రం నా ప్రాణం హాయిగా ఉంది. అసలు నువ్విలా చెప్తే అలా చేస్తుందంటే నాకే ఆశ్చర్యం వేసింది. మా కైతే ఆవిడ్ని బైటకు తీసుకొచ్చి స్నానం చేయించడమే బ్రహ్మ ప్రళయమయేది; ఈ సెలవుల్లో ఎటూ వెళ్ళక ఇక్కడే ఉండు బాబూ— నీ మాటెంత బాగా వింటుందో ఈ రోజు తెలిసింది కదా!"

"అదెలా వీలవుతుందమ్మా! అక్కడ నా ఫ్రండ్సంతా జాలీ ట్రిప్ వేసే ప్రయత్నంలో రెండు రోజుల్లోనే తిరిగి రమ్మని చెప్పారు. నేనుకూడా మీ అందర్నీ చూసి వెంటనే వెళ్ళిపోవాలని వచ్చాను."

"బాబ్బాబు ఈసారికా ప్రయాణం వాయిదా వేసుకో— ఒక్క పది రోజులు ఆవిడ్ని మంచిమాటలతో దార్లో పెడితే ఆ తర్వాత నాపాట్లేవో నేను పడతాను — ఆలోచించుకో" అంటూ అతడ్ని సందిగ్ధంలో పడేసి బైటకెళ్ళిపోయింది.

'ఓరి దేవుడా!' అనుకుంటూ పచార్లు మొదలెట్టాడు. అమ్మ అసలు తననిబుద్ధిగా 'ఎక్కడైనా వెళ్ళిరారా అబ్బాయ్ శుభ్రం చేయిస్తాలే' అంది. తను వినక, అయినా తనుఓ 'మెడికో'గా బట్టి ఏ విధమైన అరమరికలూ లేకుండా తనే పూనుకున్నాడు. ఇపుడు అమ్మేమో ఆవిడ్ని తనే దార్లో పెట్టాలంటుంది, ఇదయ్యేపనా?

"ఏం ఎందుక్కాదూ! ఆవిడ నిన్ను ఎంతలా సాకింది? ఆ మాత్రం చూడలేవూ?" అంతరాత్మ దుయ్యబట్టసాగింది.

తల్లి ఎంత ప్రాధేయపడింది! అయినా బామ్మనీవిధంగా వదిలి ఫ్రెండ్స్‌తో వెళ్ళినా మనసంతా ఇటే ఉంటుంది; ఆ మధ్యాహ్నానికే వొక నిశ్చయానికొచ్చేసాడు.

మర్నాడే మిత్రులకో ఉత్తరం రాసి పడేసాడు. తను రాలేకపోతున్నందుకు మరేవేవో కారణాలు చెబుతూ —

ఆ రోజు నుండి రత్తి పనిలోకి రావల్సిన టైము కూడా చెప్పేశాడు. ముసలమ్మగారి పన్ను చూడడం నా వల్ల కాదని అది ముందు మొండికేసినా పాతిక రూపాయలు ఆవిడ పని నిమిత్తం అదనం ఇస్తాననడంతో మరి మాట్లాడలేదు.

ఆవిడ నిద్ర లేచే టప్పటికి రత్తి హాజరవడం, వెంటనే ఆవిడని బైటకు తీసుకొచ్చి కాలకృత్యాలు తీర్పించి లోనికి తీసుకెళ్ళడం యాతనే అనిపించినా, నాలుగు రోజులయేటప్పటికి దినచర్యలో ఒక భాగమై ఎవరికి కష్టమనిపించలేదు.

ఇంట్లో అందరి ప్రాణాలూ స్థిమిత పడ్డాయ్ తండ్రి ప్రసాద్‌ని మెచ్చుకోలుగా గమనిస్తుండిపోయాడు.

అన్న రాఘవ కూడా తమ్ముడు మగాడై ఉండీ బామ్మతో అవస్థ పడుతున్నందుకు బాధపడి భార్యదగ్గర వెల్లడించాడు. 'ఇటు ఇంటి విషయం పట్టించుకోవు, బామ్మ విషయం పట్టించుకోవు! తమ్ముడ్ని చూడ'ంటూ -

"చాల్లెండి చెప్పొచ్చారంటూ" ఆవిడ కస్సుమంది. "పల్లెలో ఉన్న నాలుగెకరాల మాగాణీ అతగాడికి రాసిందిగానీ మీకిచ్చిందా, నాకిచ్చిందా? ముద్దుల మనవడికి ఇచ్చుకుంది గాబట్టి అతగాడికే ఉన్నయ్ — ఆవిడ్ని చూసుకోవల్సిన బాధ్యతలన్నీ."

రాఘవ కాస్త మెతక మనిషి. మళ్ళీ ఏం అంటే ఏం తంటా వస్తుందోనని మరా విషయం ఎత్తలేదు.

ప్రక్కగదిలో కూర్చుని పేపరు చదువుతున్న ప్రసాదు వీరి సంభాషణ చెవులకు సోకి నవ్వుకున్నాడు. 'నా కిద్దరు కొడుకులూ ఒకటే' అంటూ తండ్రి ప్రసాదు ఒప్పందంపై అపుడే సమానంగా పంచేసాడు. ఆ విషయం వీరికి తెలుసుండదు, నాన్న బహుశా చెప్పి వుండరు.

* * *

బామ్మకి పెట్టే ఆహారంలో కూడా మార్పు చేయించాడు.

పొద్దుట రెండిడ్లీ కాఫీ తప్ప, ఉప్మాగాని మరేరకపు పదార్థంగాని అసలు చూపించకూడదని, అలాగే అన్నంలో కూడా ఆకు కూరలూ, తేలిగ్గా జీర్ణమయే కూరలే పెట్టాలంటూ తల్లికి ముందుగానే చెప్పాడు.

రెండు వారాలు ఏ చికాకులూ లేకుండా జరిగిపోయాయి. ప్రసాద్‌కి బామ్మ అంటే ఉన్న ఇష్టంవలనో ఏమో ఆవిడ చేసే చిన్న పిల్లల చేష్టలు వేటికీ ఏదురు చెప్పలేదు. నానిగాడు బామ్మతో ఏవో కథలు మొదలెట్టడంతో నెమ్మదిగా బట్టలు మార్చుకుని బైటకొచ్చేసాడు. అతడలాగే అప్పుడప్పుడూ బామ్మని మాయచేసి అన్నగార్కి సహాయంగా షాప్‌కి వెళ్తుంటాడు.

ఆ రోజు వెంకటేశ్వరలో ఏదో క్రొత్త తెలుగు పిక్చరొచ్చిందని వెళ్ళాడు. తిరిగి వచ్చేటప్పటికి బామ్మ ఇంట్లో నానాహంగామా చేస్తోంది. అమ్మని ఏవేవో శాపనార్థాలు కూడా పెట్టడం వినరావడంతో — ఒక్క



అంగలో బామ్మ దగ్గరకెళ్లి భుజమ్మీద వెయ్యేసి, బుజ్జగింపుగా అడిగాడు అసలేం జరిగిందంటూ —

అతడిని చూస్తూనే 'వచ్చావురా ప్రసాదూ!' అంటూ ఏడ్వెయ్యసాగింది. ఏం పాలుపోక తల్లివేపు చూసాడు ఏమైందన్నట్లుగా.

'ఏవుందీ నువ్వెళ్ళిన అరగంటకే 'ప్రసాదూ ప్రసాదూ' అంటూ కేకలు మొదలెట్టింది. వాడులేడు సినిమాకెళ్ళాడు వచ్చేస్తాడు అన్నా నా మాట వినదు కదా! 'వాడిక్కడుంటే నన్ను బాగా చూసుకుంటూ, నాకేం కావాలో కనిపెట్టుకుంటున్నాడని వాడ్ని మీరే పంపేశారు. నేనుకూడా వాడి దగ్గరికే వెళ్ళిపోతా' వంటూ ఎలాగో ఓ జత బట్టలు వెదుక్కుని చంకనెట్టుకుని బయల్దేరుతుంటే, ఎలాగో బ్రతిమాలి తీసికెళ్ళి కూర్చోబెట్టి నేను పని చూసుకుంటున్నాను. పది నిమిషాలకే నాని గాడి అరుపులు విని వచ్చి చూద్దునుకదా ఏవుందీ— ఈవిడ వీధి చివరికంటూ నడుచుకుంటూ వెళ్ళిపోయింది. నేను కంగారుగా వెళ్ళి నయానా భయానా చెప్పగా వెనక్కి తిరిగిందిగాని, ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్యలేకపోతోంది. నడవలేని దానవు ఇంత దూరం ఎలా వచ్చావంటే— ప్రసాదు కనిపిస్తాడని వచ్చానుగాని, నేనిపుడింతమా తం ఇంటికి నడవలేనంటూ మొండికేసింది. వీధి పొడుగునా అందరూ చూడడమే, సిగ్గుతో ప్రాణం చచ్చిపోయిందనుకో! అటు వెళ్ళే రిక్షానిపిల్చి ఎక్కించుకొచ్చాను. అతడికి

# వృద్ధాప్యంలో ఓ బామ్మ

డబ్బులిచ్చి పంపించి లోనికొచ్చానో లేదో మళ్ళీ వెళ్లిపోతానంటూ మొదలెడుతుంది.'

అమ్మ అంతా చెప్తుంటే నా తల గిర్రున తిరగసాగింది.

"నే నెన్నాళ్ళు ఈవిడిని కాచుకుని ఉండగల్ను! మరో నాల్రోజులకైనా నేను వెళ్ళాల్సిందేగదా! అలవాట్ల ప్రకారం నడుచు కుంటుందికదా— ఇక ఎవరికీ ఇబ్బంది ఉండదనుకుంటే కథ మళ్ళీ మొదటికొచ్చింది. తను రావడం మొదటికే ముప్పు వచ్చినట్లుగావుంది. ఇకనుండి వీధినకూడా పడేలావుంది. భగవంతుడా, యిపుడేదిదారి!" అనుకుంటూ తలపట్టుకున్నాడు.

పెరట్లో నాలుగడుగులు వేయడానికే ఆయాసపడే బామ్మ అంత దూరం ఎలా నడిచిందో అర్థం కాలేదు. తనని చేరుకోవాలనే ఉద్దేశ్యంతో ఉడిగిన జవసత్వాలను కూడా లెక్క చేసుండదని సరిపెట్టుకున్నాడు.

'మరి నే నెపుడూ నీ దగ్గరే కూచుంటే నా చదునేం కావాలేం? సెలవులవగానే నే వెళ్ళొద్దు!' అక్కడే కుదురుగా కూర్చున్న బామ్మవేపు చూస్తూ అడిగాడు.

"అమ్మో నన్నీ రాక్షసుల మధ్య మాత్రం వదిలి వెళ్ళకురా అబ్బిగా, వెళ్తే నన్ను కూడా నీతోనే తీసుకెళ్ళు"

అంత చికాకులోనూ వాళ్ళని రాక్షసుల్ని చేసినందుకు, తనని 'అబ్బిగా' అన్నందుకు ఫక్కున నవ్వాడు

చిన్నప్పుడు తనని అందరూ 'అబ్బిగా' అనే పిల్చేవారు. అప్పటి రోజుల్లో అదో ముద్దు పేరు. హైస్కూలులో చదివే రోజుల్లో తోటివిద్యార్థులు ఇంటికొచ్చినపుడు కూడా బామ్మ తనని పదే పదే పిల్చే ఆ పిలుపు అందరికీ వెక్కిరింతయేది.

ఇంటి దగ్గరెంతో మారాం చేసి ఆ పేరు నెమ్మది మీద మాన్పించి— అసలు పేరుతో పిల్చే అలవాటు చేసాడు. ఇన్నాళ్ళకు బామ్మ మళ్ళీ ఆ రోజుల్లోకి వెళ్ళింది.

అన్ని కబుర్లు చక్కగానే చెబుతుంది. అసలిదంతా అమ్మమీద పేరుకున్న కసితోనే చేస్తుందేమోనన్పించి, బామ్మ మీద మొదటిసారిగా కోపం ముంచుకొచ్చింది

జ్ఞానంనశించాక ఇంకెలా చెప్తే ఈవిడకు అర్థమవుతుంది? కాస్త ఏమైనా మందలిద్దామంటే ఆవిడ మీదుండే అభిమానం వెనలా చెయ్యలేకపోతున్నాడు.

"ఒరే అబ్బిగా .."

ప్రక్కన కూర్చున్న బామ్మ ఏదో సందేహాస్పదంగా పిలిస్తే, ఆమెను చూశాడు—

"అదేరా! పెద్దాడి పెళ్ళాం ఇంటి పెత్తనమంతా చెలాయిస్తుంటే— నీ పెళ్ళాన్ని తీసుకరాకండా ఇంకా ఎక్కడ అట్టి పెట్టావురా!"

ఈ సారి నవ్వు దాచుకుందామన్నా దాగలేదు ప్రసాద్‌కి ఆవిడ మీదున్న తాత్కాలిక కోపం పటాపంచలైంది.

"ఎందుకు, నన్ను కాల్చుకు తినేది చాలక నా పెళ్ళాన్ని కూడా కాల్చుకుతినాలనుందేవిటి?" ఆవిడ్ని ఉడికింపుగా అడిగాడు.

"నిన్నేం చేశానురా ప్రసాదం! నీ కేమైనా ఇంత దెబ్బ తగిలితే, ఆ బాధ నాకేనన్నంతగా గిలగిల లాడిపోయేదాన్ని నీవిలా అయిపోయావేంరా? ఆవిడ్ని నేనేం అనను గాని ఒక్కసారి తీసుకొచ్చి చూపించరా— చచ్చేలోగా చూసిదస్తాను. అయినా మీ అమ్మ అంటే నాకు మంటగాని మీ ఆవిడంటే నా క్కోపమేమిటి చెప్పు? ఇప్పుడేపోయి తీసుకు రారా..."

కాస్తంత దూరంలో కూర్చుని సన్నజాజులు మాలకడుతున్న రాధ ఆవిడ మాటలు విని పకపకా నవ్వింది.

ఏమిటంటూ అక్కడకు వచ్చిన లలితమ్మగారు సంగతంతా విని, "వాడికింకా పెళ్ళి కానిదే ఎవర్ని తీసుకొచ్చి చూపించమంటారు? అయినా బ్రతికినంత కాలం నన్ను సాధించడమే ధ్యేయంగా పెట్టుకున్నారు — కన్న



కూతురి కంటే ఎక్కువగా మీ సేవలన్నీ చేస్తున్నాను – ఇప్పుడైనా ఆ ధోరణి మార్చుకుని నన్నభిమానించడం చేతకావడం లేదుగాని, ఇంకా వాడి పెళ్ళాం కూడా రావాలా'' అమ్మ అనేది ఏం విన్పించుకోనట్లుగా ఉండిపోయింది బామ్మ భోజనం టైము కావడంతో అన్నం పెట్టి, ఆమె గదిలోకి పంపించేసారు.

తనిక నాలుగు రోజుల్లో వెళ్లిపోవాలి! దినచర్యకి బాగానే అలవాటు పడింది గాబట్టి, అమ్మని ఇప్పట్లాగే చూసుకోమని చెప్పాలి తను అన్నట్లుగా వెళనందుకు రవీంద, కవి మటుకు చాలా కోపంగానే ఉండి ఉంటారు వాళ్ళని డిజప్పాయింట్ చేసినందుకు— అసలు వాళ్ళయినా వెళ్ళారో లేదో కూడా ఒక్క లెటరైనా రాయలేదు వెళనందుకు ఏం చెప్పాలా అనుకుంటూనే నిద్రలోకి జారుకున్నాడు.

పొద్దున్న లేచేటప్పటికి ఆరయింది. పేస్ట్, బ్రష్ తీసుకుని బామ్మ గది వేపు వెళ్ళాడు మంచంపై ఆవిడ కనబడక పోవడంతో కంగారుగా బైటకొచ్చాడు. తులసి కోట ప్రక్కనే కూర్చుని రత్తిని పూలు కొయ్యమని ఆజ్ఞాపించడం చూసి స్థిమిత పడ్డాడు.

'ఔనూ, పూలెందుకు బామ్మా?' దగ్గర కెళ్తూ అడిగాడు.

''లేచావా! దా ఇలా కూచో!' అంటూ ఆవిడ ప్రక్కన చోటు చూపిస్తూ, ''ఈ రోజు ఏకాదశట్రా! నాకా సంగతి మీ అమ్మ ముందుగా చెప్పాలా వద్దా? ఆవిడ ఒక్కర్తీ చేస్తే నాకు పుణ్యం వస్తుందట్రా? నాలుగు చివాట్లేసేను — మళ్ళీ మాట్లాడ లేదు...''

అపుడు బాగా పరిశీలించాడు బామ్మని – శుచిగా స్నానంచేసి, నుదుట కాస్త విభూతి పెట్టుకుని, చేతిలో భగవద్గీత అడ్డదిడ్డంగా పెట్టుకుని కూర్చుంది.

రత్తి అంతలో పళ్ళెంనిండా పువ్వులు తెచ్చి అందించి, నావేపు తిరిగి ''అబ్బాయి గోరూ ఇయేల బామ్మగారు ఎంత తెలివిగా సేత్తన్నారనుకున్నారు పన్లన్నీను! నేను వచ్చి గదిలోంచి బామ్మగార్ని నడిపించుకుని తీసుకొస్తంటే-అమ్మగారపుడే తానం జేసి, పూజ్జేసుకుంటూ నేసియ్యాల గుళ్ళోకెల్తాను, పని చూసుకోయే అంటం విని, 'పొద్దున్నే

# వృద్ధాప్యంలో ఓ బొమ్మ

గుళ్లో 'కేంటి' అంటూ బామ్మగారడిగేరు' ఆరేమో ఇయాల ఏకాదశి అని సెప్పేతలికి రయ్యిమంటూ కాసేపు అమ్మగోర్ని కూకలేసి తనుకి తనే తొణాల దొడ్లో కెళ్లిపోయి, అమ్మగోరు ఏడినీళ్ళు తెత్తున్నా అంటన్నా ఇనకండా సన్నీళ్ల తలంటాజేసి, "నేనియాల ఏం తిన్ను, ఉపాసముంటాను – ఇక్కడ పూజ్జేసుకుంటా" నని నన్ను పూలట్టమ్మని తరివితే నేను తెచ్చిచ్చాను..."

అయితే బొమ్మ కాస్త మనలోకొస్తుం దన్నమాట! అని తృప్తిగా నిట్టూర్చి, 'వెళ్ళి నీ పని చూసుకో' అంటూ రత్తికి సైగ చేసాడు.

పూలు తీసుకుని బామ్మ దేవుడి గదిలో కెళ్తుంటే, మరింత హాయిగా అన్పించి – ముఖ ప్రక్షాళన పూర్తిగావించాడు.

వెళ్ళిన కాస్సేపటికే ప్రసాదం అంటూ అరుస్తుంటే 'ఏమిటి బామ్మా ఎందుకు' అంటూ వెళ్లాడు.

"మీ అమ్మ ఏం జేసిందో, చూశావురా!"

"ఏం జేసిందేం ?"

"ఇక్కడ నేను పెట్టిన బాబా పఠం తీయించేసింది– చూశావా నే నంటే దాని కెంత నిర్లక్ష్యమో! దీని దురుసు కాస్త వదిలించేస్తాను..."

గభాల్న లేచి వంటింటివేపు వెళ్తుంటే కంగారుగా ఆపుచెయ్యబోయాడు కానీ ఆగి తేనా ? ఆవిడి త్రోసిన తోపుకి గోడకి తగిలిన తల మర్దించుకుంటూ "బామ్మ కెంతకోపం! అమ్మతో యుద్ధం చేసే వీరుడిలా వెళ్ళిపోతోందను"కుంటూఉండగానే –'దబ్' మన్న శబ్దంతో పాటు 'అమ్మా' అన్న అరుపు. వేగంగా పరుగెత్తాడు.

మొదటే మైంది అర్థం కాలేదు. ఆలోచిస్తే పంచ బొటన వ్రేలికి చిక్కుకుని గడప తన్నుకుని అంతదూరం విసిరినట్టు బామ్మ పడిందని తెలిసింది.

అమ్మ కంగారుగా గ్లాసెడు మంచినీళ్లు తెచ్చి త్రాగించడానికి ప్రయత్నించింది. అప్పటికే బామ్మ స్పృహతప్పడంతో – తన కాళ్ళు దడ దడ లాడాయ్. గబ గబా వెళ్ళి దగ్గర కూర్చుని ఆమె తల నెమ్మదిగా లేవనెత్తి తను బాగా కూర్చుని తల ఒళ్లో పెట్టుకొన్నాడు–ముఖం తడిగుడ్డతో తుడిచి, తెరుచుకున్న నోటిలో కొంచెం కొంచెం నీళ్లు పొయ్యసాగాడు.

కన్నంలో పోస్తున్నట్టుగా అవి జారుతుంటే, గుటక వేస్తుందనుకున్నాడు గాని, ఆమె ప్రాణం అప్పటికే అనంత వాయువుల్లో కలిసిపోయిందని తెలుసుకో డానికి మరో నిమిషం పట్టింది.

నాన్నా, అన్నయ్యా, అందరూ కూడా ఘొల్లు మంటుంటే – ఉబికివచ్చే కన్నీటిని దిగమింగుతూ ఆవిడనీ 'ప్రాపంచిక చింతన'ల నుండి దూరంచేసి, తనలో ఐక్యం చేసుకున్న భగవానుణ్ణి మనసారా ప్రార్థించి తేలిగ్గా నిట్టూర్చాడు ప్రసాద్.

## ధన్య జీవితం

నీ కళ్ళు –
కామ జ్వాలలు రగిలిస్తే
నా రాజ్యంలో నీ స్థానం సున్న !
అవే ప్రేమధారలు కురిపిస్తే
నాకు నువ్వందరి కంటె మిన్న !!
నీ కాళ్ళు –
పరువపు ఉరకలతో
పరుగులు తీస్తే నాకొద్దు !
పరమోన్నత పథంలో
పయనిస్తే నా కెంతో ముద్దు !!
నీ హస్తాలు –
ప్రణయ పరిష్వంగాల కోసమే
ప్రాకులాడితే నా మనసుకి కష్టం !
పగిలే హృదయాలనవి తాకి
పరితాపం కలిగిస్తే నా కిష్టం !!
నీ తనువు –
పిచ్చి-పిచ్చి కోర్కెలకు
పట్టుకొమ్మైతే అది ఏహ్యం !
పీడితుల సేవకై దాన్ని
పణంగా పెడితే అదెంతో ధన్యం !!

– దొడ్లంకి వెంకట్రావ్

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

# తారక రామునికి పట్టాభిషేకం !

తెలుగుజాతి ఆత్మ గౌరవం గెలిచింది. ఇక చీటికి మాటికి ఢిల్లీకిపరుగులుతీసే పనిఉండదు. తెలుగువాడు తెలుగువానికోసం తెలుగులో తెలుగు జాతికిఅనుగుణంగా నిర్ణయాలు చేసుకుని ఆచరణలో పెట్టుకుని ముందంజవేయడానికి మహదవకాశం కలిగింది. శ్రీ నందమూరి తారకరామారావుకు ప్రజలు తమ ప్రేమాదరాలతో పట్టాభిషేకం చేశారు. శ్రీ రామారావు తన షష్టిపూర్త్యుత్సవ సందర్భంలో రాజకీయాలలో ప్రవేశిస్తారని గడచిన మార్చి నెలలో తొలిసారిగా ఆంధ్ర సచిత్ర వారపత్రిక హైదరాబాద్ నోట్ బుక్ ప్రచురించినప్పుడు పలువురి నుంచి ఆశ్చర్యం ప్రకటిస్తూ ఉత్తరాలు వచ్చాయి. శ్రీ రామారావు తమ షష్టిపూర్త్యుత్సవంలో కాక అంతకు ముందే రాజకీయ ప్రవేశాన్ని ప్రకటించారు. శ్రీ రామారావు తెలుగుజాతి ఆత్మ గౌరవం నినాదంతో ప్రజలనుఆకర్షిస్తారని, ఎన్నికలలో కనీసం వంద స్థానాలయినా వస్తాయని హైదరాబాద్ నోట్ బుక్ సూచించినప్పుడు పలువురు ఆశ్చర్యం ప్రకటించి, యావద్భారత రాజకీయ పక్షాలకే (కాంగ్రెస్ కాక) వంద సీట్లు లేవు. ఈ కొత్త గుడ్డుకా వంద సీట్లు ? అన్నారు. మొదట ఉపేక్షిస్తారు, తరువాత ఈసడిస్తారు. పిదప పరిగణిస్తారు అనేది ప్రజా సేవలో పరిగణన సూత్రం. ఈ సూత్రం అక్షరాలా శ్రీ రామారావుకు వర్తించింది. మొదట్లో ఉపేక్షించారు.ఇతరరాజకీయనాయకులు పిదపరంగులు పూసుకోకరాజకీయాలుఇతనికెందుకు ?—అని ఈసడించారు. (రాజకీయాల్లు తమ పిత్రు పితామహ ప్రపితామహుల ఆస్తిఅయినట్లు). ఆరణాల కూలీ అగ్రనాయకుడయినపుడు చదువూ, సంస్కారమూ కలిగి నాలుగు దశాబ్దాలపాటు కళారంగంలో ఉన్నవాడు రాజకీయాలలో ప్రవేశించడంలో తప్పేమిటి? అని ఆలోచించకనే దుమ్మెత్తిపోశారు.ప్రతిపక్షాలు (ముఖ్యంగా వామపక్షాలు) తమ సహకారం లేనిదే కాంగ్రెస్ ఐ ని గద్దె దించడం సాధ్యంకాదని అన్నాయి. క్రమంగా ఆయనను పరిగణించడం, ఆయనతో ఇతర పక్షాలు బేరాలకు దిగడం, అందరికీ తెలిసిన సంగతే. శ్రీ రామారావు అసహాయశూరుడుగా, ఏకాంగి వీరుడుగా



రణక్షేత్రంలోకి దిగి విజయలక్ష్మిని చేపట్టారు. ఆయన బి. జె. పి.తో పొత్తు కుదుర్చుకొని ఉంటే అన్ని స్థానాలను వూడిపారేసిఉండేవారని చాలమంది అభిప్రాయం. దానికి ఎన్నో ఆటంకాలు వచ్చాయి. కొందరు కులాల దృష్టితో రాజకీయాలు విశ్లేషించేవారు- శ్రీ రామారావు ఒక కులానికి చెందినవారు గనక, ఆ కులం వారి పరిపాలన దక్షతనుశంకిస్తున్నారు. తంజావూరు, మధుర నాయక రాజులు కమ్మవారు. వారిపాలనలో సంగీత సాహిత్యాది కళలలోనే కాక ఆయా రాజ్యాలు అన్ని రంగాలలోను ముందంజవేసినట్లు మనకు చరిత్ర సాక్షి. కనుక పరిపాలన విషయంలో ఎలాటి అనుమానాలు చెందనక్కరలేదు. శ్రీ రామారావు ఈ విషయంలో ప్రజలకు ఇచ్చిన హామీలు నిరర్థకాలుకావని మనం విశ్వసించవచ్చు. జనవరి 5న రాష్ట్ర విధాన సభకు జరిగిన ఎన్నికలో శ్రీ రామారావు నాయకత్వంలో ఉన్న తెలుగు దేశం మూడింట రెండు వంతులకుపైగా మెజారిటి సంపాదించింది. శ్రీ రామారావు జనవరి 8న తేదిన తెలుగుదేశం లెజిస్లేచర్‌పార్టీ నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. తన మంత్రివర్గం అవినీతిని తొలగించి, పరిశుద్ధమయిన నిష్పాక్షికమయిన పరిపాలన కొనసాగిస్తుందని ఆయన ప్రజలకు హామీనిచ్చారు, శ్రీ నందమూరి తారకరామారావు 1923 మే 28న జన్మించారు. గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో చదివి1947లోపట్టభద్రులయ్యారు.1948లో జాయింట్ సబ్‌రిజిస్ట్రారుగా ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించి,కొన్నినాళ్ళు మాత్రమే పనిచేసి, దానిని వదిలి చలనచిత్ర రంగంలో ప్రవేశించారు. ఆయన తొలి సారిగా నటించిన చలనచిత్రం 'మనదేశం'.ఇది1949లో విడుదలయింది. పిదప ఆయన 300 లకు పైగా చిత్రాలలో నటించారు. నిర్మించారు,దర్శకత్వం వహించారు. ఆయన పలు పౌరాణిక, చారిత్రిక, సాంఘికచిత్రాలలో నటించారు.ఆయనకు విశేషకీర్తితెచ్చింది మాయాబజారు చిత్రంలోశ్రీకృష్ణపాత్ర. ఆయన 'నేషనల్ ఆర్ట్స్ థియేటర్స్' పేరుతోచలనచిత్ర నిర్మాణ సంస్థను 1953లోను, రామకృష్ణ సినీ స్టూడియోస్‌ను 1976లోను ప్రారంభించారు. ఆయన సంఘానికి చేసిన సేవ కూడ గణనీయమైనదే. ఆయన 1952లో రాయలసీమ క్షామ నిధికి లక్షన్నర రూపాయలు సేకరించి ఇచ్చారు. అది రామకృష్ణ మిషన్ ద్వారా సద్వినియోగమైంది. 1965లో పోలీసు కానిస్టేబుల్స్ కుటుంబ సంక్షేమ నిధికి మూడు లక్షలకు పైగా వసూలు చేసి ఇచ్చారు. ఆ సంవత్సరమే జాతీయ రక్షణ నిధికి పది లక్షల రూపాయలకు పైగా వసూలు చేసి అప్పటి ప్రధాని శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రికిఅందజేశారు. భారత ప్రభుత్వం ఆయనను 1968లో 'పద్మశ్రీ'బిరుదంతో గౌరవించింది. శ్రీ రామారావు 1942లో వివాహం చేసుకున్నారు. ఆయన సతీమణి పేరు శ్రీమతి బసవరామ తారకం. ఆయన "తెలుగు దేశం" పార్టీని 1982 మార్చి 29న స్థాపించారు. తొమ్మిది నెలలపాటు రాష్ట్రం నాలుగంచులా నిర్విరామంగా పర్యటించి తెలుగు వారికి ఆత్మగౌరవ ప్రబోధం చేశారు. తెలుగువారు ఆయన చిత్తశుద్ధిని విశ్వసించారు. మార్పువల్ల తమకు మేలు కలగగలదని విశ్వసించారు. ఆయన పార్టీని గెలిపించారు శ్రీ రామారావు జనవరి 7న పత్రికా ప్రతినిధుల సమావేశంలో ముచ్చటిస్తూ కేంద్రప్రభుత్వంతోతాను సంపూర్ణంగా సహకరిస్తానని, మన రాష్ట్రాభివృద్ధి విషయములో కేంద్రం సంపూర్ణంగా సహకరిస్తుందని ఆశిస్తున్నానని అన్నారు. డబ్బు సంచులు ప్రజలను మభ్యపెట్టలేకపోయాయని ప్రజలు తమ ఇష్టానుసారం ఆత్మ గౌరవంతో వోటు చేశారని ఆయన అన్నారు.తాను తన కార్యక్రమాన్ని పేదలు నివసించే గ్రామాల హరిజనుల వాడల అభివృద్ధితో ప్రారంభిస్తానని,కిలో బియ్యం రెండురూపాయలకే ఇచ్చే పనిని కొనసాగిస్తానని అన్నారు. రెండు రూపాయలకే కిలో బియ్యంఎలాఅమ్ముతారని ప్రశ్నించగా ఆ పథకం వివరాలింకా ఆలోచించాలన్నారు. తాను ఒక్కరూపాయి జీతం లాంఛనంగా తీసుకుంటానని, ప్రభుత్వం దుబారాఖర్చు చేయకుండా చూస్తానని అన్నారు. రాష్ట్రం పేరును తెలుగునాడు అని మార్చడానికి నిశ్చయించుకొన్నామని ఆయన చెప్పారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

శ్రీ రామారావును రాష్ట్రప్రభుత్వం ఉన్నతాధికారులు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ జి. ఎస్. రామన్, పోలీస్ డైరెక్టర్ జనరల్ శ్రీ ఆనందరామం, పొలిటికల్ సెక్రెటరీ శ్రీ నారయ్య జనవరి 7న ముషీరాబాద్‌లోని తెలుగు దేశం పార్టీ ప్రధాన కార్యాలయంలో కలుసుకుని 40 నిముషాలపాటు చర్చలు జరిపారు. తెలుగు దేశం ప్రభుత్వం నిర్మాణం విషయమై చర్చలు జరిగినట్లు తెలుస్తున్నది. పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్(ఇంటెలిజెన్స్) శ్రీ విజయ రామారావు కూడా శ్రీ రామారావును కలుసుకున్నారు. ఈ చర్చల సందర్భంలో తెలుగుదేశం నాయకుడు శ్రీ నాదెండ్ల భాస్కరరావు కూడా ఉన్నారు.

**ఉపశ్రుతి :**

"మలయాళీ లారీలవారికి కాంగ్రెసువారు మాట్లాడుకొన్న కిరాయి ఇవ్వడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయికదా? మీకు కిరాయిఅందిందా లేదా?" అనడిగాను ఒక లారీ యజమాని అయిన నా మిత్రుడ్ని. ఏరు దాటిన తర్వాత తెప్ప తగలేసే వ్యవహారాలు నాకు తెలుసుసార్! మొదట్లోనే బయానాగా పుచ్చుకొన్నాను కిరాయంతా— అన్నాడు అతడు. ★

---

**గ మ ని క**

పాఠకులు పద్య వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు కనుక 'వంటలు' పంపేవారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.

---




### గంగాధరం సాహితీ కుటుంబం విజ్ఞప్తి

గంగాధరం సాహితీ కుటుంబం (రిజి) (చిత్తూరు) వారు ప్రతి సంవత్సరం మే 29న "మాతలపాటి సాహితీసత్కారం" పేరుతోఅందజేసే రు.1116ల అవార్డుకు ఈ ఏడాది రచనలు పంపదలచిన, రచయిత(త్రు)లకు ఆసంస్థ కార్యదర్శి ఎస్. ముని సుందరం ఈక్రింది విధంగా తెలియచేస్తున్నారు. ఈ సంవత్సరం ఉత్తమ నవలకు అవార్డు యిస్తారు. నవల ప్రథమ ముద్రణ 1—1—80 నుండి 31—12—82 యీ మూడేళ్ళ వ్యవధిలో జరిగి వుండాలి. ఇతివృత్తం నేటి తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి. అనువాదాలు, పత్రికానుబంధ నవలలు వ్రాతప్రతులు దయతో పంపరాదు. ఉత్తమ నవల ఎంపిక మా పరిశీలనకు వచ్చిన నవలల నుండే జరుగుతుంది. ప్రచురణ కర్తలు కూడ పుస్తకాలు పంపవచ్చు. అయితే అవార్డు రచయిత(త్రి)కే యివ్వబడుతుంది. రచయిత స్వయంగా వచ్చి సంస్థ ఏర్పాటు చేసిన సభలో అవార్డు అందుకోవాలి. వేరే విధంగా, అవార్డు పంపడం జరుగదు. సంస్థ పరిశీలనకై నాలుగు ప్రతులు 15—3—83లోగా కార్యదర్శి గంగాధరం సాహితీకుటుంబం(రిజి)3—4—58 గిరింపేట, చిత్తూరు—2 చిరునామాకుపంపాలి. పుస్తకాలు తిరిగి పంపబడవు. నిర్ణయించిన తేదీ తర్వాత అంది, పుస్తకాలు పరిశీలించబడవు. ఎప్పటిలాగే రచయితలు, రచయిత్రులు సహకరించి మా ప్రయత్నానికి చేయూత నివ్వాలని ప్రార్థన.

### శ్రీ కుందుర్తి స్మారక బహుమతి — 1982 విజేతలు

1982 వ సంవత్సరానికి ప్రకటించిన కీ. శే. లు కుందుర్తి స్మారక బహుమతిని పొందటానికి ఈ క్రింది వర్ధమాన కవులు ఎంపికైనట్లు సాంస్కృతీ సమాఖ్య రాష్ట్రకమిటీ ప్రధాన కార్యదర్శి శ్రీ వి. శిరీష్‌కుమార్ తెలియజేస్తున్నారు. ప్రథమ బహుమతి 'యుగ శిశువు, శ్రీ రంగబాబు, ద్వితీయ బహుమతి 'టచ్ మీ నాట్' శ్రీ పైడిపాల, తృతీయ బహుమతి — మానవత్వపు మెరుగులు శ్రీ గుండాన జోగారావు, కన్సొలేషన్ బహుమతులు : యువతరం చేతులు కలపండి—కుమారి సీతంరాజు ఉమాజ్యోతి, 'శక్తి' శ్రీ బి.జె. జెన్నా, 'అనంత భ్రమణం' శ్రీ ఆచార్య తిరుమల.

1983 వ సంవత్సరానికి కుందుర్తి స్మారక బహుమతి విలువను రు. 500 లు దాకా పెంచిస్తున్నట్లు కమిటీ ప్రధాన కార్యదర్శి తెలియచేస్తున్నారు.

### శ్రీ మధ్వుల తత్వ విచారము

రచన: శ్రీ చీరాల పురుషోత్తమ రావు. వెల: 3 రూపాయలు. 90 పేజీలు. ప్రతులకు: రచయిత పేర 7/410—3గొడుకుపేట, మచిలీపట్నం అన్న చిరునామాకు వ్రాయాలి.

### మోతీమహల్

శ్రవ్య నాటికల సంపుటి. రచన: శ్రీక్రొవ్విడి రామం. వెల: 10 రూపాయలు. 119 పేజీలు. ప్రతులకు: రచయిత పేర కేఆఫ్ కె. వి. వరహాలరావు, మెయిల్ మాన్ ఆర్. ఎమ్. ఎస్. ఆఫీసు, విజయనగరం అన్న చిరునామాకు వ్రాయాలి.

### 'న్యూ ఎక్స్ రే'

కీ. శే. చెరబండ రాజా సంస్మరణ సంచిక. వెల: 2 రూపాయలు. 76 పేజీలు. ప్రతులకు: ఎక్స్‌రే పబ్లిషర్స్, కొల్లూరి హవుస్, అమలాపురం.

### అణు సైన్యం

మినీ కవితల సంపుటి. రచన: 'మాధవీసనారా' వెల: ఒక రూపాయి ఏభై పైసలు. ప్రతులకు: రచయితపేర కేఆఫ్ శ్రీ ఎస్. రాములునాయుడు, చోటా ఆయ్మా పోస్టు ఆఫీసు, నిమ్పురా, ఖరగ్‌పూర్—721304.

---



---


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**


"చట్టానికి వేయికళ్ళు" తో
జయమాలిని